చెమట నుండి
కల్గుతుంది అలసట

పనులే కానియ్యండి, లేక ఆటలే కానియ్యండి,
చెమట పట్టినపుడు అత్యావశ్యక లవణాలను
(body salts) కోల్పోవడంతో శరీరం అలసి పోతుంది.
(ఈ అలసటను పోగొట్టడానికి సామాన్య పానీయాలు చాలవు).

పిల్లలకు ఆటలు, చదువు రెండూ ముఖ్యమే.
ఆటలాడేటపుడు చెమట పట్టడం స్వాభావికం. దీని
ఫలితంగా శక్తిని కోల్పోయి అలసట చెందితే చదువుపై
శ్రద్ధ చూపడం ఎలా సాధ్యం? ఈ అలసటను
పోగొట్టడానికి వారికి ఇవ్వండి ఎలెక్ట్రోస్. ఇది వారికి
త్వరగా చురుకుదనం అందిస్తుంది.
మీ బాబు చెమట పట్టి కోల్పోయిన అత్యావశ్యక లవణాలను
(Body salts) తిరిగి సమకూర్చే గ్లూకోస్‌తో కూడిన
రుచికర పానీయం ఎలెక్ట్రోస్. నారింజ రుచి కల్గినది.




**ఆరోగ్యానికి మూల స్థానం-**
**గ్లాక్సోవారి నుండి**
**ఒక క్రొత్త ఉత్పాదన- ఎలెక్ట్రోస్**

## సీరియల్స్

కుష్బూ, వెంకటేష్ ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక చూడ ముచ్చటగా ఉంది. ఇందులో కరిగిన శిల సీరియల్ ప్రారంభం బాగుంది.

దువ్వాడ శ్రీకాంత్,
కాశీబుగ్గ (రైల్వే కాలనీ)

★ ★ ★

27 జూన్-3 జులై వెంకటేష్ కుషుబూ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది. "కరిగిన శిల' సీరియల్ మొదటి లోనే మమ్ముల నెంతో ఆకట్టుకుంది. రచయిత్రి రావి నూతల సువర్ణా కన్నన్‌కు మా హృదయ పూర్వక అభినందనలు.

నాగంత్ల వెంకటేశ్వర్రావు
అమ్మాపాలెం

★ ★ ★

ది 27 జూన్-3 జూలై 86 వార పత్రికలో "కరిగిన శిల" సీరియల్ ప్రారంభంలో నే చాలా బాగున్నది

చోడాబత్తుల విశ్వనాథన్, కుప్పనపూడ

★ ★ ★

20-26 జూన్ 86 ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం నటి శోభన చాలా బాగుంది కాకాని కమలగారి 'జీవితం చేజారిందా?' సీరియల్ చాలా చక్కగా వుంది. రచయిత్రికి నా ధన్యవాదాలు.

బలివాడ కొండబాబు, ఇప్పలి

★ ★ ★

"కాల్‌గర్ల్". సీరియల్ చదువుతున్నంత సేపూ సి నిమా చూస్తున్న అనుభూతి కలుగుతోంది. ఈ నవలలో చంద్రం (నత్తి పాత్రను) ప్రవేశ పెట్టడం కొత్తగా వుంది. తర్వాత ఏం జరుగుతుందా! అన్న ఉత్కంఠను కలుగజేస్తోంది నవల.

గుప్తేష్వర్‌రావ్
జగదల్‌పూర్

## కథలు

20-26 జూన్ 1986 సంచిక లోని ఇసుకపల్లి లక్ష్మినరసింహ శాస్త్రి గారి "తాబేలు' కథ, బెహరా వెంకటసుబ్బారావు గారి "దోపిడి" కథలు చాల బాగున్నాయి.

కె. పృధ్వీసేన్‌రెడ్డి, హన్మకొండ

★ ★ ★

జూన్ నెల 20 తేది వారపత్రిక యందు ప్రచురించబడిన శ్రీ బెహరా వెంకటసుబ్బారావు గారి "దోపిడి" కథ వాస్తవానికి చాల దగ్గిరగా వుంది. ఈ కథ మా కుటుంబాన్నంతటినీ ఆకర్షించింది.

కె. వి. యల్. ఆర్. నాయుడు,
నార్తు రాజుపాలెం

★ ★ ★

జూన్ 20-26 సంచిక ముఖచిత్రం శోభన బాగుంది. 'గుడ్డివాడు' కథ వాస్తవానికి ఎంతో దగ్గరగా ఉంది. విచిత్ర యదార్ధ గాథలు శీర్షిక చాలా బాగుంది.

కె. పార్వతి, యస్. కోట

## ఉత్తరాలు

## శీర్షికలు

నటి శోభన ముఖచిత్రంతో వెలువడిన సంచిక చాలా ఆసక్తిదాయకంగా వుంది! ప్రశ్నావళి, న్యూఢిల్లీ లేఖ, ఫాల్గుని డైరి, వ్యక్తిగతం శీర్షికలు చాలా ఇంట్రస్టింగ్‌గా వుంటున్నాయి

మహ్మద్ సర్దార్‌పాష, పుల్లూరు

## విజ్ఞప్తి

మీరు ఎన్నో సీరియల్స్, నవలలు చదివి ఉంటారు. అందులో వరకట్న సమస్య ఇతివృత్తంగా ఉండే నవలలు ఏవైనా ఉంటే, వాటిని దయచేసి గుర్తు చేసుకొని, 'వాటి పేరు', 'దాన్ని రచించిన వారి పేరు', ఈ క్రింది అడ్రసుకు పంపండి. అంతేకాక వరకట్నానికి సంబంధించిన ఇంకా ఇతర పుస్తకాలు, ఎవరివైనా థిసిస్‌లు, సమాచారం అయినా నాకు తెలిపితే సంతోషిస్తాను, నేను చేసే పరిశోధనకు (తెలుగు నవలల్లో వరకట్న సమస్య చిత్రణ) మీరందరూ తోడ్పడుతున్నందుకు నా కృతజ్ఞతలు.

చిరునామా :
ఎస్. రాజేశ్వరి
6/82, ఎస్. వి. నగర్, తిరుపతి–517501 □

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)
1-7 ఆగస్టు 1986
శ్రీ అక్షయ నామ సం. ఆషాఢ బ. ఏకాదశి
సంపుటము 78 : సంచిక 47
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6నెలల చందా | రు. 71.50 |
| పోస్టులో 12నెలల చందా | రు. 143.00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి 'జయప్రద'
(ఫొటో : ఎం. కె. రామమూర్తి)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :

# రెండు రకాల సంస్కృతులు!

సంస్కృతిని గురించి ఎవరైనా మాట్లాడటం తనకి ఎప్పుడు వినిపించినా వెంటనే తన చెయ్యి అసంకల్పితంగానే పిస్తోలు పైకి వెళ్లేదని అన్నది గోబెల్ కదూ? ఈ దేశంలో మనం ఇంకా అంత ఫరకూ రాలేదు. అయితే సంస్కృతిని చాలా పెద్దఎత్తున గోబెల్‌ని ఇష్టపడే వాళ్లే తీసుకున్నప్పుడు మనం కూడా వచ్చామనిపిస్తుంది.

సంస్కృతిలో రెండు రకాలు ఉన్నాయి. అందులో ఒక దానిలో భారీఎత్తున డబ్బు, పెద్ద హడావుడి అర్జున్‌సింగ్ లాంటి బడా రాజకీయవేత్తలూ ఉంటారు. నిజానికి అది సంస్కృతే కాదు. బజారులో చాలా ఎక్కువ ధరకి అమ్మబడే, కొనబడే ఒక వస్తువు వంటిది. పుపుల్ జయకర్ వంటి డబ్బు, పలుకుబడి బాగా ఉన్న వ్యక్తులకి మాత్రమే అందుబాటులో ఉండే ఒక రకం కాలక్షేపం లాంటిది అది. అందుకే భారత్ భవన్ లాంటి వాటితో జయకర్, అర్జున్‌సింగ్‌లు సంబంధాలని కలిగి ఉండటంలో ఆశ్చర్యమేమీ లేదు. భారత్ భవన్ కార్యదర్శి ఒక ఐ. ఎ. ఎస్. అధికారి. శ్రీమతి జయకర్ లాగే ఆయన కూడా ఎక్కువ సమయాన్ని న్యూయార్క్, పారిస్‌లలో విలాసవంతంగా గడుపుతూ ఉంటారు ఒక్క ఒరిస్సాని మినహాయిస్తే దేశంలో అత్యంత వెనుకబడిన రాష్ట్రం అయిన మధ్యప్రదేశ్‌లో కూడా మరొక రకం సంస్కృతి విలయతాండవం చేస్తున్నది. పన్నులు కట్టే వారి కర్చుతో కోట్లాది రూపాయలు వెచ్చించి అలాంటి పథకాలని రూపొందించి ఆ డబ్బుని రాష్ట్రంలోని కళాకారులకి కాకుండా ఢిల్లీ నుంచో, మరో చోటి నుంచో వచ్చే హుస్సెయిన్ లాంటి వారిపై కర్చు పెడుతున్నారు. వాళ్లకే ప్రతిఏటా ఒక దానిపై మరొకటిగా బహుమతులు అందుతూ ఉంటాయి. బహుమతులంటే శాలువాలు, దంతపు బొమ్మలను కునేరు, కానేకాదు, లక్షల విలువ చేసేవి. అక్కడి నుంచే అన్నిరకాల అవినీతికరమైన పనులకూ రంగం సిద్ధం అవుతూ ఉంటుంది. భారతీయ ఉత్సవాల వంటివి కూడా ఆ కోవకి చెందినవే.

ఈ భారతీయ ఉత్సవాల వల్ల మనకి వొరిగింది ఏమిటి? అవి మనలాంటి వాళ్లకి కాక న్యూఢిల్లీలోని రేస్‌కోర్స్ రోడ్డుని పట్టుకుని వేలాడే చాలా కొద్ది మందికి మాత్రమే బాగా లాభించాయి. అదే విధంగా పుపుల్ జయకర్‌కి కూడా వాటి వల్ల మంచి ప్రయోజనం కలిగింది. ఆమెని నేను ఒకే ఒక్కసారి కలుసుకున్నాను. అప్పుడు ఆమె భర్త బొంబాయిలోని ఒక సిమెంట్ కంపెనీకి ప్రజా సంబంధాల అధికారిగా ఉండేవారు. నాకు తెలిసినంతలో ఆమెకి పాడటం కానీ, నృత్యం చేయటం కానీ రాదు. ఎవరైనా చదవటానికి పనికి వచ్చేదేది కూడా ఆమె రాయలేదు. అలాంటి ఆమె పన్ను కట్టే భారతీయుడి డబ్బు ఇంత వరకూ ఎంత కర్చు పెట్టిందో చూస్తుంటే నాకు ఎంతో ఆశ్చర్యంగా ఉంటుంది. అందిన సమాచారాన్ని బట్టి ఆమె రోజుకు 400 అమెరికా డాలర్లు పెట్టి ఎయిర్ కండిషన్ చేయబడిన విలాసవంతమైన పెద్ద కారుని ఒకదాన్ని అద్దెకి తీసుకునేవారు. అదేమీ తక్కువ మొత్తం కాదు. భారతదేశంలోని మొత్తం తలసరి సంవత్సర ఆదాయం కన్నా అది చాలా ఎక్కువ. ఈ డబ్బంతా ఎక్కడిది? ఇంత పెద్ద మొత్తాలని ఎవరు ఆడిట్ చేస్తారు? కొన్ని బహుళ జాతి సంస్థలు, కొన్ని బాంక్‌లతో సహా దానిని సమకూర్చాయని విన్నాను. అందుకు ప్రతిగా వాటికి లభించిందేమిటన్నది ఆసక్తిని కలిగించే విషయం. భారత్ భవన్‌కి చాలా పెద్ద మొత్తాలలో విరాళాలని అందజేసే సంస్థలలో యూనియన్ కార్బయిడ్ అనే కంపెనీ కూడా ఉందనివిన్నాను. ఆ డబ్బు ఘోరమైన ఆ విషవాయు ప్రమాదం జరగక ముందు ఇచ్చినదా లేక తర్వాత ఇచ్చిందా? ఇంతవరకూ మనకి సమాధానం దొరకని ప్రశ్నలు ఇవే. కానీ ఇలాంటి ప్రశ్నలకే ఏదో ఒక రోజున పుపుల్ జయకర్, అర్జున్‌సింగ్‌లు సమాధానం చెప్పవలసి ఉంటుంది.

మళ్లీ నా మొదటి ప్రశ్నకే వస్తాను. లక్షల డాలర్లు కర్చుపెట్టి మనం నిర్వహించిన భారతీయ ఉత్సవాల వల్ల మనకి వొరిగిందేమిటి? కొందరు పారిస్ వాసులకి ఈఫిల్ టవర్ వెలుపల ఒంటిలని చూసే అవకాశం కలిగింది. వాటిని వాళ్లు ఏ సర్కస్‌లో అయినా చూస్తారు. కొన్ని రకాల భారతీయ వంటకాలని రుచి చూసేందుకు వీలైంది. కానీ వాటిని వాళ్లు ప్రతి నిత్యం పారిస్, న్యూయార్క్‌లలో గల భారతీయ రెస్టారెంట్‌లలో తినవచ్చు. ఎందుకంటే అవి ఢిల్లీలోని కన్నాట్ ప్రాంతంలో సర్కారు వంటవాళ్ల చేత తయారు చేయబడిన వాటికన్నా ఎంతో బాగుంటాయి. అమెరికా వారి హేంబర్గర్లని తింటే అమెరికా గురించి ఎంత తెలుస్తుందో భారతీయవంటకం అయిన దోసెలని తిన్నా భారతదేశం గురించి అంతే తెలుస్తుంది. అక్కడ మనం 400 డాలర్ల రోజు అద్దెతో విలాసవంతమైన కారుని అద్దెకి తీసుకుని అమెరికన్‌లని మన వంటకాలని రుచి చూపమని వెంటబడటం అన్నది అమెరికా అధ్యక్షుడు రీగన్ తమ హేంబర్గర్‌లని రుచి చూపమని కన్నాట్‌ప్రాంతంలో మన వెంటపడినట్లే ఉంటుంది.




అలాంటి సంస్కృతి అంటే ముఖ్యంగా కాంగ్రెసు రాజకీయ వాదులకి అంత వ్యామోహం ఎందుకో? వారిలో చాలామంది నడమంత్రపు సిరి అబ్బినవాళ్లే మగ, అది అంతా అనుకోని విధంగా అధికారాన్ని తద్వారా డబ్బుని పొందినటువంటి వారే. ఆ రెండిటి మధ్యా అవినాభావ సంబంధం ఉన్నది. డబ్బు, అధికారం ఉన్నా కూడా వాళ్లు తక్కువగానే చూడబడుతున్నారు. వాళ్లని ఎవరూ అంతగా పట్టించుకోరు. ముఖ్యమంత్రి అయ్యేదాకా అర్జున్‌సింగ్‌ఎవరో బహుశ ఆయన తండ్రిని ఎరిగివున్న కొద్దిమందికి తప్ప ఎవరికీ తెలియదు. ఉన్నట్లుండి ఆయనకి చాలా డబ్బు వచ్చింది. చలువరాతి భవనాన్ని అత్యాధునికంగా నిర్మించారు. అటువంటి భవనాలని నిర్మించిన రాజకీయవాదులు వందలమంది ఉన్నారు. ఆ తర్వాత కళాకారులని పోషించటం ముషాయిరాలని, కళా ప్రదర్శనలని నిర్వహించి గాయకులని, చిత్రకారులని ఆహ్వానించటం, వాళ్లపై బహుమతులని గుప్పించటం చేస్తూ ఉంటారు. అప్పుడే వాళ్లు నాగరికులుగా, అభిరుచి, ఉన్నతమైన సంస్కారం ఉన్న వ్యక్తులుగా చలామణీ అవుతూ ఉంటారు. వ్యాపారవేత్తలంతా బాగా డబ్బు సంపాదించిన తర్వాత ఇదే విధంగా చెయ్యటానికి ప్రయత్నిస్తుంటారు. వారి దృష్టి అంతా హమేషా తమాషా వంటి వాటికే పరిమితం అయి ఉంటుంది. వారి సంగీత జ్ఞానం కూడా "బోనీ ఎం"ని మించిపోదు. రు. 50 వేలు తీసుకునే హుస్సెయిన్ లేదా కిషన్‌ఖన్నాకంటే ఆయా రంగాలలోని ఏ వ్యక్తి తీసిపోడు. ఢిల్లీలోనే అటువంటివారు కనిపిస్తారు. పుపుల్‌జయకర్, సోనియాగాంధీ వంటి పేర్లు సాధారణంగా వినిపిస్తూ ఉంటాయి. వాటిని దిగుమతి లైసెన్సులు సంపాదించుకోటానికి, సంపన్నుల కాలనీలలో స్థలాలు సంపాదించటానికి ఉపయోగించుకొంటూ ఉంటారు కొంతమంది.

భారత్‌భవన్‌ని సమర్థించే వారందరూ దాని పాలకులైన రాజకీయవాదులని, అధికార వర్గాన్ని సమర్థించేవారే కానీ దాని కళాకారులకోసం మాత్రం కాదు. వాళ్లు అదొక అద్భుతమైన ప్రదేశంగా చిత్రించి హడావుడి చేస్తుంటారు. కానీ అక్కడ కారంత్, తదితరులు దర్శకత్వం వహించిన నాటకాలని చూడటానికి వచ్చేవారు అరడజను మంది కంటే ఎక్కువ ఉండరనిపిస్తుంది. ఇది అసలు కళేకాదు. బొంబాయిలో మంచి నాటకాలు ప్రదర్శింపబడినప్పుడు వందలాది మరాఠీ ప్రేక్షకులతో థియేటర్లు క్రిక్కిరిసి పోతాయి. అక్కడ బహుమతులు ఇవ్వటానికి పుపుల్ జయకర్‌లూ, అర్జున్‌సింగ్‌లూ ఎవరూ లేరు. నిజమైన కళ అనేది దానిని ఆరాధించే అభిమానుల వల్లనే నిలబడుతుంది. అదే విధంగా నిజమైన సంస్కృతి, సాహిత్యం కూడా. వాటిని నిలబెట్టవలసింది ప్రజలేకానీ పాలకులు కాదు. □

# శ్వేత

## ఎమ్. ఉమాలక్ష్మి

అమావాస్య రాత్రులవడం వల్ల, చీకటి దట్టంగా ఉంది. ఆకాశంలో నక్షత్రాలు తళుక్ తళుక్‌మని మెరుస్తున్నాయి.

అప్పటికే చాలా రాత్రి అవడంతో, శ్వేత త్వర త్వరగా నడుస్తోంది. ఆ చల్లని చిరు గాలిలో కూడా ఆమె ముఖంమీద స్వేద బిందువులు అలుముకున్నాయి.

ఈ ఆలస్యానికి ఇంటి దగ్గర ఏం సంజాయిషీ చెప్పాలో అని ఆలోచిస్తూ, వడి వడిగా అడుగులు వేస్తోంది శ్వేత!

శ్వేత ఇల్లు చేరేసరికి తొమ్మిది గంట లయ్యింది వీధి గుమ్మంలో లైటు వెలుగుతోంది.

గేటు త్రోసుకొని లోపలికి అడుగు పెట్టబోయి, ఎదురుగా రౌద్ర రూపంతో నిల్చున్న తండ్రిని చూసేసరికి బెదిరినట్లు అక్కడే ఆగిపోయింది.

"శ్వేతా! ఇంత రాత్రి వరకు ఎక్కడున్నావు?" కరకుగా వినిపించింది విశ్వనాథం గొంతు.

"ఆఫీసులో కాస్త పనుంది. అందుకే.. .. అందుకే ఆలస్యమైంది" అంటూ లోపలకి అడుగు వెయ్యబోయింది.

"ఆగు! నెల రోజులబట్టీ, ఇదే సమాధానం చెప్తున్నావు. ఇప్పటికైనా నిజం చెప్తావా? లేక ఆ ఉద్యోగం మానేస్తావా!" తీక్షణంగా అడిగాడు విశ్వనాథం.

"నాన్నా! నేనేం తప్పు పని చెయ్యలేదు. నన్ను నమ్మండి. నా మంచి చెడ్డలేవో నాకు తెలుసు." ధైర్యాన్ని కూడదీసుకొని అంది.

అంతే! శ్వేత చెంప ఛెళ్ళుమంది

అతిగా వాగావో కాళ్ళు చేతులు కట్టి గదిలో పడేస్తాను. నీ మెడలు వంచి, అరుణ్‌చేత మూడు ముళ్ళు వేయిస్తాను. నా దగ్గర నాటకాలాడావో చంపేస్తాను" ఆవేశంతో వూగిపోతున్నాడు విశ్వనాథం.

అతడి అరుపులకి లోపల పని చేసుకుంటున్న విమల గబగబా వచ్చింది.

తల్లిని చూడగానే దుఃఖం పొంగుకు వచ్చింది శ్వేతకు.

"అమ్మా! నేనేం తప్పు పని చెయ్యలేదు. నన్ను నమ్ము! అంది తల్లి గుండెల్లో తల దాచుకుంటూ.

'శ్వేతా! ఏడుస్తున్నావా' ఏమిటిది? చిన్న పిల్లలా! అయినా మీనాన్నగారు అన్నదాంట్లో తప్పేముంది? కాస్త వేళ ఉండగా ఇంటికి రావడానికి ప్రయత్నించు." అంది నచ్చజెప్తున్నట్లు.

"నువ్వలా గారాబం చెయ్యబట్టే, అదిలా పాడయ్యింది. అసలు దాని చేత ఉద్యోగం చేయించనంటే విన్నావుకాదు. దానిమాట ప్రకారం దాన్ని ఉద్యోగానికి పంపావు. ఈ ఇంట్లో అంతాదాని ఇష్టమే! అసలు దాన్ని ఇలా తయారు చేసినందుకు నిన్ననాలి." ఆవేశంగా అంటుండగానే గుండెల్లో నొప్పి వచ్చి మాట్లాడలేక పోయాడు

"ఏమిటండి! ఏం జరిగింది?" గాబరాగా అడిగింది విమల.

విశ్వనాథం నోట మాట రాక కుప్పలా కూలిపోయాడు.

అతడిని మెల్లగా మంచం దగ్గరకు నడిపించి, మంచం మీద పడుకో బెట్టారు విమల, శ్వేత, జ్యోతి.

విమల నోట్లో కొంగు అడ్డం పెట్టుకొని ఏడుస్తోంది.

"శ్వేతా! నువ్వు రోజురోజుకి మొండి దానివై పోతున్నావు. నీవల్ల మళ్ళీ గుండెల్లో నొప్పి వచ్చింది." మందలిస్తున్నట్లు అంది జ్యోతి.

"అక్కా! నాన్న నాకూ కావాలి." అంది పూడుకు పోయిన గొంతుతో శ్వేత!

జ్యోతి తండ్రికి ఒక టాబ్లెట్ ఇచ్చి, మ్రింగించింది.

విశ్వనాథం మరేమి మాట్లాడలేక బరువుగా కళ్ళు మూసుకున్నాడు.

"శ్వేతా! నాన్నగారి మాట విని, ఆ ఉద్యోగం మానెయ్యి కూడదూ! అనవసరంగా ఆయనకి కోపాన్ని తెప్పిస్తున్నావు. నువ్వు లక్షణంగా పెళ్ళి చేసుకొని , పిల్లా పాపలతో, కళకళలాడుతుంటే చూడాలన్న ఆరాటమే తప్ప, మాకింకేం కోరిక లుంటాయి? ఈ వయసులో మీ నాన్న గారిని బాధపెట్టడం నీకు న్యాయమేనా! ఆయన అసలే గుండె జబ్బుమనిషి. మళ్ళీ గుండెల్లో నొప్పివస్తే ప్రమాదం అని నాభయం. ఆయన్ని నాకు దూరం చెయ్యొద్దు. ఆయన లేకుండా నేను బ్రతకలేను." అంది విమల ఏడుపు గొంతుతో!

"అమ్మా! నువ్వెంత అధైర్య పడిపోతావెందుకు? నాన్నగారు ఆరోగ్యంగా ఉండాలనే నేనూ కోరుకుంటున్నాను. కొన్నాళ్ళు ఓపిక పడితే, మీ మాట కాదనకుండా పెళ్ళి చేసుకుంటాను".

"అసలు నీకింత పట్టుదల ఎందుకో?"

"అమ్మా! దయచేసి నన్నిప్పుడేమి అడగొద్దు". అని అక్కడ నుండి వెళ్ళి పోయింది.

* * *

విశ్వనాథానికి, ఒక కొడుకు, ఇద్దరు కూతుళ్ళు. బడిపంతులుగా పని చేసి, రిటైరు అయ్యేలోగా పెద్ద పిల్ల, జ్యోతికన్నా పెళ్ళి చెయ్యాలని ఎంతో తాపత్రయ పడ్డాడు. విశ్వనాథానికి ఆస్తిపాస్తులేం లేవు. కొడుకు వసంత్ నిరుద్యోగి. దానికి తోడు ఇద్దరు ఆడపిల్లలు. ఉద్యోగంలో ఉండగా అతడు గడించినది ఏమిలేదు. నీతి, నిజాయితి గల మంచి మాష్టరన్న పేరు మాత్రం సంపాదించుకున్నాడు.

తండ్రి సపాదించి ఇచ్చిన పాత పెంకు టిల్లు అమ్మి, ఎలాగో జ్యోతికి పెళ్ళి జరిపించాడు. జ్యోతి పెళ్ళికి ఇంకా ఐదువేలు కట్నం బాకీ ఉండిపోయింది. ఆ కట్నం ఇస్తేగాని, జ్యోతిని కాపురానికి తీసుకు వెళ్ళనని అల్లుడు రాజేష్ జ్యోతిని ఇక్కడ వదలి వెళ్ళిపోయాడు.

జ్యోతి పెళ్ళి అయిన ఆరు నెలలకే వసంత్‌కి ఉద్యోగం వచ్చింది. ఇకనైనా జ్యోతిని అత్తవారింటికి పంపవచ్చని ఎంతో ఆశపెట్టుకున్నాడు విశ్వనాథం.

కానీ వసంత్, సౌమ్యని ప్రేమించి పెళ్ళి చేసుకొని, ఈ ఇంటి నుండి శాశ్వతంగా బంధాలు త్రెంచుకొని వెళ్ళిపోయి నప్పుడు, ఏమి చెయ్యలేక మౌనంగా రోదించాడు.

కాల గమనంలో మరొక సంవత్సరం గడిచి పోయింది

మోడులా బ్రతుకుతున్న జ్యోతిని చూసి, దాని బ్రతుకు చక్కదిద్దాలన్న తాపత్రయంతో, అభిమానాన్ని చంపుకొని, కన్న కొడుకు ఆ మాత్రం సహాయం చెయ్యక పోతాడా అని, నోరు విడిచి, జ్యోతి కట్నం డబ్బు అడిగాడు. వసంత్ మొండి చేతులు చూపించాడే తప్ప, ఒక్క పైసా అయినా ఇవ్వలేదు.

ఒక వైపు గుండెల మీద కుంపటిలా పెళ్ళి కెదిగి కూర్చున్న శ్వేత, మరొకవైపు, అత్తవారింటి నుండి, నిర్దాక్షిణ్యంగా గెంటబడి, పుట్టింట పుట్టెడు దిగులుతో కూర్చున్న జ్యోతి, విశ్వనాథానికి తీవ్ర మనస్తాపాన్ని కలిగిస్తున్నారు.

తన కొచ్చే ఫించను డబ్బుతోను, ట్యూషన్స్ చెప్పి సంపాదిస్తున్న కొద్ది పాటి జీతంతోను, ఎలాగో ఇల్లు గడుపు కొస్తున్నాడు. ఈ పరిస్థితిలో జ్యోతి కట్నం బాకీ ఎలా తీర్చాలో తెలియక, బెంగపడి గుండె జబ్బుకి గురి అయ్యాడు విశ్వనాథం.

దాంతో విశ్వనాథం పూర్తిగా డీలాపడి పోయాడు.

విశ్వనాథం, తన మేనల్లుడు అరుణ్‌తో, శ్వేత పెళ్ళి జరిపించాలను కొన్నాడు. బంగారపు బొమ్మలా

ఉండే శ్వేతంటే అరుణ్‌కి ఇష్టమే! కానీ కట్నం లేకుండా శ్వేతని పెళ్ళి చేసుకుంటానన్నాడు.

ఇంతలో శ్వేతకి ఉద్యోగం వచ్చింది. శ్వేతని ఉద్యోగానికి పంపడం విశ్వనాథానికెంత మాత్రం ఇష్టం లేదు. కానీ శ్వేత మొండి పట్టుదల ముందు అతడు ఓడిపోక తప్పలేదు. శ్వేతకి, అరుణ్ అంటే ఇష్టమే! కానీ.... తను ఇప్పుడే పెళ్ళి చేసుకోనంది.

అరుణ్ విజయవాడలో ఉద్యోగం చేస్తున్నాడు. అరుణ్‌కి ఈ ఊరే ట్రాన్స్‌ఫర్ అవటంతో, తను మరొక పది రోజుల్లో వస్తున్నానని పెళ్ళికి త్వరగా ముహూర్తాలు పెట్టించమని ఉత్తరం వ్రాయడంతో, విశ్వనాథం బెంగ మరింత ఎక్కువయింది.

శ్వేత ఇప్పట్లో పెళ్ళికి ఒప్పుకున్నట్లు లేదు. అదీకాక శ్వేత ఉద్యోగం చేస్తుందని, ఇలా చీకటి పడినంత వరకు ఇంటికి రాదని తెలిస్తే, అరుణ్ ఏమనుకుంటాడో, శ్వేతని అపార్థం చేసుకొని, తనకి పెళ్ళి ఇష్టం లేదని, తన ముఖం మీదే చెప్పేస్తే, అప్పుడు తను అవమానభారంతో కృంగిపోవాలి. అరుణ్‌లాంటి యోగ్యుడిని, మంచివాడిని కాదనుకుంటే, తన జన్మలో శ్వేతకి పెళ్ళి చెయ్యలేడు. కట్నాలకోరల్లో చిక్కుకున్న జ్యోతి, మానసికంగా నలిగి పోతుంది. పెళ్ళి చేసుకున్నా దాని బ్రతుకు ఎడారి అయింది. శ్వేత బ్రతుకు కూడా అదేబాటలో నడవడం, కన్న తండ్రిగా తను సహించ లేడు.

అందుకే.... అందుకే శ్వేత చేత ఉద్యోగం మాన్పించాలి. మూడేళ్ళుగా వాయిదా వేస్తున్న ఈ పెళ్ళి ఇక ఆలస్యం చెయ్యడానికి వీల్లేదు. శ్వేతని దండించి అయినా సరే దాని చేత ఉద్యోగం మాన్పించాలి. శ్వేతకి ఇష్టమున్నా లేకపోయినా, అరుణ్ వచ్చిన వెంటనే ముహూర్తాలు పెట్టించెయ్యాలి.

ఆలోచిస్తూ బరువుగా కళ్ళు మూసుకున్నాడు విశ్వనాథం.

★ ★ ★ ★

మరొక పది రోజుల్లో అరుణ్ ఆ ఊరు వచ్చేసాడు.

అరుణ్‌ని చూసి, శ్వేత మనసులో పొంగిపోయినా, పైకి మాత్రం గంభీరంగా వుంది.

"శ్వేతా! అరుణ్ వచ్చాడు. వాడి కిప్పుడు ఏం సమాధానం చెప్తావో చెప్పు" అన్నాడు విశ్వనాథం కటువుగా.

బెదిరిన లేడిలా, తలదించుకొని, అరుణ్ ఉన్న గదిలోకి వెళ్ళబోయింది శ్వేత!

"ఇదుగో శ్వేతా! పెళ్ళికి ఇంక నువ్వేం అడ్డు చెప్పకు." హెచ్చరించింది విమల.

"శ్వేతా! నీ పెళ్ళి కళ్ళారా చూడాలని అందరం ఆశపడుతున్నాం. నాన్నగారి ఆరోగ్యం బాగు లేదు. ఇకనైనా పెళ్ళికి ఒప్పుకో!" నచ్చ జెప్తున్నట్లు అంది జ్యోతి.

అంతవరకు గదిలో ఏవో పుస్తకాలు తిరగేస్తున్న అరుణ్, శ్వేత రావడంతోనే హుషారుగా లేచి, ఆమె చేయి అందుకున్నాడు.

శ్వేత ముభావంగా ఉండడం గమనించి, "ఏమిటోయ్! కొత్త పెళ్ళి కూతురిలా అప్పుడే సిగ్గుపడి పోతున్నావు." అన్నాడు ఆమె చుబుకాన్ని పైకెత్తుతూ!

వర్షించడానికి సిద్ధంగా, శ్రావణ మేఘాల్లా ఉన్న ఆమె కళ్ళని చూసి తృళ్ళిపడి, "శ్వేతా! ఏమిటి అదోలా ఉన్నావు?" అన్నాడు.

"బావా! నన్ను.... నన్ను.... మన్నించ గలవా!" అంది గొంతు పెగల్చుకొని.

"నువ్వేం తప్పు చేసావని?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నీ మాట కాదంటున్నందుకు నన్ను మన్నించు బావా! మన పెళ్ళి ఇప్పట్లో జరగడం నా కిష్టం లేదు."

శ్వేతా! రోజు రోజుకీ నన్నెందు కిలా బాధిస్తున్నావు? అసలేం జరిగింది? నువ్వెందుకు ఎప్పుడికప్పుడు ఈ పెళ్ళి వాయిదా వేస్తున్నావు? నేనంటే నీ కిష్టం లేకపోతే చెప్పెయ్యి. నేనేం బాధపడను."

"బావా! అంత మాట అనవద్దు. నా మనసులో నీకు తప్ప వేరెవరికి స్థానం లేదు. కానీ.... కానీ.... మన పెళ్ళికి మరొక ఆరు నెలలు ఆగలేవా!"

"ఆరు నెలలే! మైగాడ్! ఇప్పటికే బాగా ఆలస్యం అయిపోయింది. ఇక నా వల్ల కాదు." అన్నాడు ఆమెను దగ్గరకు తీసుకోబోతూ!

"ప్లీజ్ బావా! నన్నర్థం చేసుకోవూ!" అంది అతడిని విడిపించుకుంటూ!

"అసలు నేనెందుకు ఆగాలి? నీకు ఉద్యోగం చెయ్యవలసిన అవసరం ఏం వచ్చింది? హాయిగా పెళ్ళి చేసుకొని, సంసారం చేసుకోక!" అన్నాడు చికాగ్గా!



## శ్వేత

"బావా! దయచేసి వివరాలు అడక్కు. నా కోసం ఒక్క ఆరు నెలలు ఆగలేవా? ఈ జీవితంలో నీ నుండి నేనింకేమి కోరుకోను. నా మాట మన్నించ లేవా!" అంది కళ్ళల్లో కన్నీరు తిరుగగా!

"శ్వేతా! ఛ! ఏడుస్తున్నావా! నీ కోసం ఆరు నెలలే కాదు. ఆరు యుగాలు ఆగమన్నా ఆగుతాను. నిన్ను తప్ప వేరెవరినీ ఈ జీవితంలోకి ఆహ్వానించ లేను. నీ ఇష్ట ప్రకారమే జరగనీ!" అన్నాడు ఆమె కన్నీళ్ళు తుడుస్తూ!

"థాంక్యూ బావా! థాంక్యూ!" అంది ఆనందంగా.

ఆ క్షణంలో శ్వేత కళ్ళల్లో మెరుపును చూసి ఆశ్చర్యపోయాడు అరుణ్!

* * * *

కాలగమనంలో మరొక ఆరు నెలలు సునాయాసంగా గడిచి పోయాయి.

ఆ రోజు అల్లుడు రాజేష్ దగ్గర నుండి వచ్చిన ఉత్తరం చూసి, ఇంటిల్లిపాదీ ఆనందంతో మునిగి పోయారు.

తను మరొక రెండు రోజుల్లో బయలుదేరి వస్తున్నానని, జ్యోతిని తనతో పంపడానికి సిద్ధంగా ఉండమని ఉత్తరం వ్రాసాడు రాజేష్!

తల్లి దండ్రుల ముఖాల్లో ఆనందాన్ని, అక్క కళ్ళల్లో కాంతిని చూసి తృప్తిగా నిట్టూర్చింది శ్వేత!

మూడేళ్ళుగా జ్యోతి కళ్ళల్లో మెరుపే మాయ మయ్యింది. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ, తన దురదృష్టానికి తిట్టుకుంటూ, తనలో తనే కుమిలిపోతూ, కాలం గడిపింది. భర్త వస్తున్నాడని, తన జీవితంలో తిరిగి వసంతం వస్తుందని, తెలుసుకున్న జ్యోతి ఆనందాన్ని పట్టలేక పోతుంది. అంతవరకు ఎప్పుడూ నీరసంగా, నిస్తేజంగా ఉండే జ్యోతి, ఇప్పుడు చలాకీగా తిరుగుతుంది.

"అమ్మా! నేను ఈ రోజు నుండి ఉద్యోగం మానేస్తున్నాను." అంది శ్వేత అన్నం తింటూ!

"శ్వేతా! నిజంగానా! ఇకనైనా పెళ్ళికి ఒప్పుకుంటావా?" అంది విమల ఆనందంగా!

"మీ ఇష్ట మమ్మా!" అని చెయ్యి కడుక్కొని అక్కడ నుండి లేచింది శ్వేత!

పెళ్ళి మాట ఎత్తేసరికి, ఎందుకో శ్వేత కళ్ళు, అప్రయత్నంగా సిగ్గుతో వాలి పోయాయి. బుగ్గలు గులాబి రంగులోకి మారిపోయాయి.

కూతురి ముఖంలో భావాలు గమనించి తృప్తిగా నిట్టూర్చింది విమల.

మరొక వారం రోజులకి రాజేష్ వచ్చి, జ్యోతిని తీసుకు వెళ్ళి పోయాడు.

జ్యోతి అత్తవారింటికి వెళ్ళి పోవడంతో, విమలకి, విశ్వనాథానికి సగం బెంగ తీరింది. అల్లుడు హఠాత్తుగా ఇంత మంచివాడుగా మారిపోవడం, అతడికి ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నా, రాజేష్ మనసు మారి, జ్యోతిని కాపురానికి తీసుకు వెళ్ళినందుకు మనసులోనే సంతోషించాడు.

ఇక శ్వేత పెళ్ళి కూడా చేసేస్తే తనకి బెంగే లేదు. ఆ తర్వాత విమలా, తను ఏమైపోయినా ఫర్వాలేదు. శ్వేత పెళ్ళికి ఒప్పుకుంది. అరుణ్‌తో మాట్లాడి ముహూర్తాలు పెట్టించాలి." ఆలోచిస్తూ పడక కుర్చీలో కూర్చున్నాడు విశ్వనాథం.

"ఏమండీ! ఈ రోజు కార్తీక సోమవారం. అలా శివకోవెలకి వెళ్ళి అభిషేకం చేయించి వద్దాం. జ్యోతి కాపురానికి వెళ్తే ఆ పరమేశ్వరుడికి రుద్రాభిషేకం చేయిస్తానని మ్రొక్కుకున్నాను. ఆ భగవంతుడు మన మొర ఆలకించాడు. దాని బ్రతుకు చక్కబడింది. ఇక మొక్కు తీర్చుకోవాలి" అంటూ వచ్చింది విమల.

"సరే, పద!" అని లేచి నిలబడ్డాడు విశ్వనాథం.

"అమ్మా! శ్వేతా! నువ్వు వస్తావా కోవెలకి?" పిలిచింది విమల.

"మీ రిద్దరూ వెళ్ళిరండి. నాకు కాస్త తలనొప్పిగా వుంది." అంది మంచం మీద నుండి లేవకుండానే.

"సరేలే! తలుపు దగ్గరకు వేస్తున్నాను. మేము వెళ్తున్నాం." అని అక్కడ నుండి కదిలింది విమల.

వాళ్ళు వెళ్ళిన కొద్ది సేపటికే అరుణ్ వచ్చాడు.

మంచం మీద పడుకొని ఉన్న శ్వేతని చూసి కంగారుగా "శ్వేతా! ఒంట్లో బాగు లేదా! అలా పడుకున్నావు." అన్నాడు ఆత్రంగా.

"ఎప్పుడొచ్చావు బావా? ఇంతట్లోనే నిద్ర పట్టేసింది." అంది లేచి కూర్చుంటూ.

"ఇప్పుడే వచ్చాను గానీ, అత్తయ్య, మామయ్య ఇంట్లో లేరా?" చుట్టూ చూస్తూ అడిగాడు అరుణ్.

"శివకోవెల్లో రుద్రాభిషేకం చేయించడానికి వెళ్ళేరు. కూర్చో బావా! కాఫీ చేసి తెస్తాను." అని లేచి నిలబడి, తూలి పడబోయింది.

అరుణ్ చప్పున ఆమెను పట్టుకొని మంచం మీద కూర్చోబెట్టాడు.

"శ్వేతా! ఏమిటి ఒళ్ళుపెనంలా కాలిపోతుంటే ఏమి లేదంటావు"! అన్నాడు శ్వేత శరీరం వెచ్చగా తగలడంతో!

"ఏమిటో బావా! రాత్రి నుండి ఒకటే తలనొప్పిగా వుంది." అంది అలసటగా కళ్ళు మూసుకుంటూ!

"అయితే డాక్టరుదగ్గరకి వెళ్ళనక్ఖరలేదా! బొత్తిగా నీ ఆరోగ్యం కూడా చూసుకోవడం మానేస్తున్నావు." మందలించినట్లు అన్నాడు.

"దీనికింత కంగారెందుకు బావా! నన్ను కంటికి రెప్పలా చూసుకునే, అమ్మా, నాన్న, నువ్వు ఉంటుండగా ఈ ప్రాణానికేం భయంలేదు".

"శ్వేతా! ఎన్నాళ్ళనుండో నిన్నొక విషయం అడగాలనుకుంటున్నాను. నాకు సరిగ్గా సమాధానం చెప్తావా!" అడిగాడు ఆమె కళ్ళల్లోకి చూస్తూ!

"ఏమిటో అడుగు బావా!"

"అసలు మన పెళ్ళి ఇన్నాళ్ళు వాయిదా వెయ్యడానికి కారణం ఏమిటి? మామయ్య వద్దన్నా నువ్వు ఉద్యోగం ఎందుకు చేస్తున్నావు? ఎవరికోసం? నీ సహచర్యంలో సేదదీర్చు కోవాలన్న ఈ దీనుడిని ఎందుకింత నిరాదరణ చేస్తున్నావు?"

"బావా! ఇన్నాళ్ళు ఈ నిజాన్ని చెప్పకుండా మీ అందరి మనసులు నొప్పించాను. నేను ఉద్యోగం చేసింది, కష్టపడి సంపాదించింది ఎవరికోసమో తెలుసా! అక్క కోసం . అక్క జీవితం బాగుపడాలని తాపత్రయపడ్డాను. బావగారికి ఐదు వేలు కట్నం బాకీ ఉండి పోయారు నాన్న. ఆడబ్బు ఇస్తే గానీ అక్కయ్యని కాపురానికి తీసుకు వెళ్ళ నన్నారు. నువ్వంటే కానీ కట్నం లేకుండా నన్ను పెళ్ళిచేసుకుంటావు. కానీ..... కానీ.... ఈ ఇంట్లో, అక్కా, నేను ఒకేలాగపెరిగాం. ఒకరి జీవితం పూలబాట, మరొకరి జీవితం ముళ్ళబాట కాకూడదని, అక్క సంసారం చక్కదిద్దాలని నా శాయశక్తులా ప్రయత్నించాను. ఈ మూడేళ్ళల్లోనూ కష్టపడి ఆ ఐదువేలు కూడబెట్టాను. బావగారి ఆ డబ్బు ఇచ్చినట్లు నాన్నగారికి చెప్పొద్దు. ఆడపిల్ల కష్టపడి సంపాదిస్తే, చేతకాని వాడిలా కూర్చున్నానని ఆయన మరింత బాధపడతారు. అందుకే ఈ విషయం నీలోనే దాచుకో బావా!" అంది అతడి చేతులు పట్టుకుంటూ!

"శ్వేతా! నీ దెంత మంచి మనసు. ఇలాంటి భార్య రాబోతున్నందుకు నాకు గర్వంగా ఉంది." అన్నాడు ఆమె నుదురు చుంబిస్తూ!

అప్పుడే ఆగది గుమ్మంలో అడుగు పెట్టిన విశ్వనాథాన్ని చూసి తెల్లబోయింది శ్వేత!

"నాన్నా..... నాన్నా.... మీరు.... మీరెప్పుడు వచ్చారు?" అంది కంగారుగా!

"మీ బావగారికి నువ్వు కట్నం ఇచ్చానని చెప్తున్నప్పుడు. అమ్మా! శ్వేతా! నీ ఋణం మేము ఈ జన్మలో తీర్చుకోలేం. కన్న కొడుకైనా చెయ్యలేని పని నువ్వు చేసి, దాని జీవితాన్ని సరిదిద్దావు. నిన్ను అపార్థం చేసుకొని, నీ ఒంటి మీద చెయ్యి చేసుకున్న దుర్మార్గుడినమ్మా!" విశ్వనాథం గొంతు జీర బోయింది.

"ఏమిటండీ! ఏమయ్యింది?" అంది విమల.

"విమలా శ్వేత ఎంత పని చేసిందో చూసావా! జ్యోతి బ్రతుకుని సరిదిద్దింది. ఆపరమేశ్వరుడు కాదే, మనశ్వేత! అది కష్టపడి రెక్కలు ముక్కలు చేసుకొని, అల్లుడికి అయిదు వేలూ ఇచ్చింది." అన్నాడు విశ్వనాథం కృతజ్ఞత నిండిన స్వరంతో!

"నాకు తెలుసండి. అది ఏ పని చేసినా మన మంచికే చేస్తుంది." అంది శ్వేత తలనిమురుతూ ఆప్యాయంగా. □

## చలి

ఆకాశానికి చిల్లులు పడినట్లు
చిల్లుల్లోంచి పదునైన సూదుల్లాగ
వీపు మీద ములుకుల్లాగ-
వాన చినుకులు.
చలికి వణికే శరీరానికి
కడుపులోని ఆకలి మంట
వెచ్చదనం ఇస్తుందా?

—కొంపెల్ల విశ్వం

# సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? – చర్చ

## "హద్దు దాటే అవకాశం ఉంది"



స్త్రీ పురుషులలోను పశువులు, పక్షులలోనూ, సకల జీవరాసులలోనూ జరిగే పరపర్రాగ సంపర్కమే ఈ సెక్స్, ఇదొక పకృతి చర్య. అదే సృష్టిలోని రహస్యం. అయితే నేడు ప్రతి యువతీ, యువకుడూ ఈ సెక్సు గురించి సినిమాల వల్ల కానీ, పుస్తకాల వల్ల కాని ఎంతో కొంత తెలుసుకుంటూనే ఉన్నారు.క్షణికమైనఅనందం కోసం వేశ్యావాటికలకు వెళ్ళే యువకులు, ప్రేమో, అకర్షణో తెలిసీ తెలియని వయసులో కాలు జారే యువతులూ ఉన్నారు. ఇటువంటి పరిస్థితులలో ఈ ఎడ్యుకేషన్ ప్రవేశ పెడితే ఇది పెద్ద తప్పుకాదు అన్న దృష్టితో మిగిలిన వారు కూడా హద్దు దాటే అవకాశం ఉంది. కొన్ని కొన్ని విషయాలు గుప్పెటలోనే నిండుతనం.

–మంతెన విజయలక్ష్మి,
అజీత్‌సింగ్‌నగర్,విజయవాడ

★ ★ ★

## లాభం లేదు



ప్రస్తుత మన పరిస్తితులను బట్టిచూస్తే సెక్స్ ఎడ్యుకేషన్ అవసరములేదని తెలుస్తుంది. అసలు సెక్స్ ఎడ్యుకేషన్ వలన మనకు లాభము ఉందా అని చూస్తే అది చాలా తక్కువ. మన విద్యార్థినీ, విద్యార్థులు సెక్స్ ఎడ్యుకేషన్ లేకపోయినా చాలా విషయాలు తెలుసు కొంటున్నారు. ఎవరికయినా పాఠ్య పుస్తకాలు చూడగానే పవిత్ర మయిన భావం కలుగాలి కానీ అసహ్యమైన వికారాలు కలుగకూడదు. ఈ సెక్స్ ఎడ్యుకేషన్ అనేది వివాహ వయసు వచ్చిన వారికి అంటే 20 ఏళ్ళు దాటిన వారికి ప్రవేశపెడితే బావుంటుంది. అంతే కాని తక్కువ వయసులోనే ప్రవేశ పెట్టి విద్యార్థుల మనసులను కలుషితము చేయుట అంత మంచిది కాదు.

-జి. రజని, మెహర్ నగర్,
ఏలూరు

## లేకపోవటం లోటు



మన దేశంలో సెక్స్ ఎడ్యుకేషన్ లేకపోవటం ఒక పేధమయిన లోటు అని చెప్పవచ్చును. ఎందుకంటే ... అసలు సెక్స్ అంటే ఏమిటి? అనేది ఎంత మందికి తెలుసు? అని సర్వే చేస్తే 40% రెజల్ట్స్ అయినా వస్తాయనుకోను. మనిషికి తిండి, నిద్ర ఎంత అవసరమో, సెక్స్ కూడా అంతే అవసరం. మనలో సెక్స్ గురించి మాట్లాడితేనే పాపం అన్నట్లు ప్రవర్తించే మూర్ఖత్వం పోవాలంటే ఈ సెక్స్ ఎడ్యుకేషన్ తప్పనిసరి. అయితే ఇది పిచ్చివాని చేతిలో భగవద్గీతలా అవ్వకుండా వుండాలంటే ఈ ఎడ్యుకేషన్ యూనివర్సిటీ లెవెల్ నుండి అవసరం. లేనట్లయితే దీనివలన యువతకు మేలుకంటే హానే ఎక్కువ అంటాను. మరి మీరేమంటారు?

–కె. రాజ్యలక్ష్మి, ఖమ్మం

★ ★ ★

## నిర్బంధం చేయాలి



ప్రతి వ్యక్తికి దాంపత్య విజ్ఞానాన్ని అందించడానికి, ప్రతి వ్యక్తి తన దాంపత్య జీవితాన్ని సుఖమయం చేసుకోడానికి సెక్సు ఎడ్యుకేషన్ తప్పకుండా అవసరం. సెక్సు ఎడ్యుకేషన్ అనగానే కొంత మందిలో, ముఖ్యంగా స్త్రీలలో అసహ్యభావం వుండడం అత్యంత శోచనీయం.

"సెక్సు ఎడ్యుకేషన్"ను ఇంటర్మీడియట్ స్థాయి నుంచి విద్యార్థులకు ఒక పాఠ్యాంశంగా బోధించడం ఎంతైనా అవసరం. ఎందుచేతనంటే, లైంగిక విద్య (సెక్సు ఎడ్యుకేషన్)ను బోధించడం వల్ల, విద్యార్థులు సరియైన విషయ పరిజ్ఞానం పొందడమేగాక, వారి మానసిక ప్రవృత్తిలో గణనీయమైన మంచి మార్పులు రాగలవు. ఈ పాఠ్యాంశంపై విద్యార్థులకు ఉపయోగపడే సరియైన గ్రంథాలను ప్రచురించాలి.

అనేక మంది యువకులు కామవాంఛతో చెడు తిరుగుళ్ళు తిరిగి సుఖ వ్యాధులకు గురిఅయి వారి జీవితాలను చేజేతులా నాశనం చేసుకుంటున్నారు. అందుకు కారణం – వారికి సెక్సు సైన్సు గురించి సరియైన అవగాహన లేకపోవడమే.

సెక్సు ఎడ్యుకేషన్‌పై ప్రజలలో అనేక అపోహలున్నాయి. ముఖ్యంగా బాలికలు సెక్సు ఎడ్యుకేషన్ పాఠ్యాంశం అనగానే సిగ్గు పడడం సహజం. అందువల్ల వారి సిగ్గును తొలగించాలంటే, "సెక్సు ఎడ్యుకేషన్" అనే పదానికి బదులు "ఫామిలి లైఫ్ ఎడ్యుకేషన్" అని పేరు పెట్టి కళాశాలల్లో ఈ విద్యను నిర్బంధం చేయాలి. తద్వారా విద్యార్థులు రాబోయే వారి దాంపత్య జీవన విధానాన్ని గూర్చి క్లాసు రూములో శాస్త్రీయ పద్ధతిలో పాఠాల ద్వారా తెలుసుకొని, వారి వైవాహిక జీవితాన్ని సుఖంగా, సంతృప్తికరంగా వుండేటట్లు చేసుకో గలరు.

– వరికూటి వెంకట సుబ్బారెడ్డి, అరండల్
పేట, గుంటూరు

★ ★ ★

## తేలికగా తీసుకోరాదు



నేటి రోజుల్లో సెక్స్ అంటే ఏమిటి? అనే చచ్చు ప్రశ్నకు జవాబు ఎవరికీ తెలియక పోదు.

అదికాక అసభ్యకరమైన దృశ్యాలు నిషేధించడానికి నియమించబడిన సెన్సార్ బోర్డు వారి సౌజన్యంతోనే విచ్చలవిడిగా ఘోరాతి ఘోరమైన పరమ అసభ్య దృశ్యాలతో, అంగాంగ ప్రదర్శనలతో కూడిన సినిమాలు కొన్ని వివిధరీతులుగా, వివిధ భాషల్లో ప్రదర్శించ బడుతున్నాయి.

ఇకపోతే సైన్స్ గ్రూప్ తీసుకునే కాలేజి విద్యార్థినీ విద్యార్థులకు సెక్స్ గూర్చి తెల్సుకోవాల్సిన అవసరం లేదు. అస్తవ్యస్తమైన సమాజం విషయానికొస్తే పట్టపగలే స్త్రీల నల్లరి పెట్టేవారు సెక్స్ ఎడ్యుకేషన్ ఆచరణలో పెడితే పశుత్వంతో బుసలు కొడుతు అల్లకల్లోలం సృష్టించటం ఖాయం.

ఇలాంటి తరుణాల్లో సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా అనే ప్రశ్న యువతరంలో ఉద్భవించాలి. కంప్యూటర్ కోర్సులూ, ఓపెన్ యునివర్సిటీ శిక్షణలూ, సాదాసీదా వ్యవహారాల్లాగా ఈజీగా తీసుకోకండి. సీరియస్‌గా ఆలోచించి సరియైన విధంగా అవగాహన చేసుకోగలమనే జిజ్ఞాస, ప్రతి ఒక్కరిలో కలిగాక, యువతరం నిర్ణయానుసారం ఆచరణలో పెడితే ఉపయోగంగా ఉంటుందని నా భావన.

–కె. ఎమ్. ఎస్. ఎస్. త్రివేణి, కాచిగూడ
రైల్వే క్వాటర్స్, హైద్రాబాద్ □

సీరియల్

# సంకెళ్ళెవరికి?

## డాక్టర్ కొత్త రవీంద్రబాబు



(గత సంచిక తరువాయి)

రూపకు తొమ్మిది నెలలు నిండేసరికి తప్పటడుగులు వేయటం 'అత్త "అత్త" అంటూ వనజ ఎటు వెళితే అటు చూస్తూ నడవటం . అదే సమయంలో స్వరూప్ అప్పుడే కూర్చోవడం నేర్చుకుంటున్నాడు

'వీడు అన్నిటా వెనకబడి వుంటాడు కాబోలు' అనుకుంటూ వుంటే వనజకు ఏదో జాలి కలుగుతుంది

రాఘవరావు ఇంటికి రాగానే 'మామ' అంటూ తప్పటడుగులు వేసుకుంటూ అతనివైపు పరిగెత్తబోతుంది పడుతూ లేస్తూ వస్తున్న రూపను చేతులలో తీసుకుని ముద్దులు కురిపిస్తాడు. బుల్లి చేతులతో అతని ముఖం నిమురుతూ క్రాపు గజిబిజిచేస్తూ, సంతోషం పట్టలేక చేతులు కాళ్ళూ విపరీతంగా వూపుతుంది రూప

రాఘవరావు ఇంట్లో వున్నంతసేపూ అతని వళ్ళోనే ఆడుకుంటుంది రూప

"రబ్బరు బొమ్మలావుంది పాప అని ఇంటికి వచ్చిన వాళ్ళు అంటుంటే రాఘవరావు మనసు సంతోషంతో నిండిపోయేది

రూపను 'డాలీ' అని పిలువసాగాడతను 'డాలీ' అనగానే వురుకులతో పరుగులతో పడుతూ లేస్తూ వస్తుంది

డాలీని మురిపెంచేస్తూ స్వరూప్‌ను పూర్తిగా మర్చిపోసాగాడు రాఘవరావు!

ఆడిట్ రిపోర్టులు రాగానే శివానంద వాటాకు వచ్చిన డబ్బు తీసుకొని వెళ్ళి బాంకులో రూప పేరు మీదుగా డిపాజిట్ చేసి వచ్చాడు రాఘవరావు రూపకు పద్ధెనిమిదేళ్ళు నిండిన తర్వాత డిపాజిట్‌మనీ యిస్తారు! ఇప్పుడు వేసిన డబ్బు అప్పటికి నాలుగు లక్షలపైగా అవుతుంది! డాలీ మేజర్ అయేసరికి కోటీశ్వరురాలు అవాలి అనుకుంటే అతనికి ఏదో ఒకరకమైన ఆత్మసంతృప్తి

మరో సంవత్సరం గడిచింది. డాలీ బాగా మాటలు చెబుతున్నది సినిమా పాటలు పాడుతున్నది రాఘవరావు వెంట టొబేకో కంపెనీకి వచ్చి అతని బల్లమీద కూర్చుని వచ్చేవారిని పోయేవారిని పరామర్శ చేస్తున్నది.

స్వరూప్ ఇప్పుడిప్పుడే తప్పటడుగులు వేస్తున్నాడు ఇంకా మాటలు రావటంలేదు రాఘవరావు దగ్గరకు అతను రావటం చాలా అరుదుగా మాత్రం జరుగుతుంది. వనజ మనసులో స్వరూప్ అంటే జాలివున్నా "ఏమిటి? వీడు మంచి మన్నుతిన్న పాములా ఇలా వుంటాడు' అనిపించి మనసు అదోలా అవుతున్నది

ఆ ఏడు టొబేకో కంపెనీలో అంతులేని లాభాలు వచ్చాయి శివానంద వాటాకు రెండు లక్షల పైచిలుకు వచ్చింది. పోయిన సంవత్సరంలా ఆ డబ్బు బాంకులో డిపాజిట్ చేద్దామనుకున్నాడు ముందు.

హైద్రాబాద్ దగ్గర్లో గుజరాతీ సేట్ ద్రాక్షతోట అమ్మకానికి వుందని తెలిసి ఆలోచించసాగాడు డబ్బు విలువ సంవత్సరం సంవత్సరానికే కాక రోజురోజుకూ పడిపోతున్నది! పద్ధెనిమిదేళ్ళ తర్వాత ఎనిమిదిరెట్లు డబ్బు వస్తుందన్న మాటేగాని అప్పటికి డబ్బు విలువ ఎనిమిదిరెట్లు తగ్గిపోయి వుంటుంది! రియల్ ఎస్టేట్ విలువ అప్పటికి ఎన్నోరెట్లు పెరిగి వుంటుంది.

అమ్మకానికి వచ్చిన ద్రాక్ష తోట హైద్రాబాద్ శివార్లలో వుంది. సాలుసరి ఆదాయం ఏటా ఇరవైవేల రూపాయలు వస్తుంది భూమి విలువ కూడా అక్కడ విపరీతంగా పెరిగిపోతున్నది నాలుగేళ్ళలోనే ధర రెట్టింపు పెరగడం వున్నది

డాలీ పేరుతో ద్రాక్షతోట కొన్నాడు రాఘవరావు తోటలో చిన్న యిల్లు కూడా వుంది ఎవరైనా సరయిన మనిషిని అందులో వుంచి అజమాయిషి చేసే ఏర్పాటు చేస్తే తోటమీద ఫలసాయం ఎక్కువ రావచ్చునిపించింది రాఘవరావుకు కాని అందుకు తగిన మనిషి ఎవరు?

శివానందకుగాని గిరిజకుగాని నా అన్న వాళ్ళెవరూ లేరు శివానందను పెంచి పెద్దచేసిన మేనత్త గిరిజ మంచి చెడూ చూసిన బాబాయి వారి వివాహం తర్వాత కొద్ది రోజులకే మరణించారు

పోతే తనకూ అన్నదమ్ములూ అప్పచెల్లెళ్ళు లేరు. అమ్మకూడా పెళ్ళికాక ముందే పోయింది పోతే వనజకు మాత్రం నాగయ్య అని ఓ వేలు విడచిన మేనమామ వున్నాడు పల్లెటూళ్ళో రెండెకరాల పొలం వుంటే పండించుకు తింటూ కాలం వెళ్ళబుచ్చుతున్నాడు

ఆయనకు కబురుపెట్టాడు రాఘవరావు రాగానే బాబాయిగారూ! దురదృష్ట వశాత్తు చెల్లెమ్మ, శివపోయారు! రూప మంచి చెడూ చూడవలసిన భారం నామీద పడింది ఈఏడు శివవాటాకు వచ్చిన లాభంతో హైద్రాబాద్ శివార్లలో పది ఎకరాల ద్రాక్ష తోటకొన్నాను తోట మధ్యలో వుండటానికి చక్కని యిల్లు వున్నది. తరుణంలో ఎరువులువేసి అదనులో పురుగుమందు కొట్టకపోతే తోట దెబ్బతినిపోతుంది

మీరు ఎటు దిరిగి పల్లెటూళ్లో ఒక్కరే వుంటున్నారు! హైద్రాబాద్‌లో ద్రాక్షతోటలో వుంటూ అజమాయిషి చేస్తుంటే బావుంటుంది ఏమంటారు?"

"అలాగే బాబూ! నాకు మాత్రం ఎల్లావాపా! ఈ లోకంలో మీకంటే కావలసిన వాళ్ళెవరున్నారు? మీ బాగోగులు చూడటంకన్నా నాకు కావలసిందేమున్నది?" అంటూ తలూపాడు నాగయ్య

రెండు రోజుల్లో హైద్రాబాదు ప్రయాణమయ్యాడు.

'మామయ్యా! ఒక్కడివి చెయ్యి కాల్చుకోవటమెందుకు ఎవరయినా వంటవాడిని చూసి పంపుతాం! నీకు ఇబ్బంది లేకుండా వుంటుంది" అని వనజ

---

జరిగినకథ --1 . రాఘవరావు, శివానంద మంచి స్నేహితులే కాక బిజినెస్ పార్టనర్స్ కూడా. శివానంద భార్య గిరిజ ఆడపిల్లను ప్రసవించిన రోజే రాఘవరావు భార్య వనజ మగపిల్ల వాడిని ప్రసవించింది ఆ రోజే శివానంద ఏక్సిడెంట్‌లో మరణించగా ఆ వార్త విన్న గిరిజ గుండె ఆగి చనిపోయింది. అనాథ అయిన వారి కుమార్తెకు రూప అని పేరు పెట్టి తమ కుమారుడైన స్వరూప్‌తో సమానంగా ఆ పాపను పెంచసాగారు రాఘవరావు దంపతులు

అంటే

"అదేంటి వనజా! మి అత్త పోయి నాలుగేళ్లయింది ఇన్నాళ్ళనుండి ఏ వంటవాడు వండి పెడుతున్నాడు? నా గురించి మిరేం ఇదవకండి." అన్నాడు.

అయినా నాగయ్య వెళ్లేప్పుడు ఉప్పుకారం పప్పులూ పచ్చళ్లూ సర్వం మూటలు గట్టి పంపింది వనజ. "పైసా ఖీరుపోకుండా అంతా మూటకట్టి పెడతాను ఈ జానెడు పొట్టకు పిడికెడు మెతుకులు తప్ప నాకు కావలసినదేముంది?" అంటూ వెళ్లాడు నాగయ్య..

మందుకొట్టాలని, ఎరువులు వేయాలని వేలకువేలు డబ్బు తెప్పించడమేగాని "కాపుకాసింది ఇదిగో డబ్బు జమ" అంటూ పైసా పంపకపోయేసరికి "బాబాయిగారూ! పంటకు తెగుళ్లేమయినా పడ్డాయా! యీ ఏడు కాపు ఎలా వుంది?" అంటూ వ్రాసాడు రాఘవరావు.

"తోటపూరాగా కాపు కాసే తరుణంలో చెట్లు ఎర్ర తెగులు తగిలి నిలువునా ఎండిపోసాగాయి. ఎగ్రికల్చరల్ ఆఫీసర్‌ను పిలుచుకు వచ్చి ఆయన చెప్పిన మందులు వాడటంతో తోట నిలబడ్డది" అంటూ జవాబు వ్రాసాడు నాగయ్య.

వ్యాపారం పని వత్తిడిగా వుండడంతో తోట విషయం మర్చిపోయాడు రాఘవరావు. కాని మరలా కాపు తరుణం వచ్చినా డబ్బు యింటికి పంపకుండా పైపెచ్చు వేలకు వేలు పంపమంటూ వుత్తరాలు వ్రాస్తుంటే అనుమానం వచ్చింది. ఒకసారి వెళ్ళి అక్కడ ఏం జరుగుతున్నదో చూచివస్తే బాగుంటుంది అనుకుని హైద్రాబాదు వెళ్ళాడు రాఘవరావు

ఆటో 'దిల్ పసంద్' తోట ముందు ఆగిపోవాల్సి వచ్చింది లోపలనుండి ద్రాక్ష గుత్తులు నిండిన బళ్ళు ఒక్కొటి బయటకు వెళ్ళేంతవరకూ. తోట విరగకాసి వున్నది! సరిగా తోట మధ్యలో చిన్న డాబా వుంది రాఘవరావు వెళ్ళేసరికి ఎవరో పాతికేళ్ళ పడుచు వరండాలో నుండి చప్పున లోపలకు వెళ్ళింది

"నాగయ్యగారు లేరా?" అని అడిగితే సమాధానం చెప్పకుండా తలుపులు వేసుకుంది 'ఏమిటి ఇలా చేసిందిమె' అనుకుంటూ వరండాలో చతికిలబడిపోయి కూర్చున్నాడు రాఘవరావు

ద్రాక్షతోటలో నాగయ్య ఒంటరిగా వుంటున్నాడనుకున్నా డింతవరకూ!

ఈ అమ్మా యెవరో ఇలా లోపలకు వెళ్ళి తలుపు వేసికొంటుంటే ఆశ్చర్యం వేసింది.

నడి వయసు దాటుతున్న నాగయ్యకు తోడు కావలసి వచ్చిందా? ఛా! అనవసరపు ఆలోచనలు వస్తున్న య్యేమిటి?

ఒకవేళ వంట చేసి పెట్టటానికి ఏర్పాటు చేసుకున్నాడేమో? ఆమె చేతులకు, మెడలోనూ వున్న బంగారు ఆభరణాలు చూసాక వంట మనిషి అని మనసులో సరిపెట్టుకోలేకపోయాడు రాఘవరావు

ద్రాక్షపళ్ళు వేసుకుని ఎడ్లబండ్లు అంతకుమందే వెళ్ళడం చూసాడు. బళ్ళు ఎంతో దూరం పోయి వుండవు అనుకుని అవి వెళ్ళిన దిశగా నడువసాగాడు. అయిదు నిమిషాలలో బండ్లను కలుసుకో గలిగాడు

"కహా చల్తాహై ఏగాడియాం?" అని అడిగితే

"హుసేన్‌కా దుకాన్"

"కహాహై వో?"

'చారిమినార్ కే పాస్'

చారిమినార్ దగ్గర హుసేన్ పండ్ల దుకాణం దగ్గరకు వెళ్ళాడు రాఘవరావు.

హుసేన్ దుకాణం చాలా పెద్దది

"దిల్ పసంద్ గార్డెన్ నుండి పండ్లు తోలుతున్నది మికేగదా?"

"అవును! గుజరాతి సేట్ తోతారామ్ కూడా మాకే పండ్లు అమ్మేవాడు" చక్కగా తెలుగులో మాట్లాడాడు షాపతను.

"కాని మిరు ద్రాక్షపండ్లకు సరయిన ధర యివ్వడం లేదట!"

"ఎవరు చెప్పారు? దిల్ పసంద్ నుండి వచ్చిన పండ్లకు టాప్ రేటు వేస్తున్నాము! పోయిన సిజన్‌లోనే ముప్ఫై వేలు రొక్కం యిచ్చాము. ఈ సిజన్‌లో ఇప్పటికి పాతిక వేల పైన...... ఉండండి చెబుతా.... వోయ్ దిలేర్‌ఖా! ఎకౌంట్ బుక్‌లావో!" అంటూ కేక వేసాడు.

దిల్‌పసంద్ తోట నుండి తోలిన ద్రాక్ష పండ్లకు మొత్తం యాభై ఎనిమిది వేల రూపాయలుసంతకం చేసి మరి తీసుకున్నాడు నాగయ్య!

మనసులో కోపం భగ్గుమంటున్నా పైకి చిరునవ్వు నవ్వుతూ "నాగయ్య ఏదో పొరపాటు పడి వుంటాడు లెండి" అంటూ అతని దగ్గర శెలవు తీసికొని వెనుదిరిగాడు రాఘవరావు.

సికింద్రాబాద్‌లో వున్న ద్రాక్ష తోటలకు వెళ్ళి వివరాలు కనుక్కొని సాయంత్రం నాలుగు గంటలకు "దిల్ పసంద్" దగ్గరకు వెళ్ళాడు.

నాగయ్య వరండాలో మంచంమిద పడుకుని గుర్రు పెట్టి నిద్ర పోతున్నాడు. అతని నిశ్వాసాలనుండి వస్తున్న విస్కీ వాసన నాలుగు గజాల దూరం వరకూ వస్తున్నది. ముక్కు మూసుకుని మంచం దగ్గరకు వెళ్లి

"బాబాయ్" అంటూ కేక వేసాడు.

నాగయ్య కండ్లు తెరవకుండానే "క్యా బేటా" అన్నాడు. అప్పుడే తురకం వెలగబెడుతున్నావా అనుకుని "బాబాయ్" అంటూ పెద్దగా అరిచి భుజాన్ని గట్టిగా రెండు చేతులతో కుదిపాడు.

"ఎవడ్రా" అంటూ కళ్ళు నులుముకుని లేచి–

"అరే నువ్వా! ఎప్పుడొచ్చావయ్యా" అంటూ లేచి కూర్చున్నాడు నాగయ్య.

"పొద్దున వచ్చా"

"అలాగా! ద్రాక్షతోటకు చీడ పడితే పురుగు మందు కోసం పొద్దుననగా వెళ్ళి సికింద్రాబాద్ అంతా గాలించాను. నాలుగు రోజుల దాకా రాదన్నారు. తిరిగి వస్తుంటే ఎవరో స్నేహితుడు కనపడితే ఓ చుక్క వేసుకున్నాను! ఏమనుకోకు!"

రాఘవరావు మాట్లాడక పోయేసరికి,

'ఏయ్, ఛమేలీ సాబ్ కో చాయ్ లావ్" అని కేక వేస

"అమ్మాయీ నువ్వా మరి మరి చెప్పారని వంటకు మనిషిని పెట్టా! దేశంగాని దేశంలో వుంటున్నప్పుడు నోరు చవి [illegible]



## సంకెళ్ళెవరికి?

వచ్చింది ఛమేలీ. ఏదో యీ ముసలి ప్రాణానికి గుక్కెడు గంజి గాచి పోస్తుంది."

"బాబాయ్! ద్రాక్ష పళ్ళు అమ్మ లేదాఏం? ఎంతకూ నేను కర్చులకు డబ్బు పంపడమే గాని ఇక్కడ నుండి జమలు రాలేదు."

"అయ్యో! తోట పాడయిపోకుండా కాపాడేసరికి తాతలు దిగి వస్తున్నారు. ఇంకా ద్రాక్షపళ్ళు కాయటం వాటిని అమ్మడం గూడానా?"

ఛమేలీ టీ గ్లాసు తీసికొని వచ్చి రాఘవరావు ముందుంచి పైట కొంగు ముసుగులా వేసుకుని వెళ్ళిపోయింది. గుమ్మం అవతల నుల్చుని చెవులు యిటు వైపు రిక్కించి వినసాగింది.

"బాబాయ్! పెద్దవాడివి! ఎందుకు అబద్ధాలాడతావు! హుసేన్ పండ్ల దుకాణంలో యాభై ఎనిమిది వేలు డబ్బు తీసుకున్నావు నువ్వు. అతని దుకాణానికి పంపిన ద్రాక్షపళ్ళు యీ తోటలో కాసినవి కాదంటావా?"

"అమ్మో! ఎంత మాటన్నావు! ఇంత బతుకూ బతికి ఇవాళ ఇంత అవమానం పాలవాలా! మా దెలాటి వంశం! జమిందార్ల వంశం. ఈరోజు యీ నాగయ్య చితికిపోయి వుండొచ్చు! ఆస్తి పోయిందని నన్నింత అవమానం చేస్తావా! ఇంకొక్క నిముషం ఇక్కడ వుండను. ఆ! రా ఛమేలీ"

"ఆగు ఛమేలీ! నీ వంటిన వున్న నగలు తీసి అక్కడ పెట్టి మరి కదులు! సికింద్రాబాద్ నుండి వస్తూ దారిలో పోలీస్ స్టేషన్‌లో రిపోర్టిచ్చి వచ్చాను. ఈపాటికి పోలీసులు దారిలో వుండి వుంటారు."

సున్నం పిడతలా ముఖం వేసుకుని చేతులవి, మెడలోవి నగలు తీసి రాఘవరావు ముందుంచి ముక్కుతూ మూలుగుతూ నాగయ్యవెంట వెళ్ళింది ఛమేలీ!

దిల్ పసంద్ గేటు దాటగానే "మా ఊరికి వెళదాం! నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తా! కోరిన నగలు చేయిస్తా....." అన్నాడు నాగయ్య.

అతని మాటలు ఛమేలీమీద ఏమి పని చేసినట్లు లేవు. అరువు సొమ్ము బహూకరించే మగవాడిమీద అసహ్యించుకొనే ఆడదానిలా చీత్కరించుకొని రెండో వైపుగా నడువ సాగింది.

"ఛమేలీ! ఛమేలీ" అంటూ ఆమె వెనక పరిగెత్తి ఆమె భుజంమీద చెయి వేసి తన వైపు తిప్పుకోబోయాడు. అతని ప్రయత్నం బెడిసి కొట్టింది! చెద పురుగుని చేతితో తీసి అవతల పడేసినట్లు అతని చేతిని తీసి అవతల పడేసింది. ఛమేలీ కండ్లలోకి లాలనగా, అనునయంగా, ప్రేమగా చూసాడు నాగయ్య. ఛమేలీ కండ్లల్లో సుళ్ళు తిరుగుతున్న అసహ్యం, కోపం చూసి వెనక్కు తగ్గక తప్పలేదతను.

మొగుడు కొట్టినందుకుకాదు అన్నట్లు రాఘవరావు లెక్కలు అడిగి తోటలో నుండి వెళ్ళగొట్టినందుకు కలిగిన బాధ కంటె, ఛమేలీ తిరస్కారం నాగయ్యకు ఎక్కువ అవమానం కల్గించింది.

రాఘవరావుమీద కోపం పెచ్చు మీరిపోసాగింది "ఏదో ఇంత వుడకేసి పెడుతున్నది, దాని మోజు మటుకు ఎందుకు తీర్చుగూడదు అని నాలుగు నగలు వేయించి పెట్టాడు. అదే పెద్ద నేరమా? తను తోటంతా ఎంత బాగు చేయించాడు ముందు వచ్చే ఆదాయం రాఘవరావుకు పంపేవాడు గదా! అంత తొందరపాటు దేనికి? తొందరపాటు గాదు అహం! పొగాకు వ్యాపారంలో నాలుగు లక్షలు సంపాదించగానే సరా! పెద్దంతరం చిన్నంతరం వుండక్కర్లా? నిన్నటిదాకా వనజ మామయ్యా అంటూ తమ యింటి చుట్టూ తిరిగేదికాదా? పిలిచి అవమానం జేస్తారా! రాఘవరావు మటుకు పార్టనర్ శివానంద వాటా స్వాహా చేయడా?

అయినా ఏమయినా అడగాలని అనుకుంటే అవతలకు తీసుకుని వెళ్ళి ఛమేలీ వినకుండా అడగవచ్చుగదా! ఆడదాని ఎదురుగా అవమానం చేస్తాడా!

చూస్తా! వీడి కెక్కిన పొగరు దించకపోతే నా పేరు నాగయ్యేకాదు!" అనుకుంటూ బుసలు పెడుతూ వెళ్ళాడు.

(ఇంకా ఉంది)




ప్రతి సంచికా

# అత్యంత సుందరంగా

ముస్తాబయి మీ మనసులను దోచుకునే
విధంగా వస్తోంది. ప్రతి పేజీ కొత్తదనాన్ని
నింపుకుని...రకరకాల శీర్షికలతో, కథలతో విలక్షణమైన
కవితలతో...సీరియల్స్‌తో మీ రంగులకలకి
వాస్తవ రూపం తెస్తూ రాబోతోంది!

అతి త్వరలోనే!!

కవర్ పేజీయే కాదు...లోపలి పేజీలు కూడా కలర్‌లో
నింపుకుని హారిస్ గ్రాఫిక్స్(HARRIS
*GRAPHICS, USA)* తో ముచ్చటైన ముద్రణ
ప్రత్యేకతతో వస్తోంది
మీరు చెల్లించే వెలకన్నా—
మీరు అందుకునే విలువ మిన్న!

వినాయక చవితి సంచికతో ప్రారంభం

**ఉదయం వీక్లీ**

సంపూర్ణ వారపత్రిక

gdc/PAP/0286

# వ్యక్తిగతం



గత ఏడాది వింబుల్డన్ టెన్నిస్ పోటీలలో పురుషుల ఫైనల్స్‌లో ఘన విజయం సాధించి ప్రపంచ టెన్నిస్ చరిత్రలో నూతనాధ్యాయాన్ని సృష్టించిన బోరిస్ బెకర్ ఈ ఏడాది కూడా అత్యద్భుతమైన రీతిలో ఆడి చెకొస్లొవేకియాకు చెందిన ఇవాన్ లెండిల్‌పై 6-4, 6-3, 7-5 స్కోరుతో అఖండ విజయాన్ని సాధించి వింబుల్డన్ టైటిల్‌ని నిలబెట్టుకున్నాడు. ప్రపంచంలో వింబుల్డన్ టైటిల్‌ని అందుకున్న టెన్నిస్ క్రీడాకారులందరిలోకి ఇతనే చిన్నవాడు గత ఏడాది మొట్టమొదటి సారి ఈ టైటిల్‌ని గెలుచుకున్నప్పుడు ఇతని వయస్సు 17 సంవత్సరాల 7 నెలలు మాత్రమే. పశ్చిమ జర్మనీకి చెందిన బోరిస్ బెకర్‌కి ఇప్పుడు 18 సంవత్సరాల 7 నెలలు ఇతని ధాటికి 26 సంవత్సరాల ఇవాన్ లెండిల్ నిలవ లేక పోయాడు. ప్రపంచంలో టెన్నిస్ ఆటద్వారా మిలియనీర్ అయిన ఆటగాళ్లందరి లోకి బెకర్ చిన్నవాడు ఇప్పుడీ విజయంతో అతను ఇంత వరకూ టెన్నిస్ పోటీలలో గెలుపొందిన మొత్తం 10,79,575 డాలర్లు □



అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని నేషనల్ ఏరోనాటిక్స్ అండ్ స్పేస్ అడ్మినిస్ట్రేషన్ (నాసా)కు చెందిన ప్రముఖ శాస్త్రవేత్త ఎరిక్ మొల్లో క్రిస్టియన్ సెన్ ఇటీవల భారతదేశం వచ్చారు. అంతరిక్ష సంబంధమైన సాంకేతిక విజ్ఞానానికి సంబంధించి భారత్ అమెరికాల మధ్య ఉండవలసిన సంబంధాలని స్పష్టంగా తెలుసుకునేందుకు ఆయన వచ్చారని అంటున్నారు. ఉపగ్రహాలు, కంప్యూటర్‌ల వల్ల మానవ జీవితం ఎంతో ప్రభావితం అవుతున్నదని పేర్కొంటూ అంతరిక్ష శాస్త్రం అనేక అద్భుతాలని వెయిస్తుందన్నారు. సామాజిక అడవుల పెంపకానికి సంబంధించిన అవసరాన్ని త్వరగా గుర్తించటానికి కారణం ఉపగ్రహ వ్యవస్థ అందించిన సమాచారమేనని ఆయన అన్నారు భారత అంతరిక్ష పరిశోధన సంస్థ, జాతీయ రిమోట్ సెన్సింగ్ ఏజన్సీలతో ఈయన చర్చలు జరిపారు. అంతరిక్ష సాంకేతిక విజ్ఞానాన్ని వాతావరణం, భౌగోళిక స్థితిగతులు, వనరుల అన్వేషణ, విద్యా సౌకర్యాలు తదితర అంశాల కొసం వినియోగించుకునే అంశంపై అవగాహనకి ఆ చర్చలు దోహదం చేస్తాయని అనుకోవచ్చు .. □

# వారఫలం

## 1-8-1986 శుక్రవారం మొదలు 7-8-1986 గురువారం వరకు

★ **మేషం :** అపకారం జరిగే సమయంగాదు. పనులందు శ్రద్ధ వహించాలి. వ్యాపారంలో ముందు వెనుకలు ఆలోచించి ముందుకుసాగాలి. క్రొత్త వ్యాపారానికి అవకాశమున్నది. స్త్రీలకు: ఉద్యోగాభివృద్ధికి అవకాశం, ఆరోగ్యమందు అభివృద్ధి.

★ **వృషభం :** ఏనాడో వదిలిన వ్యవహారం, ఈ వారం తిరుగ తోడవలసిన అగత్యం ఏర్పడుతుంది. వృత్తియందు ప్రగతి చెకూరుతుంది. నూతన వృత్తులయందు వికాసం ఏర్పడుతుంది. చిత్తశుద్ధితో చేసిన పనులకు లోపంరాదు. ప్రగతి పథాన పయనించండి. స్త్రీలకు : రాజకియంగా, సాంఘికంగా మేలే

★ **మిధునం :** గ్రహించండి. కాలం అనుకూలం. అంటె చక్కని గ్రహబలం ఉన్నదని, అందంగా, ఆనందంగా రోజులు జరుగుతవి 'శని' గ్రహం మిమ్ము చల్లని చూపు చూస్తాడని అర్థం. ఎవరితోనూ, ఏ కారణంగానైనా విరోధం తెచ్చికోకండి 'స్త్రీలకు· నూతనోద్యోగ ప్రాప్తి కొందరకు, ధనలబ్ధి కొందరకు

★ **కర్కాటకం :** మి యింట జరుగవలసిన శుభం నిమిత్తం, బంధువులతో తర్జన భర్జనలుంటాయి. ఏమయినా అలాంటి వ్యవహారాలలో, మి మనోరధం ఈడేరుతుంది. విద్యాభివృద్ధి నిమిత్తం చేసే యత్నాలు సాంగంగా నెరవేరతాయి. మి పనులను, మాటలను విపరీతంగా వ్యాఖ్యానించేవారున్నారు జాగ్రత్త. స్త్రీలకు: అంతటా యథాతథం.

★ **సింహం :** రాజకియంగా మేలున్నది. వృత్తియందు ప్రగతి చెకూరుతుంది. విద్యాభివృద్ధి నిమిత్తం చేసే యత్నాలు సఫలం అవుతాయి. బంధు విరోధం రావచ్చు, ఆరోగ్యం లోపించవచ్చు. స్త్రీలకు అనుకొన్న రీతిని వస్తులాభం కొందరకు వాహనం కొనె యత్నాలు చెస్తారు.

★ **కన్య :** వారమంతా శుభఫలమే. ఆనందం వెల్లివిరుస్తుంది. సుఖ సంతోషాలుంటాయి. వృత్తియంచు పెరు పెంపులున్నాయి, అధికారం వృద్ధినందనున్నది. ప్రతివిషయంలో అధిక లాభాపెక్షకై యత్నించవచ్చు. సత్ఫలితం అందుకోవచ్చు. స్త్రీలకు విద్యావిధానవృద్ధి, ధనలబ్ధి ఆనందోత్సాహాలు, 'శని' గ్రహానుకూల్యత.

★ **తుల :** మాటకు విలువ పెరగటంతో, పదిమంది మి పద్ధతిని కొనియాడటంతో పొంగిపోతారు. మరి గ్రహానుకూలత కూడా కావాలిగా! రాజకియాల్లో మికు గెలుపులేదు, సాంఘికంగా అంతకన్నాలేదు. బాగా యోచించి ఏ పనికైనా దిగండి స్త్రీలకు: శుభకార్య ప్రసక్తి, త్రిప్పట.

★ **వృశ్చికం :** ఇది చేయండి, యిందు ఆదాయం పొందాలి, అన్నమాట ఉండదు. ఏదో తలవంచుకొని చెయటమే అలవాటు. ఇంకా ఈ పరిస్థితి కొన్ని వారాలుండవచ్చు. రాజకియంగాగాని, నిర్మాణ రీత్యాగాని, ఉద్యోగ సంబంధంగాగాని, ఎలాంటి అనుకూలత సాధించలెరు స్త్రీలకు కళారంగాభివృద్ధి, సదవకాశాలు.

★ **ధనుస్సు :** అభివృద్ధి దినాలు, కృషిలోపం చేయకండి. వ్యాపారాన అంతో ఇంతో అభివృద్ధి ఉన్నది. ఇష్టబంధు సమాగమం శుభకార్యాలోచనలు, అభివృద్ధి కార్యక్రమ మందు పాల్గొనడం యిత్యాది శుభం జరుగవచ్చు. స్త్రీలకు: ఉద్యోగమందు సదవకాశాలు లభ్యం కాగలవు. స్వల్పాదాయమున్నది.

★ **మకరం :** రాజకియంగా మేలు జరుగుతుందనుటలో ఆక్షేపణలేదు అన్ని విధాలా సదవకాశాలు లభ్యమవుతాయి వృత్తియందు మెలైన దినాలు. గురు, శని' బలం పూర్తిగా గల మికుపరంగాన కూడా అపకారం జరుగదు కృషి మానరాదు స్త్రీలకు అధికారమందు అభివృద్ధి, ఆదాయమందు స్వల్పంగావృద్ధి చెకూరుతుంది

★ **కుంభం :** ఒకానొక విషయం శుభ్రంగా మికు అనుకూలంగా నెరవెరుతుంది ముఖ్యులను కలిసికొంటారు. రాజకియవాదులకు, సంఘసేవాపరాయణులకు చక్కని అవకాశాలు లభిస్తాయి. స్థితియందు పెంపు, ధనలబ్ధి, నూత్నోత్సాహం స్త్రీలకు బంధు మిత్రుల కలయిక, హోదాయందు పెంపు

★ **మీనం :** అకారణంగా వైరం ఏర్పడవచ్చు. చుట్టు ప్రక్కల గొడవలు రావచ్చు హటాత్తుగా స్థితియందు లోపం కలుగవచ్చు. రాజకియవాదులకు చిక్కులు రావచ్చు. విద్యా విధానాన మిరు గావించే యత్నాలు సానుకూలం కాకపోవచ్చు. యత్న కార్యమందు ఆశాభంగం స్త్రీలకు: అభివృద్ధి కుంటుపడుతుంది. బంధు విరోధానికి ఆస్కారమైన వారం, గ్రహించాలి.

—విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి

# కట్టె కొరత తెచ్చిన సరికొత్త తెప్ప

మన రాష్ట్రంలోని సముద్రతీర ప్రాంతాలలో ఎన్నో వేల మంది చేపలు పట్టి జీవనాన్ని సాగిస్తున్నారు. వారు ఉపయోగించే ముఖ్య వాహనం తెప్ప (నావ మరియు మసుల అనికూడ కొన్ని చోట్ల అంటారు). తెప్ప చేయించుకోడానికి కర్ర కొరకు జాలరులు పడే బాధలు అనేకం. కట్టె కొరత ఎక్కువయిన కొద్దీ ధరలు బాగా పెరిగిపోవడం వల్ల, తెప్ప పేదవారికి అందుబాటులో లేకుండా పోతుంది. దీనికి తోడుగా తెప్పకు ఉపయోగించే కర్ర ఆరు ఏడు సంవత్సరాల్లోనే చెడిపోవడం వల్ల కొత్త తెప్ప కొరకు మళ్ళీ కష్టాలు మొదలవుతాయి. ఉదాహరణకు తమిళనాడులోని 30 వేల తెప్పల్లో ప్రతి యేడు ఐదు వేల తెప్పలు పనికి రాకుండా పోతాయి. ఇలా ప్రతి సంవత్సరం సముద్రతీర రాష్ట్రాల్లో కర్ర అవసరం (ఒక్క తెప్పకు సుమారుగా మూడున్నర ఘనపు మీటర్ల చెక్కిన కర్ర కావాలి) విపరీతంగా పెరిగిపోతుంది. వీరందరి అవసరాలు పూర్తి కావాలంటే ఎన్ని చెట్లను నరకాల్సి వస్తుందో?



జిగ్ మెషీన్ ఉపయోగించి పైపు చివర్లను మూయడం.
కిరోసిన్ బ్లోలాంప్‌ను గమనించండి.

చేపలు పట్టే వారికి తెప్పను ఉంచుకోవడం లాభదాయకంగా ఉండాలన్నా – మరో వైపు అడవి సంపదను కాపాడుకోవాలన్నా 'తెప్ప'కు కొత్త రూపం పోసే అవసరం ఎంతైనా ఉంది. ఆ పనిని శ్రీ ఎ. యమ్. యమ్. మురుగప్ప చెట్టియార్ రిసెర్చి సెంటర్ – మద్రాసు వారు విజయవంతంగా చేసారు. వినూత్నమైన ఈ తెప్పకు వత్సి –1 అనే పేరు పెట్టారు.

వత్సి – 1 తయారు చేయడానికి కర్ర అవసరం లేదు. ఆశ్చర్యపోతున్నారు కదూ? కర్రకు బదులుగా హైడెన్సిటీ పాలి ఇథిలీన్ (క్లుప్తంగా హెచ్. డి. పి. ఇ. అని అంటారు) పైపులను ఉపయోగిస్తారు. అందువల్లనే ఈ తెప్పను హెచ్. డి. పి. ఇ. బోట్ కటమరాన్ అని కూడ వాడుకలో అంటారు. దీన్ని తయారు చేయడం ఎంతో సులభం. కర్ర తెప్ప చేయడానికి కావలసిన ప్రత్యేకమైన వడ్రంగి దళం ఈ తెప్పకు అవసరం లేదు. తెప్ప చేయడానికి కావలసిన సమయం కూడ ఎంతో తక్కువ. వడ్రంగివారు ఒక తెప్ప చేయడానికి సుమారుగా 15 రోజులు తీసుకుంటే, వత్సి –1 ను రెండు రోజుల్లో తయారు చేయవచ్చు. దీన్ని నిర్మాణానికి అవసరమయ్యే పనిముట్లు కూడ మామూలువే!

ఆరు నుండి ఎనిమిది అంగుళాల వ్యాసార్ధం మరియు ప్రతి చదరపు సెంటీ మీటరుకు 4 కిలో గ్రాముల పీడనం గల హెచ్. డి. పి. ఇ. పైపులు తీసుకోవాలి. ఒక తెప్ప చేయడానికి ఆరు మీటర్ల పొడవు గల ఐదు పైపులు సమకూర్చాలి. అంటే మొత్తం 30 మీటర్ల పొడవు పైపు కావాలన్న మాట. పైపుల ఒకవైపు చివర్లను "జిగ్‌మెషీన్" (రెండు లోహపు పలకల మధ్య పైపుంచి వదులు –బిగుతులు చేయగల ఏర్పాటున్న సాధనం)లో ఉంచి "కిరోసిన్ బ్లో లాంప్"తో వేడిని చూపుతూ బిగించి మూసుకు పోయేటట్లు చూడాలి. ముందు వైపుగా వచ్చే పైపు చివర్లను పైవైపుకు వంగి ఉండేట్లు చేయాలి. ఇలా చేయడానికి, పైపులో ఇసక నింపి గిరక – గొలుసుల సహాయంతో వంపే చివరను పైకి లేపుతూ "బ్లోలాంప్"తో వేడి చూపుతుండాలి. లోపలనున్న ఇసక వేడిని ఒక్క చోటే కాకుండా, సమానంగా పక్కలకు వ్యాప్తి చెందేటట్లుగా మరియు పైపు ముడతలు లాంటివి పడకుండా తోడ్పడుతుంది. ఈ విధంగా, సూచించిన ఆకారం (వంపు) వచ్చే వరకు పైకి లేపుతూ, చివరకు నిలకడగా ఉంచాలి. చల్లారిన తరువాత ఆకారం

పైపుల ముందటి చివర్లను పైవైపుకు వంచుతారు. చేపలు పట్టేవారు శిక్షణ పొందుతున్న చిత్రం.



కొత్త తెప్ప (వత్సి –1) పనితనాన్ని ఆసక్తితో చూస్తున్న జనం.



అలాగే స్థిరపడిపోతుంది. పిదప ఇసకను తీసేసి ఈ చివరను కూడ 'జిగ్ మషీన్' తో మూసేయాలి. కర్ర తెప్పకు కష్టపడి, చెక్కి ముందటి ఆకారాన్ని ఎలా తెస్తామో, వత్స -1 లో ఫైపును వంపి తెస్తాము. కావలసిన ఆకారాల్లో మల్చగలగడం వల్ల ఫైపు ఏమాత్రమూ వ్యర్థం కాదు. అదే కర్ర తెప్పలోనయితే 40 శాతం వరకు కర్రను చెక్కడంలో, నునుపు చేయడంలో మరియు కోయడంలో నష్టపోతాం!

రెండు చివర్లను మూసిన ఐదు ఫైపులను తెప్ప ఆకారం తీసుకోవడానికి పక్కపక్కగా ఉంచాలి. రెండు చెక్కలపై ఫైపుల ఆకారాలను (దోనె ఆకారం వచ్చే రీతిలో) కోసి ఫైపులను అమర్చాలి. రెండు చెక్కల్లో ఒకటి ముందు వైపున రెండవ దాన్ని వెనక భాగాల్లో ఉంచుతారు. ఫైపులను సరిగ్గా అమర్చి, తెప్ప ఆకారం తెచ్చాక ప్లాస్టిక్ తాడుతో ఫైపులను, చెక్కలను గట్టిగా కట్టాలి. దీనితో తెప్ప పూర్తిగా తయారయిందన్నమాట!

వత్స -1 కర్ర తెప్ప కంటె తేలికైనది. దాదాపు వంద కిలోల బరువుంటుంది. ఒడ్డు నుండి నీటిలోకి, నీటి నుండి ఒడ్డుకి తోయడానికి ఒక్క మనిషి చాలు. ఎక్కువ వేగంతో నీటిలో ముందుకు అలా తేలుతూ జారిపోతుంది. నీటిని పీల్చుకొనదు. కర్ర తెప్పలా నీటిని పీల్చుకొని సూక్ష్మజీవుల మరియు శిలీంధ్రాల దాడికి గురికాదు. అందుకే వత్స -1, 25 సంవత్సరాలకు పైగానే భౌతికంగా ఏమాత్రం చెడిపోకుండా పని చేస్తుందని గట్టిగా భావిస్తున్నారు.

## "న్యాయం - చట్టం"

తల్లి రొమ్ముల్లాంటివి!
వాటి సుధల్ని గ్రోలి
వర్ధిష్ణువు లవుతున్నారు కొందరు!
వాటినే చీల్చి
దుర్విదగ్ధు లవుతున్నారు మరి కొందరు!

- కె. కిశోరుబాబు
- కె. అశోకుబాబు

## కట్టె కొరత తెచ్చిన సరికొత్త తెప్ప

ఇద్దరు మనుషులతో సాగిపోయే ఈ తెప్పతో ఎక్కువ దూరం పోయిరావచ్చు. ప్రస్తుతం వత్స -1 7500 రూపాయల ధర చేస్తుంది. కర్ర తెప్ప కూడ కర్ర దొరికే ప్రాంతాల్ని బట్టి ఇంచుమించు ఇంతే ఖరీదు చేస్తుంది. మన దేశంలో హెచ్. డి. పి. ఇ. ఫైపులను రెండు కంపనీలు తయారు చేస్తున్నాయి.

వత్స -1 ని తయారు చేయడం ఎంతో సులభం. కొద్దిగా చురుకైన చేపలు పట్టే మనిషి కూడ (సౌకర్యాలు ఉన్న చోట) మామూలు సహాయంతో ఒకటి - రెండు రోజుల్లో తయారు చేసుకోవచ్చు. ఈ టెక్నాలజీని వ్యాప్తి చేయడానికి చేపలు పట్టే వారి కొరకు మురుగప్ప చెట్టియార్ రిసెర్చి సెంటర్ ట్రేనింగ్ కార్యక్రమాలను గతంలో జరిపింది. ఈ మధ్యనే సముద్రతీర ప్రాంతాల్లో పని చేసే సంఘ సేవా సంస్థల కొరకు ప్రత్యేక ట్రేనింగ్ కార్యక్రమం జరిగింది.

మద్రాసు చుట్టుపక్కల గ్రామాల్లో దాదాపు వంద వరకు వత్స -1 తెప్పలు వాడుకలో ఉన్నాయి. ఉపయోగించేవారు కొత్త తెప్ప పట్ల ఎంతో సంతృప్తిని వ్యక్తపరిచారు. ఎన్నో వేల తెప్పలు చలామణిలో ఉన్న మన రాష్ట్రంలో ఈ తెప్ప నమూనాకు ఎంతో భవిష్యత్తుంది. ముప్పై సంవత్సరాలు ఏపుగా పెరిగిన ఒక హెక్టారు చెట్లను నరికితే 60 నుండి 70 తెప్పలను మాత్రం తయారు చేసుకోవచ్చు. ప్రతి సంవత్సరం వేలకొద్దీ తెప్పలు అవసరమయ్యే జాలర్లకు, కర్ర కరువు తీవ్ర రూపం దాల్చుస్తున్న ప్రస్తుత సమయంలో వత్స -1 టెక్నాలజీ ఒక ఆశాకిరణం. వాళ్ళ జీవితాల్లో మార్పు తెచ్చే సూర్యోదయం.

(వివరాలకు డైరక్టర్ శ్రీ ఏ. యమ్. యమ్. మురుగప్ప చెట్టియార్ రిసెర్చి సెంటర్, తారామణి, మద్రాసు – 600113 ను సంప్రదించండి)

వ్యాసం, ఫొటోలు
–టి. సంపత్‌కుమార్

# కోటయ్య అనుభవం- ఆయన నోటనే విందాం



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ల రైతులు.
ఎన్నాళ్లనుంచో మిత్రులు. ఒకసారి అనుకోకుండా కలిశారు...



























# 'తెరవెనుక'

సి.వి. సర్వేశ్వరశర్మ

మధ్యాహ్నం రెండు గంటలయింది

విరూపాక్షుడు సట్లో బద్ధకంగా కదిలాడు.

ప్రక్క సీట్లో ఉన్న చరణ్‌దాస్ చూస్తున్న ఫైలు మూసేశాడు ఇంటి కెళ్ళి కొంచెం టీ త్రాగితే మళ్ళీ ఉత్సాహంగా పని సాగుతుంది విరూపాక్షుడిని టీకి ఇంటికి రమ్మని ఆహ్వానించాడు. బెట్టు చేశాడు. తప్పనిసరిగా రమ్మని పట్టుబట్టాడు.

రెండు నెలల క్రితం విరూపాక్షుడు చరణ్‌దాస్ ప్రక్క సీట్లో జేరాడు అంతకుముందు మరో ఊళ్ళో ఉండేవాడు బదిలీ అయ్యింది. వచ్చి సరిగ్గా చరణ్‌దాస్ సీటుకు ఆనుకుని ఉన్న సీట్లోకి వచ్చాడు

మొదటి రోజున విరూపాక్షుడిని చూడగానే చరణ్‌దాస్‌కు ఎంతో స్నేహంచేయాలన్పించింది. విరూపాక్షుడిలో ఎన్నో ఆకర్షణలు సుందర విగ్రహం మితభాషి. మాటల్లో ఎంతో సున్నితత్వం.

చరణ్‌దాస్ బ్యాంకు ఉద్యోగంలో జేరి ఆరేళ్ళయింది రెండేళ్ల క్రితం కోమలిని పెళ్ళి చేసుకున్నాడు కోమలికి చరణ్‌దాస్ అంటే చాలా ఇష్టం

చరణ్‌దాస్ మాటల సందర్భంలో కోమలితో విరూపాక్షుడి గురించి చెప్పాడు. విరూపాక్షుడి గురించి భర్త చెబుతూంటే విన్నేది కోమలి

ఒకరోజున 'విరూపాక్షుడిని టీకి పిలుస్తున్నాను" అన్నాడు చరణ్

కోమలి భర్త ఆలోచనను ఆమోదించింది ఆ నాటి నుండి మధ్యాహ్నం రెండు అయ్యేసరికి రోజూ విరూపాక్షుడని ఇంటికి టీకి తీసుకు వస్తున్నాడు

దాదాపు నెల రోజుల పరిచయంలో విరూపాక్షుడంటే కోమలికి కూడా చాలా గౌరవం ఎర్పడింది 'అన్నయ్యగారు' అంటూ ఎలవడం అలవాటయ్యింది

బ్యాంకుకు దగ్గరగా ఇల్లు ఉండడం వల్ల టీకి ఇంటికి వెళ్ళడం వీలవుతోంది అందుకే ఉన్నట్టుండి విరూపాక్షుడికి ఒక సలహా ఇచ్చాడు. 'బ్యాంకుకు సమీపంలో నివాసానికి ఇల్లు చూసుకోమని అభ్యంతరం లేకపోతే తాను సహాయం చేస్తానని కూడా అన్నాడు' చరణ్.

విరూపాక్షుడు చిరుమందహాసం చేశాడు టీ త్రాగే సమయంలో కోమలి ఎదురుగా చరణ్ మళ్ళీ విరూపాక్షుడికి సలహా యిచ్చాడు

'ప్రక్క వీధిలో ఒక పోర్షన్ ఖాళీ అయ్యిందిట. కావాలంటే చూడండి' కోమలి అంది

విరూపాక్షుడు ఏమీ మాట్లాడలేదు

'మనిద్దరం వెళ్ళి చూసి వద్దమా?' చరణ్ అడిగాడు

'నేను కుటుంబంతో నా మకాం ఈ ఊరుకు మార్చేశాను' అన్నాడు విరూపాక్షుడు.

చరణ్, కోమలి ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు ముగ్గురి మధ్య మౌనం టీ త్రాగడం పూర్తి అయ్యింది

'అన్నయ్యగారు' వదినగార్ని ఒకసారి తీసుకురండి' కోమలి అంది.

విరూపాక్షుడు చిన్నగా తలాడించాడు.

విరూపాక్షుడు అయిష్టంగానే చరణ్ ఇంటికి టీకి వస్తున్నట్లు కన్పిస్తుంది. చాలాసార్లు తన అయిష్టతను చెప్పాడు చరణ్‌కు విరూపాక్షుడంటే ఎంతో యిష్టం ఏర్పరచుకున్నాడు. అందుకే విరూపాక్షుడికి టీకి వెళ్ళడం తప్పనిసరి అవుతోంది

బ్యాంకులో పని చేసుకుంటుంటే పోస్టుమాన్ వచ్చాడు ఒక ముఖ్యమైన ఉత్తరం మామగారు రాస్తారని ఎదరు చూస్తున్నాడు చరణ్ పోస్టుమాన్ వచ్చాడు కాని ఒక కవరు విరూపాక్షుడి చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు

బ్యాంకు చాలా హడావడిగా ఉంది. సోమవారం ఎవరి పనుల్లో వారున్నారు. అదృష్టం కొద్దీ చరణ్, విరూపాక్షుడు కౌంటర్ సీట్లలో లెరు.

విరూపాక్షుడు కవరు చింపాడు కలర్ ఫోటోలు. వాటిని తిరిగి కవరులో ఉంచి బల్ల మీద పెట్టాడు.

'అందరూ కులాసానే గదా!' కుతూహలంగా అడిగాడు చరణ్ ఏమిటన్నట్లు చూశాడు విరూపాక్షుడు

'ఇంత రం ఏవింది అందరూ కులాసానే గదా!'

మళ్ళ అన్నాడు

'మద్రాస్ నుండ నా బావమరిది ఫోటోలు పంపాడు' చెప్పాడు

'ఎవరివి?'

విరూపాక్షుడు చరణ్‌లోని ఆసక్తని గమనించాడు

'నాది – నా భార్యది' చెప్పాడు.

చరణ్ తర్వాత ఏం మాట్లాడాలో ఆలోచిస్తున్నాడు ఫోటో ఇస్తే బాగుండును. ఒకసారి చూడవచ్చు. అడిగితే ఏమనుకుంటాడో. అతని భార్య ఫోటో చూడడానికి ఇమ్మని అడగడంలో ఏం సంస్కారం ఉంటుంది

మౌనంగా ఊరుకున్నాడు

మధ్యాహ్నం రెండు గంటలయింది

టీకి రమ్మని ఆహ్వానించాడు.

విరూపాక్షుడికి ఇష్టం లేదు తల నొప్పిగా ఉందన్నాడు

'కోమలిని ఆసరాగా చేసుకొని ఫోటో చూడాలి' చరణ్ ఆలోచన.

తలనొప్పికి మందు తీసుకోవచ్చునని నచ్చజెప్పాడు

టీ త్రాగడానికి వచ్చాడు

మాటల సందర్భంలో ఫోటోల ప్రసక్తి తెచ్చాడు చరణ్.

'వదినగార్ని ఫోటోలో అన్నయ్యగారు చూపిస్తారన్నమాట' సమయం చూసి సందర్భం సరిపడేలా అంది

విరూపాక్షుడు మారు మాటాడకుండా తన బ్యాగ్‌లోంచి ఫోటోలున్న కవరు యిచ్చాడు.

చరణ్‌కు కూడా చూడాలని ఉంది కోమలి ఫోటోలు తనకు కూడా చూపిస్తే బాగుండును.

కోమలి పెద్ద పెద్ద కళ్ళతో ఎంతో ఆశ్చర్యంగా చూసింది ఫోటోలను. చరణ్ ఇంక మనసును అదుపులో ఉంచలేకపోయాడు కోమలి సరసన జేరి ఫోటోలు చూశాడు చరణ్ విరూపాక్షుడని మనసులో ఎంతగానో అభినందించాడు. ఏమి అదృష్టం అతనిది సుందర రూపుడతడు. భార్య అప్సరస. దివి నుండి భువికి దిగి వచ్చిన దేవకన్యలా ఉంది.

ఊరి చివర ఇంట్లో దిగారని మా వారు చెప్పారు వదినగార్ని ఒకసారి తీసుకురండి' కోమలి అంది.

, అలాగే అన్నట్లు తలూపాడు

చరణ్ తరచు కోమలితో విరూపాక్షుడి విషయం

మాటా చెప్పాడు విరూపాక్షుని గూర్చి పొగడ్తలు ఎంతో

అందగత్తె వారి దాంపత్యం చాలా గొప్పది ఒకరి మాట మరొకరు గౌరవించుకుంటారు. వారి మాటలు వారికే గాని మరొకరికి వినిపించవు

ఇదంతా చరణ్ ఊహని కోమలికి తెలీదు

'నేను మీ మాట వింటున్నాను కదండి' అనేది అమాయకంగా

'మాట వింటే అందం' అందం' అదెలా వస్తుంది?' అనే భావాన్ని వ్యక్తపరచలేక సతమతమవుతూ ఉండడం మొదలు పెట్టాడు చరణ్

హాయిగా నడిచే చరణ్ కుటుంబంలోకి కావాలని కోరుకుని విరూపాక్షుడిని ప్రవేశపెట్టాడు.

తన భార్య వల్ల తను పడాల్సినంత సుఖం పడటం లేదని అపోహ పడడం మొదలు పెట్టాడు.

వేళకు ఏం' కావల్సినా అడక్కుండా కోమలి తయారు చేసి పెడుతుంది

సాయంత్రం అయ్యేసరికి నీటుగా ముస్తాబయి భర్త కోసం ఎదరు చూస్తుంది

భర్తకు ఎదురు చెప్పదు ఆలోచన అవసరం అయితే మంత్రిని మించిన ఆలోచనలు చెబుతుంది.

ఇంటిని చూసి ఇల్లాలు వరుస చెప్పవచ్చునంటారు ఇల్లు శుభ్రంగా వుంచి ఉన్న

కొద్ది వస్తువులను ఎంతో ఆకర్షణీయంగా అమరుస్తుంది

అయినా చరణ్‌కు అసంతృప్తిగానే ఉంది. చరణ్ మనసులో ఆదర్శదంపతులుగా విరూపాక్షుడు అతని భార్య నిలచిపోయారు.

విరూపాక్షునితో స్నేహం ఇలాంటి పరిణామానికి దారి తీస్తుందని కోమలి ఊహించలేకపోయింది

టీ త్రాగుతున్నారు

'అన్నయ్యగారు రేపు ఆదివారం మీ యింటికి మేమిద్దరం వద్దామనుకుంటున్నాం' కోమలి విరూపాక్షునితో అంది

విరూపాక్షుడు ముఖంలో భావాలు లేవు

రమ్మనా? వద్దనా? అర్థం కాదు

కోమలి మళ్లీ అంది




'ఆదివారం ఊళ్లో ఉంటారా? ఎక్కడికైనా క్యాంపు ఉందా?' చరణ్‌కు కోపం వచ్చింది. ఈ ప్రశ్న అనవసరం అతని దృష్టిలో విరూపాక్షుడు 'క్యాంపు ఎక్కడకు లేదు!' అన్నాడు,

ఎప్పుడు ఆదివారం వస్తుందా అని చరణ్ చాలా ఎదురు చూశాడు.

ఆదివారం మళ్లీ ఎలాంటి మార్పులకు నాంది కాబోతోందో కోమలి ఆలోచించ లేకపోతోంది. చరణ్ కోసం ఈ ప్రయాణం. తనకైతే ఇష్టం లేదు. ఏది ఎలా జరగాలో అలా జరుగుతుంది. అనవసరంగా ఆలోచించి మనసు పాడు చేసుకోవడం మంచిది కాదు.

ఎదరు చూసిన ఆదివారం సూర్యోదయంతో మొదలయింది. కోమలి చురుగ్గా వంట చేసింది. టిఫిన్ తిని ఇద్దరూ విరూపాక్షుని యింటికి వెళ్లారు.

ఇల్లు సులువుగానే దొరికింది. చరణ్ కోమలి వస్తారని ముందుగానే తెలుసు కాబట్టి విరూపాక్షుడు వారిని లోపలకు ఆహ్వానించాడు.

మధ్య గదిలో వనజాక్షి పిల్లలిద్దర్ని చదివిస్తోంది. విరూపాక్షుడు పరిచయం చేశాడు. వనజాక్షి అతిథులిద్దరకూ నమస్కరించింది.

ఇల్లు చాలా బాగుంది. ప్రతి వస్తువు, దాని అమరిక చరణ్ జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు. విరూపాక్షుడు మాట్లాడుతున్నాడు వనజాక్షి వింటోంది.

చరణ్‌కి నేనంటే చాలా ఇష్టం. నిజానికి బ్యాంకులో మధ్యాహ్నం టీ త్రాగవచ్చు బ్యాంకుకు దగ్గరలో ఇల్లుండడం వల్ల రోజూ నన్ను చరణ్ వాళ్లింటికి టీ కోసం ఆహ్వానించేవాడు." విరూపాక్షుడు భార్యతో చెబుతున్నాడు.

నా తత్వం నీకు తెల్సుగా. నేను అభిమానించే వక్తులకు గాక నన్ను అభిమానించే వారికి ఎక్కువ విలువ ఇస్తానని ఆ విధంగా మాకు మంచి స్నేహం కుదిరింది విరూపాక్షుడు ఇంకా మాట్లాడుతున్నాడు.

విరూపాక్షుడు ఇన్నిమాటలు అనర్గళంగా మాట్లాడడం తను వినడం మొదటిసారి ,అనుకున్నాడు చరణ్.

వనజాక్షి ప్రవర్తనకు చరణ్ నిర్ఘాంతపోయాడు.

ఒక గంట గడిచాకా కోమలి, చరణ్ ఇద్దరూ ఇంటికి వచ్చేశారు. వాళ్లిద్దరూ ఏం మాట్లాడుకోలేదు. చరణ్‌లో రకరకాల ఆలోచనలు.

మరసటి రోజు బ్యాంకు పని అయిపోయింది విరూపాక్షుడు చరణ్ బయటకు వచ్చారు. 'కాఫీ త్రాగుదాం. హోటల్‌కు వెడదామా?' చరణ్ అడిగాడు.

ఇద్దరూ హోటల్లో ఒక చివర కూర్చున్నారు చరణ్ తన మనసులో ఉన్న ఒక ప్రశ్నను విరూపాక్షుడిని సూటిగా అడిగాడు. విరూపాక్షుడు ఏమీ ఆశ్చర్యపోకుండా తన కథ చెప్పడం మొదలుపెట్టాడు

నేను ఒక అనాధ శరణాలయంలో పెరుగుతూండగా కోదండరామయ్య గారని ఒక మాష్టారు నన్ను తనింటికి తీసుకు వెళ్లి పెంచారు నాకు చదువు సంధ్యలు ఆయనే నేర్పించారు.

ఆయన నాకు జీవితంలో రెండు ముఖ్యమైన పాఠలు నేర్పారు. ఒకటి ఇచ్చిన మాట పోషించుకోవడం రెండవది జీవితాన్ని ఒక చాలెంజ్‌గా తీసుకోవడం

ఆయన చెప్పిన పాఠాల వెనుక ఆయనకు ఒక అనుభవం ఉంది. కోదండరామయ్య గార్కి ఒక్కతే కూతురు. ఆమెకు ట్యూబ్యులార్ విజన్. అంటే ఆమెకు ఎదురుగా ఉన్న వస్తువులే కన్పిస్తాయి. మరింకేమి కన్పించవు.

ఆమె వివాహం, జీవితం మాష్టారు ఒక ఛాలెంజ్‌గా తీసుకున్నారు. అందుకే నన్ను జేరదీశారు. మాష్టారు నాకు కొత్త జీవితాన్ని ప్రసాదించిన మహావ్యక్తి. అందుకే నేను ఆయనను మామగారిగా అంగికరించాను.

జీవితం అంటే వెండి తెర మీద కన్పించేటంత అందంగా ఉండాలంటే మన వాతావరణం మనం కల్పించుకుని అందులో ఆనందపుటంచులు తాకాలి. అది నా సిద్ధాంతం.

మీరు అనుకుంటున్నట్లు నేను ఏ నాడూ విచారించటం లేదు. కొద్ది లోపంతో ఉన్న నా భార్యకు ఆ లోపం జ్ఞాపకం రాకుండా ఎప్పుడూ నవ్వుతూ ఆడుతూ పాడుతూ హాయిగా కాలక్షేపం చెయించగల్గడంలో నాకుండే తృప్తి మీరు కొలవ లేకపోవచ్చు.

విరూపాక్షుడు మాటలు వింటూ చరణ్ ఏం మాట్లాడలేకపోయాడు.

చరణ్ ఇంటికి వెళ్లాడు. అప్పుడే చీకటి పడుతోంది. గుమ్మానికి తెర వ్రేలాడుతోంది. లోపల రేడియో సినిమా పాటలు పాడుతోంది.

తెర తొలిగించాడు. భర్త రాక కోసం ముస్తాబయి కూర్చున్న కోమలి ముఖంలోకి చూసేసరికి తన ముఖంలో ఉన్న నీర్సం ఎటో తప్పుకుంది.

భార్యాభర్తల మధ్య అనురాగం అందానికి సంబంధించినది కాదు. దాని వెనుక ఎన్నో అనుబంధాలు పెనవేసుకు ఉంటాయనిపించింది చరణ్‌కు. ☐

ఎమ్ ఎన్ వినుకొండ

★ తమాషాగా, చాకచక్యంగా స్త్రీలను సమర్థించ కలిగే ప్రశ్నలను మాత్రమే ఎన్నుకుంటారను కొంటాను

● కొలంబస్! కనిపెట్టావే?

పి ఎల్ నరసాపూర్

★ మిరు స్త్రీ జీవితంలో ఒకర్నే ప్రేమిస్తుందంటారు మరి నేను యిప్పటికే ముగ్గురిని ప్రేమించాను నా వయసు పదహారు

● అయితే నువ్వు ప్రేమించినది – తాతయ్యని అమ్మమ్మనీ అమ్మనీ అయివుండాలి! లేకపోతే ప్రికే వేనా అయివుండాలి!

ఎన్ వి ఆర్ సంగం జాగర్లమూడ

★ నేటి సమాజంలో మార్పుక రచనలు ఎంత వరకు దోహదం చేస్తున్నాయి?

● సమాజధోరణిని కాక రచనా ధోరణిని మార్చడానికే దోహదం చేస్తున్నాయి

ఎం ఆర్ నారాయణపేట

★ భార్యా భర్తలిద్దరు కాక ఒకరే ఉద్యోగస్థులైతే దేశంలో నిరుద్యోగ సమస్య తీరుతుందని నా అభిప్రాయం

● ఆ చేయవలసినది– మగవారే కావాలా అన్నది నేటి మహిళాలోకం వేసే ప్రశ్న?

వి వి హైదరాబాదు

★ అమ్మ నాన్న చూసిన అమ్మాయిని చేసుకోవాలా? లేక ఆదర్శ వివాహం చేసుకోవాలా?

● ఇష్టమైన అమ్మాయిని చేసుకోవడమే ఆదర్శ వివాహం కాదు ఆత్మగౌరవం చంపుకోకుండా కూడా వివాహం చేసుకోకల్గాలి ప్రేమించేసి తరువాత అమ్మా నాన్నలని కట్నం బేరాలకి పంపే కేసు లెక్కువ అవుతున్నాయని వింటున్నా

బి ఎమ్ డి ఎమ్మిగనూరు

★ ఇంత కాలంగా సాహితి సేవ చేస్తున్నారు




మిరు సాదించిన దేమిటి?

● 1951 నుంచి రచనా వ్యాసంగం చేస్తున్నా సాదించినవి ఎబయి టైటిల్స్!

ఎస్ ఏ కలిగిరి

★ ఆడవాళ్లను ప్రతి వస్తువుతో పోలుస్తారు కాని మగవాడిని ఏ వస్తువుతో పోల్చరు ఎందుకు–

● ప్రకృతిని స్పందింప చేయికలది ఆడది – కాని మగవాడు కాదు అందుచేత

సి హెచ్ ఎల్ పి వల్లివలస

★ మిరేం చదువు కున్నారు? మి కులం ఏది? మిరు పత్రిక కార్యాలయానికి వెళ్లి జవాబు లిస్తారా?

● కులం బి సి చదువు బి ఏ యింట్లో కూర్చుని పని చేస్తాను– అంత మాత్రాన కుంటిదాన్ని కాను. (అయినా రచనా వ్యాసంగానికి కూడా కులగోత్రాల బాద దేనికో!)

కె ఎన్. ఆర్. వరంగల్

★ లంచం పోడానికి బదులు పెరిగి పోతోంది రాష్ట్రంలో దీనికి దారి?

● ప్రతి చిన్న చేపా తిమింగలంగా ఎదుగుతుందన్న సామెత– లంచం విషయంలో నిజం కాబోలు

ఎ. సి ఎస్. ఖుర్దారోడ్డు

★ నేను దేవుడు లేడు అంటాను మిరు?

● ఉన్నాడంటే కొంపేం మునుగుతుంది? అంటా

టి ఏ ఎన్ ఆర్; బి ఎస్. ఆర్. ఎమ్మిగనూరు

★ మి జీవితంలో మిరు చేసిన మంచిపని ఏమైనా వుందా!

● తెలియదు అది పైవాళ్ళు చెప్పాలి– నే నెలా చెప్పను?

★ సంఘంలో నానాటికీ దిగజారి పోతున్న మానవతా విలువలపై మి అభిప్రాయం?

● అవసరాలు మనిషిని మృగంగా మార్చేస్తున్నాయి ఇక విలువలు నిలబడేది ఎలా?

★ యముడే మికు ఎదురైతే?

● ఏ రూపంలో??

వై ఎస్ మండపేట

★ ఆడపిల్లలకు కట్నం యివ్వనిదే పెళ్లిళ్ళు కావా? కట్నం కోరిన వారిని జైలు వేయాలి?

● ఏం లాభం? మనిషి మారాలిగాని కట్నం యివ్వము– పెళ్ళి కాక పోయినా సరే నని అమ్మాయి తల్లి తండ్రులు, కట్నం తీసుకోము– పెళ్లి చేసుకోక పోయినా ఫరవాలేదని అబ్బాయిలు దృఢంగా నిశ్చయించు కోవాలి అలా నిలబడ కల్గాలి

ఎస్ వి. ఆర్ సంగం జాగర్లమూడి

★ భారతదేశపు బానిస మేదావి వర్గంలో చైతన్యం వస్తుందంటారా? అసలీ జాడ్యానికి మన విద్యావ్యవస్థా లేక వేలిముద్ర రాజకియాలా కారణం?

● వచ్చిందంటున్న మార్పు మిరు గుర్తించకపోతే ఎలా?! ఇక బానిస మనస్తత్వం – వేలి ముద్రలోనూ విద్యలోనూ లేదు – మనిషిలో నేవుంది

వి. వి ఆర్. హైదరాబాదు

★ ఈ ఆడవాళ్లకి అలంకరణ మోజు తగ్గదా?

● రాతి గుట్టకి – చచ్చిన మొక్కైనా – అందాన్ని తెస్తుంది. అలాగే ఎంత సాదాసదా ముఖానికైనా – కాస్త అలంకరణ ప్రాణం పోస్తుంది

★ డబ్బుకే ఎందుకంత విలువ?

● వినలేదా – బంగారం మాట్లాడ్తం ప్రారంభిస్తే – ఎంత వాగే వాడి నాలుకైనా సైలెంట్ అయిపోతుంది

బి ఎన్ ఆర్ అంకిరెడ్డిపల్లి

★ ఏదైనా పారం గాని, కాగితం గాని చేవ్రాలు చేయడం రాకపోతే ఎడమ చెయ్యి బొటన వ్రేలు ముద్ర తీసుకుంటారు కారణం?

● మనిషి ఆ వేలు ముద్ర యింకో మనిషికి వుండడం అన్నది దాదాపు అసంభవమని అంటారు అందుకు □



# గోదావరి
# డి.ఎ.పి. NP 18-46

వ్రేళ్ళను బలపరుస్తుంది

దిగుబడులను పెంచుతుంది




మన పంట భూములలో నత్రజని, భాస్వరాలు పైర్లకు కావలసిన మేరకు లేవని వ్యవసాయ పరిశోధనలలో వెల్లడయింది గోదావరి డి ఎ పి లో ప్రతి 100 కిలోలకు మొత్తం 64 కిలోల పోషకపదార్థములు అంటే 18 కిలోల నత్రజని, 46 కిలోల భాస్వరం ఉంటాయి

నత్రజని పైర్లను ఏపుగా పెంచుతుంది భాస్వరం వ్రేళ్ళను వృద్ధి చేస్తుంది "వేరు కొద్దీ బలం" అన్న సామెత అక్షరాలా నిజం వ్రేళ్ళు వృద్ధి కావడం మూలంగా పైర్లు పోషకాహారాలను ఎక్కువగా గ్రహించి కాయలను, గింజలను అధికంగా ఉత్పత్తి చేస్తాయి

మెట్టపైర్ల విషయంలో కూడా భాస్వరం చేసే మేలు ఎంతో ఉంది వ్రేళ్ళు లోతుగా పెరగడం మూలంగా నేల లోపలి పొరల్లో ఉన్న తేమను సైతం గ్రహించును మెట్టపైర్లు నీటి ఎద్దడిని తట్టుకోగలవు పైర్లు సుమారు 10 రోజులు ముందుగా కోతకు వస్తాయి

గోదావరి డి ఎ పి వర్షాధారము, నీటిసాగు పైర్లకు ఎంతో అనువైన ఎరువు రైతులు గోదావరి డి ఎ.పి ని వాడినట్లయితే భూసారం పెరిగి పంటలు అధికంగా పండుతాయి గాదెలు నిండుతాయి.

అందుకే గోదావరి డి.ఎ.పి. ఎరువు కొనండి. దుక్కిలోగాని, దమ్ములో గాని వాడండి. అధిక దిగుబడులను పొందండి. మీ రాబడిని పెంచండి.



GFC గోదావరి ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్

వాణినిలయం, 50 సెబాస్టియన్ రోడ్, సికింద్రాబాదు - 500 003.

Priyadarshini

సీరియల్

# కఠినశిల




(గత సంచిక తరువాయి)

ఆ రోజు ఆదివారం

స్నానమైనా చెయ్యకుండా ఈజీచైర్లో కూర్చుని తల్లి ఫోటో కేసి పరిశీలనగా చూస్తోంది సరయు ఆమె కళ్ళల్లో నీరూరి ఫోటో మసగ్గా కనిపిస్తోంది

లోపలికి రావచ్చా?

గబాల్న లేచి అతను చూడకుండా కళ్ళు తుడుచుకుని

రండి' అంటూ రమణని ఆహ్వానించింది సరయు అతను చూడకూడదనుకున్నా ఆమె కంటినీ రతను చూడనే చూశాడు అయినా గమనించనట్టు-

వంట కాలేదా? అన్నాడు లోపలికొచ్చి ఆమె కెదురుగా వున్న కుర్చీలో కూర్చుంటూ

ఉఁ హుఁ' ఏవిఁటో ఇవాళ డల్‌గా వుంది మీరి పేపర్ చూస్తూండండి' నేను కాఫీ తెస్తాను అంటూ అతని సమాదానం కోసం చూడకుండానే అతనికి పేపరిచ్చి లోపలి కెళ్ళి పోయింది సరయు

రమణ ఓసారి శాంతమ్మ ఫోటో కేసి చూశాడు ఆమె చిరునవ్వులు చిందిస్తూ-

నా కిచ్చిన మాట మర్చిపోవుగా? అని ప్రశ్నిస్తున్నట్టు అనిపించిందతనికి సన్నగా నిట్టూర్చాడతను

రెండు కప్పులతో కాఫీ తెచ్చి ఒకటి అతని కిచ్చి ఒకటి తాను తాగుతూ కూర్చుంది సరయు

సరయూ' హటాత్తుగా పిల్చాడు రమణ ఇప్పుడతను ఆమెని అలాగే పిలుస్తున్నాడు

ఏవిఁటి? అన్నట్టు ఆమె తలెత్తి చూసింది

జరిగినకథ –5 శాంతమ్మ ఏకైక కుమార్తె సరము రామారావుగారి ఏకైక కుమార్తె డాక్టరు శ్యామలకు తను ప్రేమించిన ప్రబాకర్‌తో పెళ్ళి నిశ్చయమవుతుంది సరయుకి కృష్ణయ్య అండ్ కంపెనిలో ఉద్యోగం వచ్చింది సరయుని వేణుమాదవ్ ఆపీసులో పలకరిస్తాడు డాక్టర్ శ్యామల పెళ్ళి జరిగిపోయింది పీడ కల వచ్చి తృళ్ళిపడి లేచిన సరయుకి స్పృహ కోల్పోయి ఉన్న తల్లిని చూసేటప్పటికి గుండె ఆగినంత పనయింది తమ ఇంట్లో అద్దెకుండే రమణని తల్లి ధగ్గర ఉంచి వంశదార కేసి పరిగెత్తింది సరయు సరయు తల్లి చనిపోయింది రమణ అన్నీ తానే అయి ఆదుకున్నాడు సరయుకి రమణతో చనువు పెరిగింది

నేనో మాటడుగుతాను మరోలా అనుకోరుగా?

అనుకోను' అడగండి' నవ్వుతూ అంది సరయు

మనం కాస్సేపలా తిరిగొద్దామా? బయం భయంగా అడిగాడు రమణ

'ఎక్కడికి? అంది నవ్వుతూనే

ఎక్కడికైనా సరే' మీరు తొందరగా కోలుకుని పాత సరయులా అవాలంటే కాస్త సరదాగా తిరగాలి'

సరదాగానా? అంటే? ఓరగా చూస్తూ అంది సరయు

అదే సరదా అంటే క్షణం తడబడ్డాడు రమణ

సినిమాలకో, పార్కులకో' అవునా? తనే అంది సరయు అతన్ని పరిశీలనగా చూస్తూ

అవును' నా మనసు కూడా బాగా లేదు ఇద్దరం కలిసి ఏదైనా మార్నింగ్‌షోకెళ్ళి హోటల్లో భోజనం చేసి వచ్చేద్దాం' అభ్యర్థనగా అన్నాడు రమణ

అలా అతను ఎప్పుడూ అడగలేదు

సరయు ముఖం గంభీరంగా అయిపోయింది

'సారి రమణగారూ' నా కలాంటి సరదాలు లేవు' చేతిగోళ్ళని చూసుకుంటూ అంది

'సరయూ' మీ సంగతి నాకు తెలియదా అమ్మగారున్నప్పుడు స్నేహితులతో చేరి ఎంత అల్లరి చేసేవారు? ఎన్ని సినిమాలు చూసేవారు చైతన్యానికి మరో పేరులా వుండే మీరు ఇలా స్తబ్ధుగా వుండటం నాకేం బాగా లేదు అందుకే ఇవాళ అలా వెళ్దాం రండి' కాస్త చనువుగా అన్నాడు రమణ

ఓ' పరవాలేదే మీకూ లోకం తెలుసు' అదోలా అంది సరయు రమణ ముఖం చిన్నబోయింది

అంటె నేనో జడపదార్థాన్నని మీ ఉద్దేశమా? అన్నాడు నొచ్చుకున్నట్టు

చ' చ' అదికాదు మీ రెప్పుడూ ఇంటి పట్టునే వుండేవారు కాదు వున్నా ఈ లోకంలో వుండేవారు కాదు అందుకే మా గురించి మా అల్లరి గురించి ఎలా తెలుసా అని ఆశ్చర్యంగా వుంది' చిన్నగా నవ్వుతూ అంది సరయు

లోకంలో లేకపోవడం ఏవిఁటండి, మీ పక్కనే వున్నాను మీకూ, నాకూ కేవలం ఓ గోడ మాత్రమే అడ్డు' తనూ నవ్వుతూ అన్నాడతను

నేననేది అది కాదండి' పూర్వం మీరు సురాపానం చేసి అమరలోకాల్ని చూసేవారు చూడండి ఆ లోకాల్ని గురించి నేను మాట్లాడేది' అంది సరయు

రమణ ముఖం పాలిపోయింది అతని మొహాన్ని చూసిన సరయు గతుక్కుమంది అతన్ని నొప్పిద్దామని అనలేదామె తమాషా కంది అతను బాదపడ్డం చూసి–

అయామ్ సారి రమణగారూ' మిమ్మల్ని నొప్పిద్దామని కాదు సరదాగా

అన్నాను క్షమించండి' అంది

నా తప్పుకి మీరు క్షమార్పణ అడుగుతారేం? నేనే ఆలోచించకుండా మిమ్మల్ని నాతో బైటికి రమ్మన్నాను మీరే నన్ను క్షమించండి' లేస్తూ అన్నాడు తను

అదికాదు రమణగారూ

ఇట్సాల్‌రైట్' జరిగిందాన్ని మర్చిపోండి అంటూ గబగబా నడిచి బైటి కెళ్ళిపోయాడు రమణ

చ' తొందర పడ్డాను' అనుకుంది సరయు బాధగా

★ ★ ★ ★

తన మొదటి రాత్రి జరిగిన సంఘటన ప్రభాకర్ మనసులో చెరగని ముద్ర వేసింది లేడి చూపుల్లా బెదిరే సరయు కళ్ళు అతన్ని వెంటాడుతున్నట్టే అనిపించేది

రాత్రిపూట, ఒంటరిగా, భయానక దృశ్యాలతో, గేటుబైట వాచ్‌మన్‌ని గేటు లోపల తోడేల్లాంటి కుక్కని లెఖ్ఖ చెయ్యకుండా వీర వనితలా లోనికొచ్చి రాగానే తెచ్చిపెట్టుకున్న ధైర్యసాహసాలు గాల్లో కలిసిపోగా అతిదీనంగా తల్లిని కాపాడమని వేడుకుంటున్న ఆమె మొహం కళ్ళ ముందు నించి తొలగటం లేదు

పాపం' తను చేసిన సాయం ఆమెకి వుపయోగపడ లేదు తల్లి పోయింది ఆమె ఒంటరిగా మిగిలి పోయింది ఎందుకో ఓసారి వెళ్ళి ఆమెని ఓదార్చాలని పించింది వెళ్ళి ఓదార్చాడు కాని తమలాంటి వారి ఓదార్పులతో ఆమెకి ఫలితం ఏమిటి? ఆమె పట్ల ప్రభాకర్ మనసంతా జాలితో నిండి పోయింది

పై మేడమీంచి సరయు ఇంటికేసి చూస్తున్న ప్రభాకర్ భార్య రాకను గమనించనే లేదు



# కరిగిన శిల

హాయ్ ప్రభూ! ఇక్కడ ఒంటరిగా ఏం చేస్తున్నారు' ఫుల్ మేకప్‌లో వచ్చింది శ్యామల

నీ కోసమే చూస్తున్నాను డియర్! కొంటెగా అన్నాడతను ఆమె బుంగమూతి పెట్టి

అబద్ధం అంది

అబద్ధమా? అయితే నా హృదయాన్నడుగు! భార్య తలని గుండెలకి అనించుకుంటూ అన్నాడు ప్రభాకర్

యూ నాటీ! చిన్నగా అతని చెంపమీద కొట్టింది శ్యామల

అవును ఎక్కడికి ప్రయాణం? ఆమె చీర జరీ అంచు సవరిస్తూ ప్రేమగా అన్నాడు ప్రభాకర్

చెప్తాను ముందు తమరు కిందికి రావాలి! అతని చెయ్యి గుంజుతూ అంది శ్యామల

ఓ! కో పద అన్నట్టు మీ బామ్మెక్కడుంది? భయంగా అన్నాడతను

కింద హాల్లో వుంది! ఏం?

అమ్మ బాబోయ్! నేర్రాను! భయంగా అన్నాడు ప్రభాకర్

'ఏం?

మీ బామ్మన్నా, ఆవిడ ప్రశ్నలన్నా నాకు చచ్చే భయం! భయం నటించాడతను

శ్యామల నవ్వింది

బామ్మ మిమ్మల్ని చూడగానే పెరట్లో కెళ్ళి పోతుంది మీ కొచ్చిన భయం ఏంలేదు పదండి! డేడీ మీ కోసం ఎదురు చూస్తున్నారు? అంది

ఎందుకు?

అదేమో!

సరే పద అన్నట్టు బట్టలు అవీ సర్దుకున్నావా? రేపే కదా మన ప్రయాణం? అన్నాడు ప్రభాకర్

ఆ క్షణంలో శ్యామల మొహం అదోలా అయిపోవడం అతను గమనించలేదు

ఇద్దరూ కింది కొచ్చేసరికి రామారావు ఎక్కడికో వెళ్ళడానికి సిద్ధంగా వున్నాడు అల్లుణ్ని చూసి–

రండి మిస్టర్ ప్రభాకర్! అన్నాడు కూర్చోమన్నట్టు సోఫా చూపిస్తూ

ప్రభాకర్ కూర్చున్నాడు

అతని వెనగ్గా నిల్చుంది శ్యామల వంటింటి గుమ్మం దగ్గర బుజాన్నిండా కొంగు లాక్కుని నిల్చుంది శారద బామ్మగారు మరో గుమ్మంలో తచ్చాడుతోంది

అందరూ అక్కడ సమావేశం అవడం చూసిన ప్రభాకర్ ఏదో పెద్ద విషయమే వుందనుకున్నాడు ఓసారి మామగారి కేసి చూస్తూ–

'పిల్చారా? అన్నాడు

అవునండి కాస్త మీతో మాట్లాడాలి! నసుగుతున్నట్టు అన్నాడు రామారావు

మాట్లాడండి కానీ చిన్న రిక్వెస్ట్! నన్ను మీరు, మీరు అనడం మానేసి హాయిగా పేరు పెట్టి పిలవండి' అన్నాడు ప్రభాకర్

రామారావు తేలిగ్గా నవ్వేశాడు అల్లుడి కేసి తృప్తిగా చూశాడు

ఊఁ చెప్పండి! అన్నాడు ప్రభాకర్ కుతూహలంగా

మీ నర్సింగ్‌హోమ్ ఓపెన్ చెయ్యడం గురించి ఏం ఆలోచించారు? మామూలుగా అడిగినట్టు అడిగాడు రామారావు

ఇందులో ఇంకా ఆలోచించ డానికేం వుంది? ఈ నెలాగి ప్రారంభిద్దామని మొదట్నుంచి అనుకున్నదేగా?! ఆశ్చర్యంగా అన్నాడు ప్రభాకర్

నిజమే కానీ ఎక్కడా? అని!

ఎక్కడా ఏవిటండి! మా వూరి దగ్గరగా వున్న పట్నంలో అని మనం అనుకున్నాంగా! మరింత తెల్లబోతూ అన్నాడు ప్రభాకర్

'అవుననుకో! కానీ అది పెద్ద సిటీయే కాదు ఇద్దరు డాక్టర్లు స్వంతంగా ప్రాక్టీసు పెట్టుకోగల ఇన్‌కం అక్కడుంటుందా అని !

ఓ! అదా! మేం ఇద్దరమే కాదండి అక్కడుండేది– ఇంకా చాలా మంది డాక్టర్లున్నారు వీదికి నలుగురు డాక్టర్లున్నా మన ఇండియాలో రోగులకేం కొరత లేదు!" పెద్దగా నవ్వేశాడు ప్రభాకర్ .

కాని రామారావు నవ్వలేదు

అదికాదు ప్రభాకర్! శ్యామలని వొదిలి మేం వుండలేదెప్పుడూ అన్నాడు మెల్లగా

అయితే?

అఁహఁ! మరేంలేదు ప్రభాకర్! ఆ పెట్టే ప్రాక్టీసేదో ఇక్కడే పెడితే చదువుకి తగ్గ గుర్తింపు, రాబడి కూడా వుంటుంది మా ఒక్కగానొక్క పిల్ల మా కళ్ళెదుట వున్నదన్న తృప్తి మాకుంటుంది! మీ నాన్నగార్ని నేనొప్పిస్తాను నా మాట విని ఈ వూళ్ళోనే ప్రాక్టీసు పెట్టండి! అనునయంగా అన్నాడు రామారావు

మామగారి మాట వినగానే ప్రభాకర్ మొహం గంభీరంగా అయిపోయింది కనుబొమలు ముడివడ్డాయి వెనగ్గా వున్న భార్యకేసి చూశాడు ఆమె అతని కళ్ళలోకి చూడకుండా జాగ్రత్త పడింది

అవునల్లుడుగారూ! అమ్మాయి నొదిలి నేనూ వుండలేను ఆ ప్రాక్టీసేదో ఇక్కడే పెట్టండి బ్రతిమాలుతున్నట్టు అంది శారద రాజమ్మగారూ అదే అభిప్రాయాన్ని వెలిబుచ్చింది

క్షమించండి నేను మెడిసిన్ చదివిందే మా వూరి వారి కోసం! వైద్య సహాయంలేక మా పల్లెపట్టున ఎంత మంది చనిపోయారో నాకు బాగా తెలుసు చిన్నప్పుడే అనుకునే వాణ్ణి, నేను డాక్టర్నయి మా వూరి ప్రజలకి వైద్యం చెయ్యాలని! అదే మాట పెళ్ళికి ముందే శ్యామలకి చెప్పాను అందు కామె అంగీకరించాకే మా పెళ్ళయింది ' సాధ్యమైనంత సౌమ్యంగా అన్నాడు ప్రభాకర్

అదికాదు ప్రభూ! ఆ వూరేం బాగా లేదు కొత్త పిక్చర్స్ రావు ఓ ఎ సి హోటల్‌గాని, ఓ ఎ సి థియేటర్‌గాని లేవు కనీసం ఓ మంచి క్లబ్ అయినా లేదు గుణిసింది శ్యామల

ఎందుకు లేవు? అన్నీ వున్నాయి ఎ సి వి కాకపోయినా మంచి థియేటర్స్, మంచి హోటల్స్ వున్నాయి

అసలు ముందు మా పల్లెలోనే ప్రాక్టీస్ పెడతా నన్నాను కాని చుట్టుపక్కల పల్లెలన్నింటికి వీలుగా వుంటుందని అక్కడ నిర్ణయించాను ఓ మాదిరి పట్నంలా వుండే ఆ వూరే నీకు నచ్చకపోతే ఇంక మా పల్లె ఏం నచ్చుతుంది నీకు?' తమాషాగా తేల్చెయ్యబోయాడు ప్రభాకర్

లేదు ప్రభూ! అక్కడంతా బోర్! నాకేం తోచదు బాబూ! నా మాట విని

# శివోక్తం

(ప్రఖ్యాత కన్నడ కవి సర్వజ్ఞ వచనాలు ఆధారంగా)

తెగులుగొంటులు విందుల తినగరాదు
యోగులకు నిద్రపైకోర్కె యుండరాదు
అలసభావముద్యోగికి కలుగరాదు
బడుగువానికి కయ్యమ్ము పనికిరాదు

పడయు నిహలోక సుఖముల బడతివలన
పరము విభవమ్ము పొందును పడతివలన
పడయు సకల సౌభాగ్యముల్ పడతివలన
పడతి సంగమ్ము నొల్లని వాడెవండు ?

చాన వలపును గైకొను జాణతనము
స్వర్ణ సంపద సాధించు పనితనమ్ము
కదనమున గెల్పు కొల్లాడు గడుసుతనము
ప్రాప్త మగునయ్య నరునికి భవునివలన

–కనమలూరు వెంకట శివయ్య

ఇక్కడే ప్రాక్టీస్ పెట్టండి ఇక్కడ బస్టాండ్ దగ్గర మనకో మంచి సైటుంది. అక్కడ బ్రహ్మాండమైన బిల్డింగ్ పడుతుంది నర్సింగ్‌హోమ్ బాగా డెవలప్ చేసుకో వచ్చు కూడా" ఉత్సాహంగా అంది శ్యామల.

భార్య మాటలతో ప్రభాకర్ సిరియస్‌గా అయిపోయాడు

అంటే నన్ను మీ ఇంట్లో ఇల్లరికపు టల్లుడిగా వుండి పొమ్మంటావా? అన్నాడు గంభీరంగా

"ఛ! ఛ! అలా ఎందుకవుతుంది? ఇద్దరం డాక్టర్లం గనక, అమ్మా నాన్నలకి వేరే సంతానం లేదు గనక అన్నానంతే! తేలిగ్గా అనేసింది శ్యామల

అవునోయ్ ప్రభాకర్! ఆ స్థలం ఒక్కసారి చూసుకురా! మిగతా వన్నీ నేను చూసుకుంటాను మంచి ఆర్కిటెక్ట్ ఒకతను నా ఫ్రెండ్ అతని చేత మంచి నర్సింగ్ హోమ్‌కి ప్లాన్ వేయిద్దాం! అల్లుడి మౌనం చూసి ఉత్సాహంగా అన్నాడు రామారావు

సారీ మావయ్యా! మీ మాట కాదంటున్నందుకు మరోలా అనుకోకండి నేనా వూళ్ళోనే ప్రాక్టీసు పెడతాను ఇందులో మార్పుండదు

ఇంక శ్యామలని గురించంటారా, తరచు మీరూ రావచ్చు, తనూ రావచ్చు ఆ వూరికీ, ఈ వూరికీ మధ్య పెద్ద దూరం ఏం లేదు రేపే మా ప్రయాణం అంటూ లేచాడు ప్రభాకర్, సాధ్యమైనంత సౌమ్యంగా

అందులో మాధవ్!

చిరునవ్వుతో తననే చూస్తున్న మాధవ్

ఓ! మీరా" అంది సరయు నవ్వుతూ మనసంతా చికాగ్గా వున్న సరయుకి ఆ సమయంలో మాదవ్ కనిపించడం కాస్త ఆనందాన్నే ఇచ్చింది గల గలా నవ్వుతూ నవ్విస్తూండే అతనితో కాస్సేపు మాట్లాడితే తన మనసు కాస్త కుదుట పడుతుందేమో అనిపించిం దామెకి

అమ్మయ్య! గుర్తు పట్టారా? ఎక్కడికి బయల్దేరారు? చనువుగా అన్నాడతను

వూరికే అలా తిరిగొద్దామని! నవ్వింది సరయు వనజ దగ్గరికని చెప్పలేదు కావాలనే.

ఇప్పుడా?

ఊఁ! చిన్న షాపింగ్ చెయ్యాలి! అందంగా అబద్ధం ఆడింది

అయితే కారెక్కండి! అన్నాడతను

సారీ! దగ్గర్లోనే నేనెళ్ళే షాపు మొహమాటంగా అంది సరయు

ఎక్కడ?

అదే తడబడిందామె

అదిగో చూశారా! దొరికిపోయారు మీరు షాపింగ్‌కని బయల్దేర లేదు

## గడుసులోకం —బాబు







రామారావు బిత్తరపోయాడు శ్యామల ముఖం మరింత చిన్నబోయింది

* * * *

రమణ వెళ్ళిందగ్గర్నించి సరయు మనసంతా చికాగ్గా అయిపోయింది

ఎప్పుడూ లేంది అతను తనని సినిమాకి రమ్మని ఆహ్వానించాడు వెళ్తే ఏం పోయింది! వెళ్ళుండాల్సింది పాపం! తనేం అనుకున్నాడో! పదే పదే అనుకుని బాధపడ సాగింది ఓ పుస్తకం తీసుకుని పేజీలు తిప్పింది మనసుని డైవర్ట్ చెయ్యడానికి అయితే మనసు అందులోని అక్షరాలని గ్రహించటం లేదు రమణని గురించే ఆలోచిస్తోంది పుస్తకం కింద పడేసి పరధ్యానంగానే స్నానం చేసింది. చాలాసేపు ఆలోచించి ఏదో నిర్ణయించుకున్నట్టు చకచక వంట పని ముగించుకుని వనజా వాళ్ళింటికి బయల్దేరింది

మనసు బావుండనప్పుడల్లా సరయు వనజా వాళ్ళింటికి వెళ్తూంటుంది

ఆటో రిక్షా కోసం రెండు నిమిషాలు చూసి ఒక్క రిక్షా కనిపించక పోవడంతో మెల్లగా నడవసాగింది, ఎక్కడ కనిపిస్తే అక్కడ ఎక్కొచ్చన్న వుద్దేశంతో

హలో సరయుగారూ!

తలవంచుకుని పేవ్‌మెంట్ మీద నడుస్తున్న సరయు ఉలిక్కిపడి వెనక్కి తిరిగింది

ఓ ఫియట్ ఆమె పక్కగా వచ్చి ఆగింది కళ్ళు చిట్లించి చూసింది సరయు

అలా అయితే మీ చేతిలో ఓ చిన్న బేగ్ అయినా వుండేది అవునా? నవ్వుతూ అన్నాడతను

సరయు కూడా నవ్వేసింది

ఇప్పుడు చెప్పండి! ఎక్కడికి బయల్దేరారు? అన్నాడు మాదవ్

ఏమి తోచక మా ఫ్రెండ్ ఇంటి కెళ్దాం అనుకుని బయల్దేరాను కాని ఇప్పు డెళ్ళాలని లేదు నిజం చెప్పేసింది సరయు

అయితే నాలుగు రోడ్లూ అలా తిరిగొద్దాం రండి నాకూ ఏం తోచడం లేదు డోర్ తీసి పట్టుకుని చనువుగా అన్నాడు మాదవ్

సారి నేను నడిచే వెళ్ళిపోతాను!

ఏం? కంపల్సరి వాకింగా? కాని మీరంత లావుగా లేరే!" ఆశ్చర్యం నటించాడు మాదవ్

బలేవారే! అదేం కాదు! నవ్వేసింది సరయు

మరి?

నేను

ఆమె మాట పూర్తి కాకుండానే-

మిస్ సరయూ! మీ వివరాలు, మీరు ఎందుకు నడువాలను కుంటున్నారో అన్నీ కార్లో కూర్చుని తీరిగ్గా చెప్దురు గాని ముందు కారెక్కండి! అన్నాడు మాదవ్

## కరిగిన శిల

ఓసారి అతని కేసి పరిశీలనగా చూసి ఏకాంగా కారెక్కింది సరయు

థాంక్యూ!" అన్నాడతను కారు స్టార్ట్ చేస్తూ.

'ఎందుకు?

మంచి కంపెనీ యిస్తున్నందుకు!"

చురుగ్గా చూసింది సరయు. అతనదేం గమనించకుండానే-

అవును మిస్ సరయూ! ... ఒంటరిగా బోర్ కొట్టి తిరుగుతున్న నాకు ఓ అందమైన ఆడపిల్ల కనిపించి ఎంచక్కా కబుర్లు చెప్తున్నందుకు థాంక్స్ చెప్పద్దూ?" అమాయకంగా అన్నాడు మాధవ్

సరయు తృళ్ళిపడింది అతని ధోరణికి

'ఏమిటి మాట్లాడరు?' ఓసారి పక్కనే వున్న ఆమెకేసి చూస్తూ అన్నాడు మాధవ్

'మీరు మాట్లాడుతున్నారుగా!" చురుగ్గా అంది సరయు అతను పెద్దగా నవ్వేశాడు

"నిజం సరయూ!. మీరెంతో అందంగా వుంటారు.. మీ కళ్ళల్లోకి చూస్తూ ఎంత కాలమైన ఇట్టే గడిపెయ్యొచ్చు.... సారి .. నన్ను రౌడి కింద జమకట్టబోకండి! నాకు వున్నదున్నట్టు మాట్లాడ్డం మొదట్నించి అలవాటు!" రోడ్డు కేసి చూస్తూ అన్నాడతను

సరయు చెంపలు కందిపోయాయి

ఓరకంట ఆమెని గమనిస్తున్న మాధవ్‌కి అది సిగ్గో, కోపమో అర్థం కాలేదు.

'ఇఫ్ యు డోన్ట్ మైన్డ్ అలా వెళ్ళి. . ఓ కప్పు కాఫీ తాగొద్దాం ' మెల్లగా అన్నాడతను

ఏమనుకుందో -

"పదండి!' అంది సరయు

"ఓ! థాంక్యూ! థాంక్యూ వెరి మచ్!' ఉత్సాహంగా కారు వేగాన్ని పెంచాడతను.

కారు ఓ పెద్ద హోటల్ ఆవరణలో ఆగింది

ఇద్దరూ లోపలికెళ్ళి. ఓ మూలగా కూర్చున్నారు

'ఏం తీసుకుంటారు?' మెనూకార్డ్ చూస్తూ అన్నాడు మాధవ్

'నాకు కాఫీ మాత్రం చాలు!'

'నో! నాతో పాటు మీరూ ఏదైనా తినాలి!' అల్లరిగా అన్నాడు మాధవ్

"ఓ! కే లైట్ టిఫిన్ తెప్పించండి!" నవ్వింది సరయు

"థాంక్యూ!'

"మిస్టర్ మాధవ్!'

"ఎస్ మేడమ్! ...

"దయచేసి ఆ థాంక్స్ అన్న పదాన్ని కాస్సేపు మర్చిపోతారా? గంభీరంగా అంది సరయు.

"ఓ!కే ఓ కే' నవ్వేశాడతను. సరయు కూడా నవ్వింది

"ఏమన్నా కబుర్లు చెప్పండి!" అన్నాడు మాధవ్ టిఫిన్‌కి ఆర్డర్ ఇచ్చి.

"బావుంది నేనేం కబుర్లు చెప్పను. ఆఫీసు, ఇల్లు తప్ప మరో ప్రపంచం తెలియని దాన్ని ఆ కబుర్లేవిటో మీరే చెప్పండి." అంది సరయు

"అలాగే! అయితే వినండి... బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడి, దాని ఫలితంగా కోస్తా ఆంధ్రా అంతా గంటకి నూరు కిలో. మీటర్ల వేగంతో గాలి వీస్తుంది ఇంకా హైదరాబాద్‌లో సముద్రం పొంగి.. ఓ సారి . అన్నట్టు హైదరాబాద్‌లో సముద్రం లేదుకదు పోనీ .'

"ఇక చాలు!' గట్టిగా అంది సరయు.

'అయ్యో! ఇంకా కబుర్లు అవందే!" బిక్క మొహం వేశాడు మాధవ్

చాలా కాలం తర్వాత పకపక నవ్వేసింది సరయు

"అయ్యో! ముత్యాలు!. ఒలికి పోతున్నాయి!' కంగారుగా అన్నాడు మాధవ్

సరయు మళ్ళి నవ్వింది. మళ్ళి మళ్ళి నవ్వింది ఆమె మనసంతా తేలిగ్గా అయిపోయింది.

టిఫిన్ అది తీసుకుని కాస్సేపు కబుర్లు చెప్పుకున్నా రిద్దరూ. బిల్ పే చేసి లేస్తూ -

"నెక్స్ట్ మీ ప్రోగ్రాం ఏమిటి?" అన్నాడు మాధవ్

"ఏముంది. . మీరు మీ ఇంటికి, నేను మా ఇంటికి!" అంది సరయు

"అప్పుడే ఇళ్ళకా?" దిగులుగా అన్నాడతను.

"మరి?.... ఇంకా ఇక్కడే కూర్చుందామా?"

"ఊఁహుఁ! . ఏదైనా.. సినిమాకి. ."

సరయు ముఖం సీరియస్‌గా అయిపోయింది.

"సారి మిస్టర్ మాధవ్! .. నేనివాళ రాలేను. కాస్త పనుంది ఇంట్లో!" అంది

ఆమె మొహం చూసిన మాధవ్ మరి తర్కించ లేదు ఇద్దరూ మౌనంగా బైట కొచ్చి కారెక్కారు

"సెంటర్లో కాస్త పనుంది అక్కడ ఆపెయ్యండి! పని చూసుకుని నేను వెళ్ళిపోతాను!" అంది సరయు

"ఎందుకు మీ ఇంటి దగ్గర డ్రాప్ చేస్తానుగా?

"ఒద్దండి!

"సరే.... మీ ఇష్టం!' అన్నాడు తను చిన్నగా నవ్వేస్తూ కొంత దూరం వెళ్ళాక సరయు ఆపమంది. కారు ఆగగానే దిగేసి-

"థాంక్స్ మిస్టర్ మాధవ్!" అంది రెండు చేతులూ జోడించి

"ఫరవాలేదు. మళ్ళి మనం ఎప్పుడు కలవడం?' ఆమె కేసి చూస్తూ అన్నాడు మాధవ్

"అంటే?" చురుగ్గా చూసింది సరయు.

'అమ్మో! మీకు కోపం వచ్చేసినట్టుంది ఇంక ఇక్కడుండడం క్షేమం కాదు!" భయం నటించాడతను

"మీరు భలే మాట్లాడుతారు మాధవ్!" నవ్వేసింది సరయు

"అవునండి! నేనెప్పుడూ అంతే!" అమాయకంగా అన్నాడు తను. సరయు మళ్ళి నవ్వింది

అతనూ నవ్వాడు.

"త్వరలో కలుద్దాం! బై! చెయ్యి వూపుతూ అంది సరయు - అతనూ చెయ్యి వూపాడు

మరుక్షణం కారు రివ్వున దూసుకు పోయింది

"చిత్రమైన వ్యక్తి!" నవ్వుకుంది సరయు.

ఇంటి కొస్తూనే రమణి పోర్షన్ కేసి చూసింది అది తాళం వేసుండడంతో తేలిగ్గా వూపిరి తీసుకుంది. తను బైట కెళ్ళినట్టు అతనికి తెలియడం ఆమెకి ఇష్టం లేదు. అందుకే కొంత దూరంలో కారు ఆపించి ఇలా వచ్చేసింది.

"తను ఆహ్వానిస్తే నిరాకరించిన వ్యక్తి మరొకతనితో, అది అంతగా పరిచయంలేని యువకుడితో హోటల్ కెళ్ళి కాఫీ టిఫిన్ తీసుకుందని రమణికి తెలిస్తే? అమ్మో!" అప్రయత్నంగా ఆమె చెయ్యి గుండెల మీది కెళ్ళింది

ఏది ఏమైనా మాధవ్.. మంచి వ్యక్తి! సరదా గలవాడు ఏడుస్తున్న వాళ్ళనైనా నవ్వించగల సమర్థుడు! . అందుకే ముంగిలా వుండే తను అతని ఎదుట పకపక నవ్వింది! .

నయం!... మమ్మల్నిద్దర్ని ఆ రమణి చూడలేదు.... చూస్తే మరింత బాధపడేవాడు!" అనుకుని తృప్తి పడింది.

అయితే మాధవ్ కార్లోంచి తను దిగడం, ఇద్దరూ నవ్వుకుంటూ వీడ్కోలు తీసుకోవటం ఓ షాపులో వున్న రమణి కంట పడిందని మాత్రం సరయుకి తెలియదు!

(ఇంకాఉంది)

● ● ● ● ● ● ఇద్దరూ ఉద్యోగసులైతే! ● ● ● ● ●

# కష్టపడటంలోనే సుఖముంది!


శ్రీ గుండారపు వెంకటేశ్వర్లు, శ్రీమతి దుర్గ

గుండారపు వెంకటేశ్వర్లు తోట్ల వల్లూరు మండలాఫీసులో అటెండర్‌గా పని చేస్తున్నాడు ఏడొందలు సంపాదిస్తున్నాడు

'మాది రజక కులం కుల వృత్తిని గౌరవిస్తాం నేను మొదటి నుండి ఉద్యోగం చేయడం వల్ల కుల వృత్తి చేయడానికి కుదర లేదు నా భార్య దుర్గ మాత్రం మా కుల వృత్తిని చేస్తోంది ఐదారిళ్ళల్లో బట్టలు ఉతికి నెలకు రెండు వందలు సంపాదిస్తోంది' అనే వెంకటేశ్వర్లు వారంలో రెండు రోజులు మాత్రం విజయవాడ వచ్చి పోతూ ఉంటాడు

'మా ఆయన ఎంత గవర్నమెంటు ఉద్యోగం వెలగబెడుతున్నా నేను మాత్రం నా కుల వృత్తికే ఎక్కువ ప్రాధాన్యత నిస్తాను ఈ వృత్తి చేస్తూ ఇద్దరు ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు చేశాము మిగతా పిల్లల్ని చదివిస్తున్నాము పిల్లలు ఎంత చదువుకుని పెద్ద వుద్యోగాలు చేసినా మా వృత్తిని మర్చి పోకుండా చూసుకుంటాము అన్నది గుండారపు దుర్గ

"నా భార్య కష్టపడుతుంటే చూడలేను అందుకే నేనూ, నా పిల్లలూ మా ఆవిడకు సహాయం చేస్తూనే ఉంటాము అందువల్లనే నాలుగు రాళ్ళు మేము 'సంపాదించే దాన్లోనే వెనకేసుకో గలుగు తున్నాము' 'అన్నాడు వెంకటేశ్వర్లు

"అందరి బట్టల మురికిని వదిలించి మల్లె పువ్వుల్లాగా మార్చి ఇస్తున్న మేము మాత్రం మురికి వాడల్లోనే కొట్టుకు ఛస్తున్నాం. పేదోళ్ళకు పట్టా లిస్తున్నా మంటున్న ప్రభుత్వం మా బాధలు గుర్తించ లేదను కుంటున్నాము కేవలం బట్టల మురికిని వదిలించ గలంగాని, మనుషులకు పట్టిన మురికిని, మనసులకు పట్టిన మురికిని, ప్రభుత్వంలో ఉన్న మురికిని వదిలించడానికి మా వల్ల కావడం లేదు ' అని వాపోయింది దుర్గ

నేను ఇక్కడకు బదిలీ చేయించుకోవాలని ప్రయత్నం చేస్తున్నాను వారం రోజులు ఇంటిని, పెళ్ళాం పిల్లల్ని వదిలి తోట్ల వల్లూరులో ఉండటం కష్టంగా ఉంది ఆఫీసులోనే పడుకోవడం హోటలు మెతుకులు తినడం విసుగు పుడుతోంది అంటాడు వెంకటేశ్వర్లు

పూర్వం రోజులలో మాతో అవసరం ప్రతి ఇంటికి ఉండేది. కాలం మారుతున్న కొద్దీ మిషన్లు వచ్చి మా కడుపు కొడుతున్నాయి కేవలం మనిషి చనిపోయినప్పుడు మాత్రం మా అవసరం తప్పదు అందుకనే చాలా మంది కుల వృత్తి మానుకుని ఉద్యోగాల వేటలో పడిపోతున్నారు

కేవలం రజక కులం వారే చేయవలసిన పనులను చాలా మంది ఇతర కులాల వారు కూడా చేసేస్తూ. డ్రై వాషింగులని, పెట్రోలు వాషింగులనీ మమ్మల్ని వాష్ చేసేస్తున్నారు ఇలాంటి పరిస్థితులలో మా జీవనోపాధి కోసం ఏదో ఒక పని చెయ్యాలి కదా ' అందుకే నేను ఉద్యోగంలో చేరాను నా భార్య మా కుల వృత్తి చేస్తోంది. వేణ్ణీళ్ళకు చన్నీళ్ళులా మా సంపాదన మా కుటుంబానికి సరిపోతోంది కష్టపడటంలోనే సుఖ ముందని మా ఉద్దేశం"

వెంకటేశ్వర్లు మాటలు అక్షరాలా నిజం'

— కృష్ణాజీ

# శాపాద్దం

శ్రీమతి న్యాయపతి కమలారాణి

అర్ధ రాత్రి వీధిలో రిక్షా ఆగిన చప్పుడుకి తల్లీ కూతుళ్ళిద్దరూ ఆతృతగా కిటికీలోంచి చూసేరు. రిక్షా దిగి తూలుతూ నడిచి వస్తున్న వ్యక్తిని పోల్చి గబ గబా తలుపు తీసి మెట్లు దిగి యిద్దరూ చెరొక వైపూ సాయం పట్టి లోపలికి తీసుకువచ్చేరు.

భారతికి లోలోపల భయంగా వుంది, ఇరుగు - పొరుగు ఎవరైనా చూస్తున్నారేమోనని. అంతటా నిశ్శబ్దంగా వుంది. అందరిళ్ళల్లో అప్పటికే లైట్లార్పేసి వున్నాయి. ఎవరూ చూడ్డం లేదని గమనించి తేలిగ్గా వూపిరి పీల్చుకుంది.

అన్నపూర్ణకి దుఃఖం ముంచుకొస్తోంది.

"ఏమిటండీ యిది?" అంది ఏడుపు గొంతుకతో.

"ఎప్పుడూ వున్నదేగా అమ్మా!" అంది భారతి నిర్లిప్తంగా.

మంచం మీద అస్తవ్యస్తంగా పడుకున్న రామలింగంని "ఏవండి. భోంచేస్తారా?" అని ఆవిడ అడగలేదు.

"నాన్నా. భోంచెయ్యండి." అని భారతి కూడా అనలేదు.

ఇద్దరికీ తెల్సు అతనలా తాగొచ్చేక చచ్చినా భోంచెయ్యడని!

లోలోపల దుఃఖిస్తున్న తల్లిని ఎలా ఓదార్చాలో తెలియక ఒకసారి ఆమె వైపు జాలిగా చూసి, తర్వాత తన జాగాలో కొచ్చి పడుకుంది. పడుకుందన్న మాటేగాని, నిద్ర రాక ఆమె కళ్ళు మంటపెడుతున్నాయి. ఆలోచనలు కుమ్మరి పురుగుల్లా మనసుని దొలిచేస్తున్నాయి.

నాన్న ఎందుకిలా తయారయ్యేడు? అమ్మ నిజంగా చాలా మంచిది. ఎప్పుడూ ఎదురు జవాబు చెప్పి ఎరగదు.'ఇది లేదు అది లేదు! అని సాధించదు. ఉన్నదాంట్లోనే కృప్తంగా గడుపుకొస్తుంది! అయినా యిలాంటి పాడు వ్యసనం నించే నాన్నకి వున్న వుద్యోగం కూడా వూడింది. వూర్నిండా అప్పులు! ఎక్కడా తలెత్తుకోలేక ... ఎవరు? నాన్నకేం. హాయిగా తలెత్తుకు తిరుగుతున్నాడు. "షేమ్ లెస్ ప్యీపుల్ ఆర్ ఆల్వేజ్ హేపీ!" మధ్యన తను ... అమ్మ ... తలెత్తుకోలేక, ఎవరింటికి వెళ్ళలేక, సిగ్గుతో చితికిపోతున్నారు! ఇంత వయసు వస్తే మాత్రం ఏం లాభం? బుద్ధి, జ్ఞానం లేకపోయేక! ...

ఆమె మనసంతా దిగులుతో నిండిపోయింది. పోనీ తనకైనా వుద్యోగం వస్తే బాగుణ్ను. తను బి. ఎ. పాసు అయింది. మొన్ననే యింటర్వ్యూకెళ్ళి వచ్చింది. ఇంటర్వ్యూ బాగానే చేసింది. ఈ వుద్యోగమైనా తనకొస్తే బాగుండును. తల్లిని, చెల్లెళ్ళని, తమ్ముళ్ళని ఆదుకోవచ్చు. బాధ్యత మొయ్యాల్సిన తండ్రి బుద్ధి తక్కువగా ప్రవర్తిస్తూ బరువు దించుకోవాలని చూస్తున్నాడు. తన అర్థంలేని తాగుడుకి, బాధ్యతల బరువుకి అనవసరంగా ముడి వేసి, "ఈ బాధల్ని మర్చిపోవడానికే తాగుతున్నా"నని సమర్థించుకుంటున్నాడు. ఇంకా గట్టిగా అడిగితే పెద్ద పెద్ద కేకలు వేసి, ఇంట్లో అందర్నీ తన్నినంత పని చేసి ఆఖరికి, "నేను ఏమి చేతగాని వాణ్ని. చేత కానివాణ్ని. ఇంత విషం యిచ్చెయ్యండి. చచ్చిపోతాను. నా పీడ విరగడయి పోతుంది" అని భోరున ఏడుస్తాడు. ఛీ. అసలు మగాడు అలా ఏడవడం చూస్తే పరమ అసహ్యం వేస్తుంది!

దిగులుతో శుష్కించిన శరీరం, పీక్కుపోయిన దవడలు, లోతుకు పోయిన కళ్ళు, ఆలోచనల్ని తాత్కాలికంగా దూరం చేసుకుని నిద్రలోకి జారుకున్న అమ్మని చూస్తే కడుపు తరుక్కుపోయింది భారతికి.

ఈ సమాజంలో ఎంతమంది తల్లులు యిలాంటి మూగ వేదన అనుభవిస్తున్నారు? ఎంతమంది అబలలు ఎవ్వరికీ వినపడని అరణ్య రోదనలు చేస్తున్నారు?... ఆలోచనలతో తలంతా బరువెక్కి తల నొప్పి మొదలయింది. అప్పుడు ఆమెకి వూహాలోకం కళ్ళ ముందు కదిలింది. ఆ లోకం ఎంత అందంగా వుంటుంది! (అది వూహాలోకం కాబట్టి) ...

అనురాగం అందించే భర్త, ముత్యాల్లాంటి పిల్లలు, స్వర్గాన్ని మరపింపజేసే సంసారం ... ఇవన్నీ ఆమె వూహల్లో ఎప్పుడూ మెదుల్తూ వుంటాయి. అవి వూహలని, వూహలు వాస్తవానికి చాలా చాలా దూరంగా వుంటాయని, మధ్య తరగతి కుటుంబంలో ఒక చేతకాని తండ్రికి, అభం - శుభం తెలియని తల్లికి పుట్టిన ఆమెకి బాగా తెల్సు. అన్నీ తెల్సినా ఆమె ఆ అందమైన వూహల్ని మనసారా ఆహ్వానిస్తుంది. ముఖ్యంగా మనసు పాడయి పోయినప్పుడు బలవంతంగా ఆ వూహల్ని ఆహ్వానించి వాటిలో మునిగి తేలుతూ తన్నుతాను మర్చిపోతుంది. అందమైన వూహలు ఆమె మనసుకి ప్రశాంతత చేకూరుస్తాయి. అలా రోజు కొక్కసారయినా వూహల్లో తేలిపోతూంటే గాని ఆమె మనసు తేలికపడదు. మనసుకి ఎంతో తృప్తిని, వుల్లాసాన్నీ కలుగజేసే ఆ వూహలంటే ఆమెకి చాలా యిష్టం. అవి వాస్తవానికి దూరంగా వుంటే వుండుగాక! ఒక దివ్య ఔషధంలా పని చేసి మనసుని సంతోషపర్చే శక్తి వాటికి వున్నప్పుడు వాటిని తనెందుకు వదులుకోవాలి?! ...

తేలికయిన మనసుతో ఆమె మెల్లిగా నిద్రలోకి జారుకుంది.

* * * * *

అన్నపూర్ణ వంటింట్లో పూజ చేస్తున్నది. పెరట్లో నూతి దగ్గర భారతి అంట్లు తోముతున్నది. రామలింగం పెరట్లోకి వచ్చేడు. కూతురిని చూడగానే ఆ విషయం జ్ఞాపకం వచ్చి అతని ముఖం సంతోషంతో వెడల్పయింది. దగ్గరగా వచ్చి యిటూ-అటూ చూసి ఎవ్వరూ లేరని నిర్ధారించుకుని

'భారతీ!' అని పిల్చేడు.

తలెత్తి చూసింది భారతి. రాత్రి అలా తాగొచ్చినందుకు బాధపడుతున్న సూచనలేవీ ఆ ముఖంలో కనబడ్డం లేదు. చిన్నగా నిట్టూర్చింది.

"ఏమిటి నాన్నా?"

అబ్బె. ఏం లేదూ. మొన్న నువ్వు ఇంటర్వ్యూకెళ్ళేవు చూసేవా అతను నాకు తెల్సినవాడేలే. నిన్న నేనతన్ని కలిసేను. అవునూ. యింతకీ నువ్వు యింటర్వ్యూ ఎలా చేసేవమ్మా?"

ఇంటర్వ్యూ చేసిన తను నాన్నకి తెల్సు అనేసరికి ఆమె ఆశలకి కొత్త వూపిరి వచ్చింది.

"బాగానే చేసేను నాన్నా!" అంది సంభ్రమంగా.

"ఏం లేదు. నేను వెళ్ళి నీ సంగతి చెప్పేననుకో. అతను నిన్ను రమ్మన్నాడు. నువ్వు కూడా ఓ మాటు అతన్ని కల్సుకో. ఎందుకైనా మంచిది."

"నే నొక్కర్తినే ఎలా వెళ్ళను నాన్నా? మీరూ రండి."

"అబ్బె. నేనెందుకు? ఈ రోజుల్లో ఆడపిల్లలు ఒక్కళ్ళు వెళ్ళి అడిగితేనే సులభంగా వుద్యోగాలు దొరుకుతాయి!"

"అంటే?!" గిన్నెలు కడుగుతూ తండ్రి మాటల్లోని వ్యంగార్థాన్ని గమనించి అతని కళ్ళల్లోకి సూటిగా చూసింది.

అతను నిటారుగా అయ్యేడు. కొంచెం కోపం వచ్చింది.

"ఏమిటే వెధవ సందేహాలూ, నువ్వూనూ! ఈ రోజుల్లో వుద్యోగం దొరకడం మాటలను కున్నావా? కాళ్ళు- వేళ్ళు పడితేగాని వుద్యోగాలు రావు. లంచం యిచ్చుకునే స్థితిలో మనం లేనప్పుడు స్వయంగా ప్రాధేయపడకపోతే ఉద్యోగం నీ కాళ్ళ దగ్గరకి వచ్చేస్తుందను కున్నావా?" ధుమ ధుమ లాడ్డం మొదలెట్టాడు.

భారతికి తండ్రి మాటల అర్థం చూచాయిగా తెల్సింది. గుండెలు దడ దడ లాడేయి. అయినా వుద్యోగం దొరకడం ఎంతో కష్టం అని తెల్సిన ఈ పెద్దమనిషి మరి తన వుద్యోగం ఎందుకు చేజేతులా పోగొట్టు కున్నాడో?!

"వేసిన ఎరువులు ఎంత కంపు కొట్టినా పూచే పువ్వులు అందంగా వుంటే చాలు. అందమైన పువ్వులు చూసి సంతోషపడ్తారే తప్ప వాటికి ఎలాంటి ఎరువు వేసేరో ఎవరూ సాధారణంగా అడగరు!" అనేసి అక్కణ్నుంచి విసవిసా వెళ్ళి పోయేడు రామలింగం.

ఆమె కిప్పుడు పూర్తిగా అర్థమయి పోయింది.

తల్లి దేవుడి గదిలో వుంది. కాబట్టి సరిపోయింది. లేకపోతే ఈ పాటికి ఎంతో రాద్ధాంతం అయిపోను.

కాని.... కాని.... ఇప్పు డేమిటి చెయ్యడం? ప్రస్తుత పరిస్థితుల్లో తనకి వుద్యోగం చాలా అవసరం. వుద్యోగం కోసం తండ్రి చెప్పినట్టు చెయ్యడమే మంచి పనా! అసలు అక్కడికి వెళ్ళక పోతేనో! వెళ్ళకపోతే వుద్యోగం ఎలా వస్తుంది?



వుద్యోగం కావాలి. ఎలా? ఈ సమస్యని ఎలా పరిష్కరించుకోవడం?

తనలాంటి ఆడపిల్లలకి వుద్యోగం ఒక సమస్య. కట్నం ఒక సమస్య. పెళ్ళి ఒక సమస్య. కాపురం ఒక సమస్య. అసలు జీవితమే పెద్ద సమస్య!

ఆ ఆఫీసర్ని తల్చుకుంటేనే వళ్ళు గగుర్పొడుస్తోంది. అతను తనని రమ్మన్నాడా? ఈ మగాడి దృష్టిలో ఆడది ఎంత లోకువ అయిపోయింది! అతగాడి పని పట్టాలి. అక్కడికి వెళ్ళి అతని అంతు తేల్చెయ్యాలి. ఒకవేళ తనకి వుద్యోగం రాకపోయినా ఫర్వాలేదు. కాని వాడు "అమ్మ బాబోయ్, ఛస్తే మరెప్పుడూ ఏ ఆడపిల్ల జోలికీ పోకూడదు." అని లెంప లేసుకునేలా చెయ్యాలి. చెక్కు చెదరని ఆత్మ విశ్వాసాన్ని, తగినంత సమయస్ఫూర్తిని యిమ్మని భగవంతుణ్ని మనసులోనే వేడుకుంది.

ఒక దృఢాభిప్రాయాని కొచ్చిన దాన్లా ఆమె లేచింది.

మారుతున్న ఈ సమాజంలో తనలాంటి ఆడపిల్లలకి యిలాంటివి అసలు సమస్యలే కావు అన్నట్టు చెయ్యాలి. ప్రతీ ఆడపిల్లా ధైర్యంగా ముందడుగు వెయ్యాలి. కుందేలు పిల్లలా కాకుండా సివంగి పిల్లలా ముందు కురకాలి.

స్నేహితురాలి దగ్గరకి వెళ్తొస్తానని తల్లితో చెప్పి బయలు దేరింది. తండ్రి యిచ్చిన అడ్రసు కాగితం హేండ్‌బేగ్‌లో వేసుకుంది. దాంతో పాటు కారం పొడి పొట్లం, ఒక బ్లేడు, రెండు పెద్ద సూదులు కూడా బేగ్‌లో వేసుకుంది. యుద్ధాని కెళ్తున్న సైనికుడిలా వుంది ఆమె మనఃస్థితి. ఎలాంటిదైనా ఫేసు చెయ్యడానికి సిద్ధపడే వెళ్తోంది. దేవుడి మీద నమ్మకముంది తనకి. తను ఓటమిని ఎంత మాత్రం అంగీకరించదు!

* * * *

బజ్జర్ నొక్కింది. ప్యూన్ తలుపు తీసేడు.

"ఆఫీసరుగారు మేడమీద వున్నారు. వెళ్ళండి." అన్నాడు ఎగాదిగా చూస్తూ. ధైర్యం - భయం చిత్రంగా యుద్ధం చేస్తున్నాయి ఆమె మనసులో. ఒక్కొక్క మెట్టే ఎక్కుతున్న భారతికి తన గుండె చప్పుడు తనకే గట్టిగా వినిపిస్తోందేమోనని పించింది.

"రా! కూర్చో." అతని ముఖం ప్రశాంతంగా వుంది.

పులికి ఆహారం అవబోతున్న మేకపిల్లలా వుంది ఆమె పరిస్థితి.

"నీ పేరు..... భారతి కదూ. నువ్వు.... రామలింగం గారి అమ్మాయివేనా?" ఆమెనే గుచ్చి చూస్తూ అడిగేడు రాజశేఖరం.

అవునన్నట్టు నెమ్మదిగా తలూపింది భారతి. ఎంత ధైర్యం తెచ్చుకుందా మనుకున్నా అదేమిటో ఆమె గుండె దడదడ లాడుతోంది. పెదవులు సన్నగా వణుకు తున్నాయి. వళ్ళంతా చిరు చెమట్లు పట్టేయి. పైన సీలింగుఫాను తిరుగుతున్నా వుక్క పోస్తున్నది.

రాజశేఖరం ఆమె ముఖంలోకి తదేకంగా చూడసాగేడు. భారతి అతన్ని చూడ్డం లేదు. కొద్దిగా తలవంచుకుని కూర్చుంది. అతన్ని మాటల్తో ఎలా కడిగెయ్యాలో, ఈ దెబ్బతో అతనిలాంటి వాళ్ళు మరెప్పుడూ ఏ ఆడపిల్ల జోలికి పోకుండా బాగా బుద్ధి చెప్పడానికి ఎలాంటి

# భూతద్దం

ధైలాగులు వుపయోగించాలో ఆలోచిస్తోంది. ఆమె కళ్ల ముందు వుద్యోగం కోసం వచ్చిన ఆడపిల్లల శీలాన్ని అపహరించిన ఎంతో మంది ఆఫీసర్ల వుదంతాలు కదులుతున్నాయి.. ఆమె చెవుల్లో, వుద్యోగం అనే ఆధారం కోసం ఈ ద్విపాద పశువుల కామతృష్ణకి బలైపోతూ, చావలేక, బ్రతకలేక, ఛస్తూ- బ్రతుకుతున్న ఎంతో మంది అబలల ఆర్తనాదాలు మార్మోగు తున్నాయి. అతనిని చూస్తుంటే వళ్లు మండి పోతోంది భారతికి. పైకి ఎంత నెమ్మదిగా వున్నాడు! ఏం ఎరగనట్టు ఆ మొహం వాడూనూ. పైకి ఏం ఎరగనట్టుండే వాళ్లే కొంపలు కూల్చే రకాలు!ఇతగాడు నన్ను రమ్మన్నాడా? లేకపోతే.... తన తండ్రే ఒకవేళ యితనికి "కీ" యిచ్చేడా? ఏమో! తన తండ్రి కూడా యిలాంటి సుగుణాకర చక్రవర్తే! ఏం ఎరగనట్టు కాగితాల్లో తల దూర్చి ఏదో, సరసర వ్రాసేసు కుంటున్న అతన్ని చూస్తుంటే ఆమెకి అరికాలి మంట నెత్తి కెక్కుతోంది. అయినా తమాయించుకుంటూ అంది.

"సార్! నా కెలాగైనా వుద్యోగం వచ్చేలా చూడండి సార్!"

అతను కుర్చీలో ఏ మాత్రం కదిలినా, లేచి తన దగ్గర కొచ్చేస్తాడేమోనని భయంతో ఆమె చిగురుటాకులా వణికి పోతోంది. ఎంతో ధైర్యంతో ఎదుర్కొందామని వచ్చింది. తీరా.... యిప్పుడిలా నీరు గారిపోతోంది. ఆమె మనసులోని ఆలోచనలు శరవేగంతో పరుగెడు తున్నాయి....

అతను లేచి తన దగ్గర కొస్తాడు. భుజం మీద చెయ్యి వేస్తాడు. తను వణికి పోతుంది. అదోలా నవ్వుతాడు. తను అసహ్యంగా చూస్తుంది. కౌగలించుకుని ముద్దు పెట్టు కుంటాడు. తను విదిలించి కొడుతుంది. అతను రెచ్చి పోతాడు. చరచరా ఆ వెనక గదిలోకి లాక్కెళ్లి పోయి.... తనని బలవంతంగా.... అబ్బ.... వూహించు కుంటుంటే విపరీతమైన భయం వేస్తున్నది. అంతా అయిపోయేక తను ఏడుస్తుంది. మొత్తు కుంటుంది!.... సడన్‌గా తన బ్యాగ్ జ్ఞాపకం వచ్చింది. నో. అలా జరగడానికి వీల్లేదు. అసలు అతను దగ్గరగా వచ్చి భుజం మీద చెయ్యంటూ వేస్తే తను వూరుకుంటుందా పిరికి పందలా. ఛ. నెవ్వర్. వెంటనే అతనికన్నబడకుండా మెరుపులా తన బ్యాగ్‌లోంచి రక్షణాయుధాల్ని తీసి అతని మీద ప్రయోగించదూ!ముందుగా ఏది ప్రయోగించాలి? ఏది? సూదులే సులభం. గట్టిగా గుచ్చెయ్యాలి. ఆపైన బ్లేడు. తర్వాత కారం... లేదు ముందే కారం కళ్లల్లో పోసెయ్యాలి. కాదు..... .....కాదు....

రాజశేఖరం కాలుస్తున్న సిగరెట్టుని ఏష్‌ట్రేలో పడేసి లేచేడు. భారతికి భయంతో రోమాలు నిక్క బొడుచు కున్నాయి. తనెంత పొరపాటు పని చేసింది! పులి బోనులో అడుగు పెట్టేక పులి "తినదు" అని అనుకోవడం ఎంత అవివేకం! తనసలు రాకపోవల్సింది....

అతని ప్రతీ చర్యని ఎక్సరే కళ్లతో గమనించడం మొదలెట్టింది. ముంగిస పాముని చూసినట్టు చూస్తున్నది. రాజశేఖరం బార్లా తీసివున్న తలుపుల్ని దగ్గరకు వేసి వచ్చేడు.

"మీ నాన్న.... నిన్ను.... పంపేడు కదూ...." హఠాత్తుగా అన్నాడు.

తెల్లబోతూ చూసింది భారతి.

"మీరు రమ్మన్నారట...." అంది.

"అలా అని మీ నాన్న చెప్పేడు నీతో. అవునా?"

అవునన్నట్టు తలూపింది.

"చూడు భారతీ! మీ నాన్న నాతో ఏం చెప్పేడో తెలుసా?"

చెవులు రిక్కించుకుని వింటున్నది భారతి.

"రేపు మా అమ్మాయిని మీ దగ్గరకు పంపిస్తాను. తన నుంచి మీక్కావల్సిన దేది తీసుకున్నా నా కభ్యంతరం లేదు. కాని మీరెలాగైనా తనకి వుద్యోగం యివ్వాలి." అన్నాడు నా చేతులు పట్టుకుని.

"ఓహ్!" చెవులు మూసుకుంది గట్టిగా.

"మా నాన్న.... మీకు ముందునించీ తెలుసా?"

"తెలీదు. మీ నాన్నలాంటి వాళ్లుంటారని కూడా అనుకోలేదు. వుద్యోగం కోసం కన్న కూతుర్ని "ఎర"గా వేద్దామనుకునే కుత్సిత స్వభావం గల మీ నాన్నలాంటి వాళ్లని చూడ్డం యిదే మొదటిసారి కూడా!"

దగ్గరగా వచ్చేడు రాజశేఖరం.

"భారతీ! నువ్వు ఎంత భయపడుతున్నావో నీ ముఖమే చెప్తున్నది. వచ్చిన దగ్గర్నుంచీ నిన్ను గమనిస్తున్నాను. నీ ముఖాన పట్టిన చెమట్లు, వణుకుతున్న చేతివేళ్లు, నీ భయాన్ని స్పష్టంగా ఋజువు చేస్తున్నాయి. వుద్యోగం యిస్తామని ఆశపెట్టి ఆడపిల్ల శీలాన్ని అపహరించే దౌర్భాగ్యులు ఈ సమాజంలో వున్నంత కాలం, నీ తండ్రి లాంటి చేతగానివాళ్లు, పరాన్నభుక్కులు కూడా ఈ సమాజంలో వుంటారు. నువ్వు భయపడ్డంలో అసహజం ఏమి లేదు.

కాని ఒక్క విషయం భారతీ! నేను.... అలాంటివాడ్ని కాను. టాలెంటుని బట్టి వుద్యోగార్హతని బట్టి వుద్యోగం యిస్తాను. నువ్వు భయపడకు. నిర్భయంగా- నిశ్చింతగా వుండు. నువ్వు యింటర్వ్యూ బాగా చేసేవు. ఈ వుద్యోగం నీకు యిస్తున్నాను. కాని ఒక్క మాట...." అతను ఆగేడు. భారతి వూపిరి బిగపట్టి వింటున్నది.

"మానసిక విలువల్ని పెంపొందించుకుని "మనిషి"గా బ్రతకమని కుత్సితంగా ఆలోచించ వద్దని మీ నాన్నతో నేను చెప్పేనని చెప్పు." గంభీరంగా అన్నాడు.

భారతికి కళ్లంట జలజలా నీళ్లు రాలేయి. ఏడుపుని ఆపుకోలేక పోయింది. ఆనందమో, విషాదమో తెలియని పరిస్థితి!!

అప్రయత్నంగా రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ అంది,

"సార్! మీరు దేవుడు సార్. నిజంగా దేవుడే!"

అతను చిన్నగా నవ్వేడు. ఆ చిరునవ్వుతో చల్లని కాంతులు విరజిమ్ము తున్నట్టుగా అగుపించింది ఆమె కళ్లకు.

"అంతమాటనకు భారతీ! నేను మనిషిని. నీతి తప్పని మనిషిని.... అంతే!" 






# సినిమా విశేషాలు




—జి.వి.జి.

## కృష్ణ, శ్రీదేవితో శ్రీ కృష్ణ ప్రసన్న పిక్చర్స్ చిత్రం

"ఆగస్టు 14-20, సెప్టెంబర్ 10-20, అక్టోబర్ 10-20- నవంబర్ 16-20, డిసెంబర్ 10-20 షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు బి. వి. ఎస్. ఎస్. ప్రసాద్. ఈయన "డ్రైవర్ బాబు" అనంతరం నిర్మించే చిత్రంలో కృష్ణ, శ్రీదేవి, సత్యనారాయణ, రావు గోపాలరావు, నూతన్ ప్రసాద్, గుమ్మడి, చరణ్‌రాజ్, అశ్విని, పుష్పలత, శ్యామల గౌరి, వై. విజయ పాత్రధారులు. పరుచూరి సోదరుల రచన, వెంకట్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, సలీం నృత్యాలు, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో కె. బాపయ్య దర్శకుడు.

## సౌభాగ్యలక్ష్మి క్రియేషన్స్ చిత్రం

"నిత్య జీవితంలో ఎదురయ్యే సంఘటనలు, పాత్రలతో ఆహ్లాదపరిచే చిత్రం. సెప్టెంబర్ నుంచి అక్టోబరు వరకు ఒకే షెడ్యూల్లో రాజమండ్రి, విశాఖపట్నం ప్రాంతాల్లో షూటింగ్ జరుగుతుంది. ఇంతవరకు కల్యాణ చక్రవర్తి, రమ్య, రాజేంద్ర ప్రసాద్‌లను నిర్ణయించాం" అన్నారు కెళ్ళ రామస్వామి. ఈయన నిర్మించే సౌభాగ్య లక్ష్మి క్రియేషన్స్ వారి చిత్రానికి మౌళి కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి, దర్శకత్వం వహిస్తారు. కె. వి. మహదేవన్ సంగీతం, పి. లక్ష్మణ్ ఛాయ, శివాల ప్రభాకర్ సంయుక్త దర్శకత్వం, శివ సుబ్రహ్మణ్యం నృత్యాలు, సాహుల్ సాహసాలు, గౌతంరాజు కూర్పుతో కె. రాంబాబు సహ నిర్మాత.

## వంశీ దర్శకత్వంలో జయకృష్ణా కంబైన్స్ రెండవ చిత్రం

"జూలై 5 నుంచి 20 వరకు మొదటి షెడ్యూల్ పూర్తి చేశాం. తదపరి షెడ్యూల్ ఆగస్టు 1 నుండి 15 వరకు" అన్నారు వంశీ. ఈయన దర్శకత్వంలో ఎం. జగన్మోహన్ సమర్పించే చిత్రంలో భానుచందర్, సుహాసిని, ప్రభాకరరెడ్డి, ఎ. ఎల్. నారాయణ, వేలు, ఎస్. వరలక్ష్మి, సంగీత, నవ నటుడు ప్రసాద్‌తో పాటు మరో నవ నటి పాల్గొంటున్నారు. ముళ్ళపూడి వెంకట రమణ కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చారు. తనికెళ్ళ భరణి మాటలు, సీతా రామ శాస్త్రి పాటలు, ఎస్. పి. బాల సుబ్రహ్మణ్యం సంగీతం, తోట యాదు శిల్పం, అనిల్ మల్నాడ్ కూర్పుతో కె. ప్రభాకరరావు సహ నిర్మాత. "పద్మ అనే డాన్స్ డైరెక్టర్‌ని, జి. వి. సుబ్బారావు అనే కెమెరామన్‌ను పరిచయం చేస్తున్నాం" అన్నారు నిర్మాత డి. ఎస్. ప్రసాద్.

## బి. విఠల ఆచార్య దర్శకత్వంలో "వీర ప్రతాప్"గా మోహన్‌బాబు

"మా అబ్బాయి విష్ణు, మనోజ్‌ల పేర్ల మీద నెలకొల్పిన వి. ఎం. ప్రొడక్షన్స్ బానర్‌లో తయారవుతూంది చిత్రం. "పద్మవ్యూహం" అనంతరం నే నీ చిత్రంలో మరో పాట పాడాను. విఠల ఆచార్యగారు చక్కని కథను సమకూర్చి, దర్శకత్వం వహించడానికి అంగీకరించడం నా భాగ్యం" అన్నారు మోహన్‌బాబు. ఈయనతో పాటు గిరిబాబు, కోట శ్రీనివాసరావు, రాళ్ళపల్లి, సారథి, వేలు, వీరభద్రరావు, ధూళిపాళ, మిక్కిలినేని, కె. కె. శర్మ, ఏచూరి, శ్రీరాజ్, నాగేష్‌బాబు, వీరమాచనేని, మోదుకూరి సత్యం, మిఠాయి చిట్టి, మాధవి, [illegible]యణ, శ్రీలక్ష్మి, దేవి, అనూరాధ, అన్నపూర్ణ, ఎంప్రిక, లక్ష్మిప్రియ, జె. వాణి నటిస్తున్నారు. కర్పూరపు ఆంజనేయులు సంభాషణలకర్త. ఆత్రేయ, గోపి గీతాలకు శంకర్-గణేష్ బాణీలు కూర్చారు. హెచ్. ఎస్. వేణు ఛాయ, కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం, సలీం నృత్యాలు, కనకసేన సహకార దర్శకత్వం, జూడో రత్నం సాహసాలు, కె. ఆంజనేయులు-జయకృష్ణారావు సంయుక్త దర్శకత్వం, రవి కూర్పుతో సీతా రామయ్య, కుప్పురాజ్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్. నిర్వహణ : ఎం. కృష్ణ, జి. పురుషోత్తం. నాలుగు షెడ్యూల్స్‌తో అక్టోబర్‌కి పూర్తయ్యే ఈ చిత్రానికి నిర్మలా మోహన్‌బాబు నిర్మాత.



"ఏం చూశావ్? స్త్రీల సమస్యల మీద సినిమా తీయగలిగినంత బుర్ర నాకు లేదా?"

## దాసరి దర్శకత్వంలో నాగార్జున నటించే తొలి చిత్రం "మజ్ను"

"నాగార్జున విజృంభించడానికి అనువైన పాత్ర. లక్ష్మికాంత్ ప్యారేలాల్ సంగీతం అదనపు ఆకర్షణ" అన్నారు దాసరి నారాయణరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం, నిర్మాణంలో దాసరి పద్మ సమర్పించే తారక ప్రభు వారి "మజ్ను" చిత్రంలో రజని, కె ఆర్. విజయ, అన్నపూర్ణ, శ్రీలక్ష్మి, సత్యనారాయణ, జగ్గయ్య, గొల్లపూడి మారుతీరావు, వేలు ప్రభృతి తారా సందోహం. శరత్ ఛాయా గ్రాహకుడు.

"కెప్టెన్ నాగార్జున్"లో కుష్బూ



రజని 'ఆడపడుచు'లో



# గెలవండి! రూ. 20,000/-ల విలువైన బహుమతులు!



# కలువబాల

## చందాదారులకు లక్కీడిప్: ఆగస్టు 1 నుండి నవంబరు 1 వరకు.

మొదటి బహుమతి
★ ఒక కలర్ టి.వి.

రెండవ బహుమతులు
★★ రెండు బ్లాక్ అండ్ వైట్ టి.వి.లు

మూడవ బహుమతులు
★★★ మూడు "కిచెన్ మెషిన్"లు (మిక్సర్‌లు)

నాలుగవ బహుమతులు
★★★★ నాలుగు "లేడీస్ రిస్ట్ వాచీ"లు

రు 60లు చందా కట్టగానే అందమైన 'కలువబాల' పత్రిక నెలకి రెండుసార్లు మీ యింటికి అందుతుంది అదిగాక మీరి క్రింది బహుమతులు గెలుచుకోవచ్చు "చిరుకానుక" తప్పకుండా అందరికీ వుంటుంది

మీరేం చెయ్యాలి? చేయవలసిందల్లా "కలువబాల"కు ఏడాది "చందాదారులుగా" చేరడమే! కాకపోతే మీ చందా సైకంతో పాటు యిక్కడ యిచ్చిన కూపన్ పూర్తి చేసి పంపాలి!

అంతేకాదు ఈ బహుమతి పథకంలో పాల్గొన్న చందాదారులందరికి కలువబాల నుంచి ఒక చిరుకానుక కాలక్రమంలో అందుతుంది

కలువబాల
నవ వనితా పక్షపత్రిక

# కలువబాల లక్కీడిప్ చందాదారులకు నిబంధనలు సూచనలు.

1 చందా పైకము రు 60లు మనియార్డరు ద్వారా గాని డిమాండు డ్రాఫ్టు ద్వారా గాని పంపవచ్చును

2 ఎమ్ ఒ లు పంపేవారు వారి కూపన్‌తో పాటు ఎమ్ ఒ పంపిన తేదీ తెలుపుతూ దాని రశీదు జతచేసి మరీ కూపన్ పంపాలి లేదా డి డి ని కూపన్‌తో జతచేయాలి

3 చందా భారత దేశంలో వున్న వారెవరైనా కట్టవచ్చును

4 చందా పైకము నేరుగా విజయవాడ, ఆంధ్రపత్రిక కార్యాలయంలో కూడా కట్టవచ్చును

5 ఎమ్.ఒ లు. డి డి లు వ్యక్తుల పేర పంపించకూడదు

6 కూపన్‌లు రిజిష్టర్డు పోస్టులో పంపరాదు. లక్కీడిప్ గడువు పూర్తి అయిన తర్వాత యిందులో పాల్గొన్న చందాదారులకు చీట్లు తీసి, పైన తెలిపిన బహుమతులను ప్రకటించుతాము. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు

7 కూపన్‌మీద, మనియార్డరు కూపన్ మీదా కూడా పంపేవారి పేరు చిరునామా స్పష్టంగా పూర్తిగా వ్రాయాలి వారు ఇదివరకే చందాదారులైతే కూడా. వారి స్నేహితులెవరికైనా "కలువబాల' చందాను బహుమతిగా కట్టవచ్చును



నిజమయితే ✓
కాక పోతే X
అని గుర్తు పెట్టాలి

ఆంధ్రపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వుండేది ( )

దినపత్రిక కన్నా వారపత్రిక ముందే పుట్టింది ( )

భారతి" సాహితీప్రియుల పక్ష పత్రిక ( )

బాలరంజని పిల్లల పత్రిక ఆంధ్రపత్రిక ప్రచురణ ( )

కలువబాల చందాదారుల 'లక్కీడిప్' చందా కట్టిన వారి పూర్తి పేరు ...............................................

చిరునామా ...............................................

...............................................

...............................................

ఎమ్ ఒ పంపిన తేదీ ...............................................
లేదా
డి డి జత చేయడమైనది

8. "లక్కీడిప్" 1-11-1986 లేదా ఆ లోపల కట్టే చందాలకి మాత్రమే వర్తిస్తుంది.
కూపన్‌లు, చందాలు పంపవలసిన చిరునామా:
కలువబాల, కేరాఫ్; ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3కి పంపాలి.

9 ఈ పథకంలో పాల్గొనే వారికి స్థానిక ఏజెంట్ ద్వారా పత్రిక సప్లయి చేస్తాము.

గమనిక: ఏజెంట్ లేనిచోట పోస్టులో పంపిస్తాము.

0 ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ లక్కీ డిప్‌లో పాల్గొనరాదు



"దొరబిడ్డ"లో అశ్వని, రాజశేఖర్

# సినిమా

## "ఈ ప్రశ్నకు బదు లేది?"

"తన భర్త తన ద్వారా సుఖపడతం లేదని తెలిసిన ఒక భార్య, అతనికి మరో యువతితో మళ్ళీ పెళ్ళి చేయిస్తుంది. దాంతో ఉత్పన్నమయ్యే సమస్యలు ప్రాతిపదికగా అల్లబడిన రసవత్తరమైన కథ. జూన్ 5 నుంచి జూలై 5 వరకు హైదరాబాద్‌లో ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తి చేశాం" అన్నారు కె. రాఘవ. ఈయన నిర్మించిన ఫై చిత్రంలో జయచిత్ర, డాక్టర్ రాజశేఖర్, అరుణ, పూర్ణిమ, ప్రసాద్, వెంకట్, గౌతమ్, నవ బాల తారలు బేబీ ప్రతిమ, మాస్టర్ సందీప్ వాకర్, కొందరు స్థానిక కళాకారులు నటించారు. ఊడిగుంట రామచంద్రమూర్తి మాటలు, సి. నారాయణరెడ్డి పాటలు, సుభాష్ - గోపి సంగీతం, కృష్ణమూర్తి శిల్పం, నాగరాజ్ ఛాయ, కె. శేషగిరిరావు - ఉమాకాంత్ ప్రొడక్షన్, వివేకవర్ధన్ సహకార దర్శకత్వం, టి. కృష్ణ కూర్పుతో కె. ఆదిత్య కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

"ఆనంద తాండవం"లో మోహన్, దీప



## కమలాకర కామేశ్వరరావు దర్శకత్వంలో "సైసైరా చిన్నపరెడ్డి"

"స్వాతంత్ర్య సమర యోధుడు, విప్లవ వీరుడు చిన్నపరెడ్డి పాత్రకు అపూర్వంగా ప్రాణ ప్రతిష్ఠ చేస్తున్నారు ప్రముఖ రాజకీయవేత్త, యువతరానికి ప్రతినిధి అయిన చల్లా రామకృష్ణారెడ్డి. నరసారావుపేట దగ్గరున్న



"సత్యాగ్రహం"లో సరిత

కోటప్పకొండ ఆలయంలో, చేబ్రోలులో జూన్ 16 నుంచి జూలై 5 వరకు మొదటి షెడ్యూల్ జరిపాం" అన్నారు కమలాకర కామేశ్వరరావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి. ఈశ్వరరెడ్డి, బి. సుందరరెడ్డి నిర్మిస్తున్న కొండవీటి కంబైన్స్ వారి ఫై చిత్రంలో అశ్వని, రావు గోపాలరావు, జగ్గయ్య, మిక్కిలినేని, రాళ్ళపల్లి, పొట్టి ప్రసాద్, చందూఖాన్, నిర్మల, పి. ఆర్. వరలక్ష్మి, పండరీబాయి, రేఖ నటిస్తున్నారు. కాశీ విశ్వనాధ్ సంభాషణల కర్త, కె. వి. మహదేవన్ స్వరకల్పనలో శ్రీశ్రీ, సి. నారాయణరెడ్డి, వంగపండు గీతాలు రాశారు. ఆర్. రామారావు ఛాయ, బాబ్జీ శిల్పం, కత్తుల గోపాల కృష్ణ-మహేష్ కుమార్ సంయుక్త దర్శకత్వం, సాయి ప్రొడక్షన్, వై. నాగేందర్‌రెడ్డి నిర్వహణతో బి. కోటిరెడ్డి సహ నిర్మాత. □

సురేష్ ప్రొడక్షన్స్ (ప్రై) లిమిటెడ్



# కలియుగ పాండవులు

నిర్మాత డి. రామానాయుడు దర్శకత్వం కె. రాఘవేంద్రరావు B.A.,

# సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు



యం. ప్రసాదరావు, మక్కువ

పవిత్రత అనేది మనసుకు సంబంధించినదా? ఆచారాలకు సంబంధించినదా?

ఆచారాలనేవి మన పురాణ పురుషులు మనల్ని జాగ్రత్తగా వుంచడానికి వుంచిన కట్టుబాటులు. నిర్మలమైన మనస్సు వుంటే చాలు అక్కడే పవిత్రత వుంటుంది.

ఎ. ఎస్. కోటేశ్వరరావు, చినరావూరు

ఈ మానవ సమాజంలో సంసారి గొప్పా? సన్యాసి గొప్పా?

అందరూ సన్యసిస్తే మానవ సమాజమే లేదు కదా.

ఎ. వెంకటేశ్వరరావు, మంగళగిరి

సామాజిక ప్రగతి ప్రజల శాంతియుత సహ జీవనం మీద ఆధారపడి వుంటుందా? లేక సభ్యత సంస్కారం మీద ఆధారపడి వుంటుందంటారా?

సభ్యత ... సంస్కారంతో కూడిన ప్రజల శాంతియుత సహజీవనం మీద ఆధారపడి వుంటుందని అనుకుంటున్నాను.

ఎ. మురళీకృష్ణ, ఉలందకొండ

మీ అభిమానులు మద్రాసు వచ్చి మీ దగ్గరకొస్తే మీరు ఏం చేస్తారు?

నేను మద్రాసులో వుండగా వస్తే సాదరంగా ఆహ్వానిస్తాను. (మంచి - చెడు) నా పాత్రల మీద వారి అభిప్రాయాల్ని తెల్సుకుంటాను.

యల్. నాగమణి, చేబ్రోలు

'ప్రతిఘటన' సినిమాలో మీకు జరిగిన పరాభవం లాంటిదే నిజ జీవితంలో ఒక స్త్రీకి జరిగితే దానికి మీరు యిచ్చే సమాధానమేమిటి?

ఈనాటి మహిళలు చేతులు ముడుచుకొని కూర్చోలేదనే నా అభిప్రాయం. నిజంగా గనక అలాంటి సంఘటన జరిగితే ప్రతిఘటించమనే చెప్తాను. కాదు - ఆదేశిస్తాను.

## ఉత్తమ ప్రశ్న

పి. రాజశేఖర్, శ్రీకాకుళం

ఒక చిత్రం హిట్ అయిందంటే ఆ ప్రతిభ దర్శకునిదా? నటీనటులదా? లేక ప్రేక్షకులదా?

ఏదైనా సరే ఏ చిత్రమైనా సరే ప్రేక్షకులకు నచ్చిన చిత్రమే విజయాన్ని సాధిస్తుంది. అయితే ఆ విజయానికి వెనుక రధసారథి వంటి వాడు దర్శకుడు. దర్శకుడి ఆదేశానుసారం నటించి ప్రేక్షకుల్ని ఆకర్షించే వారే నటీనటులు. అయితే ఆ చిత్రం విజయం వెనుక ఎంతో మంది సాంకేతిక నిపుణుల సహకారం కూడా వుంటుంది.

ఎ. యల్. పద్మావతి, కొండముడి

ప్రేమికులైన యువతీ యువకులను ప్రతి తల్లి-తండ్రులు ఆశీర్వదించి పెళ్ళి చేయాలని నేను అంటాను. మీరేమంటారు?

మీ అభిప్రాయంతో ఏకీభవిస్తాను.

బి. ప్రసాద్, హైదరాబాద్

నేటి యువతరం వరకట్నాన్ని నిర్మూలించాలి అంటాను. మీరు ఏమంటారు.

మీ అభిప్రాయం చాలా చక్కనిది అంటాను. వెంటనే ఆచరణలో పెట్టమని చెబుతున్నాను.

జి. యస్. రాజ్, విజయవాడ

ఫోటోలలో మీ కనుపాపలు చూసినప్పుడల్లా - "ఈ దుర్యోధన, దుశ్శాసన దుర్వినీతి లోకంలో" అని చెవులు గింగురుమంటున్నాయి.

నాపై మీకున్న మీ అభిమానానికి కృతజ్ఞురాల్ని!

జి. రవీంద్రబాబు, ఒంగోలు

సినిమాలు ఎందుకు చూస్తాము? సినిమాలు చూడటం వల్ల లాభము ఏమిటి?

సరదాకోసం ... సంతోషం కోసం. పగలంతా కష్టపడ్డ మనసును 3 గంటలసేపు ఉల్లాసపర్చుకోవడం కోసం.

ఎన్. కుమార్ శ్రీనివాస్, నిడుబ్రోలు

ఈ సినిమారంగం గురించి రాబోయే వారికి మీరు చెప్పే సూచనలు ... సలహాలు ...?

రాబోయే వారికి చెప్పేంత దాన్ని మాత్రం కాదు.

యం. రామకృష్ణ, విజయనగరం

మీరు నటించే సినిమాలలో "కథకు" ప్రాధాన్యత యిస్తారా? లేకపోతే "పాత్రకు" ప్రాధాన్యత యిస్తారా?

మంచి కథతో కూడిన పాత్రను పండించడానికి నా శాయశక్తులా కృషి చేస్తాను. □

కూపన్

ఆంధ్రసచిత్ర వారపత్రిక

విజయశాంతి సమాధానాలు

ప్రశ్న : ______________________

______________________

పంపిన వారి పేరు : ______________________

పూర్తి చిరునామా : ______________________

వై.హరికృష్ణ సారధ్యంలో టి.కృష్ణ సమర్పించు

కృష్ణచిత్ర

SREE PUBS.

# అరుణ కిరణం



సి.డి.: వి.యం.సి.

దర్శకత్వం: ముత్యాల సుబ్బయ్య

నిర్మాత: వై.అనిల్‌బాబు

సంగీతం: చక్రవర్తి, కెమెరా: ఆర్.రామారావు, మాటలు: యం.వి.యస్.హరనాధరావు, కూర్పు: గౌతంరాజు.

గుంటూరు : వసుధ చిత్ర

# అభిమాన తారలపై అభిప్రాయం

ఈ మధ్యనే వచ్చిన "ప్రతిఘటన", "వందేమాతరం" చిత్రాలలో నటించిన రాజశేఖర్ నా అభిమాన నటుడు. "వందేమాతరం" చిత్రంలో పల్లె వాతావరణంలో ఒక స్కూలు మాస్టారుగా ఆయన నటన ప్రశంసనీయం. "వందేమాతరం" పాటను ఆయన పాడి, నటించారు. ఆ పాటలో ఆవేదన చాలా చక్కగా చూపారు. "ప్రతిఘటన" చిత్రంలో పాత్ర తక్కువగా ఉన్నా ఒక బాధ్యత గల పోలీస్



ఇన్‌స్పెక్టర్ పాత్రకు జీవం పోశారు. ఇక ముందు కూడా మంచి చిత్రాలలో నటించి కీర్తి శిఖరాలు అందుకోవాలని ఆశిస్తున్నాను.

—కె. యన్. పద్మావతి,
తిరువూరు

* * *

తన మొదటి చిత్రం "విక్రమ్"లో నవరసాలను పోషించిన "నాగార్జున అక్కినేని" నా అభిమాన నటుడు. తన సహజసిద్ధమైన నటనలో "విక్రమ్" పాత్రను గొప్పగా పోషించాడు. ఫైట్స్‌లో కొన్ని రిస్కు షాట్లను కూడా ఎంతో ధైర్యంగా చేశాడు. సన్నివేశాలకు తగిన హావభావాలను ఎంతో సునాయాసంగా చూపాడు.

ఉదాహరణకు ఆనందరావు ఇంటికి వచ్చినప్పుడు, ఆతను "విక్రమ్" తల్లి దండ్రులను కించపరిచే విధంగా మాట్లాడిన సన్నివేశంలో "నాగార్జున" స్పందించిన తీరు, ప్రియురాలు "రాధ" తనకు దక్కడం లేదన్న బాధతో మద్యం సేవించే



దృశ్యాలలో ఆయన నటించిన నటనను నేనెప్పటికీ మర్చిపోలేను. అంత చక్కగా, ఆయా సన్నివేశాలలో నటించారు.

మొదటి చిత్రంతోనే, నటుడుగా తన నట జీవితానికి ఒక అర్థాన్ని, లక్ష్యాన్ని, సార్థకతని కలిగించిన "నాగార్జున" భవిష్యత్తులో పెద్ద హీరో కావటం, కొత్త రికార్డులు సృష్టించడం తథ్యం. "నాగార్జున"కు నటుడుగా ఇది తొలి విజయం. రేపటి బంగారు భవిష్యత్తుకు ప్రథమసోపానం.

రానున్న "కెప్టెన్ నాగార్జున", "అరణ్యకాండ", "సంకీర్తన" మొదలగు చిత్రాలు విజయభేరి మ్రోగించాలని ఆయన అభిమానిగా కోరుకొంటున్నాను.

— కొటగడ్డ వెంకట్రావు,
కంకిపాడు

* * *

నేను అఖిలాంధ్ర ప్రేక్షకుల అభిమాన అందాల నటుడు, యువకిశోరం నందమూరి బాలకృష్ణ అభిమానిని. నాటి "బ్రహ్మంగారి జీవిత చరిత్ర" నుండి నేటి చిత్రాల వరకూ తనకంటూ ఒక ప్రత్యేక స్థానం ఏర్పరచుకొన్న క్రమశిక్షణా పరుడు మా బాలకృష్ణ.

తెలుగు సినీ జగత్తులో ఈ నందమూరి వంశం ప్రదర్శిస్తున్న అద్భుత నటన ప్రేక్షకుల హృదయాలకు పన్నీటి జల్లు లాంటిది. ఎటువంటి పాత్రనైనా అవలీలగా పోషించగల శక్తి సామర్థ్యాలు ఈతనికి వెన్నతో పెట్టిన విద్య లాంటిది. "ముద్దులక్రిష్ణయ్య", "సీతారామ కళ్యాణం" హిట్ చిత్రాలు. "మంగమ్మగారి మనుమడు" 570 రోజులు



ఆడి రికార్డు సృష్టించినది. ఈయన ప్రతిచిత్రంలో చూపే అసమాన నటనా వైదుష్యం మరవరానిది. మరచి పోనిది, మరువలేనిది. అభిమానుల పట్ల ఈయన చూపించే ఆదరాభిమానాలు అనంతం. ఆదర్శవంతమైన పాత్రలు, వాస్తవానికి దగ్గరగా వుండే సినిమాల్లో నటిస్తే బావుంటుంది మావాలయ్య. మా బాలకృష్ణ లాయర్‌గా ఒక చిత్రంలో నైనా చూడాలని నా కోరిక. ఆతనితో ముఖాముఖీగా ఇంటర్వ్యూ చేయాలని కూడా నా ఆకాంక్ష.

—పి. రేణుకాదేవి, ఎ. ఎస్. పేట,
ఆత్మకూరు (నెల్లూరు)

* * *

నా అభిమాన నటి పద్మశ్రీ భానుమతి. భానుమతి చిత్ర నిర్మాణంలో, దర్శకత్వంలో, రచనా వ్యాసంగంలో, నటనలో అన్నిటా బహుముఖ ప్రజ్ఞావంతురాలు. ఆవిడ దక్షిణ భారతదేశ చలన చిత్ర పరిశ్రమకు దేవుడు ప్రసాదించిన వరం అనడంలో అతిశయోక్తి లేదు. ఆవిడ నటించిన అన్ని తెలుగు చిత్రాలలో ఆవిడ పాటలు ఆవిడే పాడుకొన్న గానకోకిల. ఆవిడ గాత్రం అబాలగోపాలం వినాలని తపించే విధంగా ఉంటుందనడంలో సందేహం లేదు. ముద్దుల మనవరాలు, మనవడి కోసం, మల్లేశ్వరి, విప్రనారాయణ, మంగమ్మ గారి మనవడు మొదలైన చిత్రాలలో ఆవిడ నటన చూసి తీరవలసిందే తప్ప ఆవిడ నటనా చాతుర్యం వర్ణించవలవి కాదు. భానుమతీ రామకృష్ణ మెట్రిక్యులేషన్ సంస్థ స్థాపించి మద్రాసులోని తెలుగు పిల్లలకు మాతృ భాషలో విద్యా బోధన



జరగాలని తలచి, టరమ్ ఫీజ్, బిల్డింగ్ ఫీజు లాంటి బెడదలు లేకుండా పేదవిద్యార్థులకు ఉచిత విద్యను అందిస్తున్న విద్యాదాత, రెండుసార్లు డాక్టరేట్‌లు పొందిన చదువుల సరస్వతి.

ఆవిడ తెలుగు చలన చిత్ర పరిశ్రమకు చేసిన గణనీయమైన సేవలను గుర్తించి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం 1985 వ సంవత్సరవు "రఘుపతి వెంకయ్య" అవార్డును ఆమెకిచ్చి సత్కరించడం యావదాంధ్ర ప్రజలు గర్వించ తగ్గ విషయం.

—మరువాడ నాగరాజు,
నాగపూర్

* * *

డేరింగ్, డాషింగ్, డైనమిక్ హీరో "చిరంజీవి" గారు అంటే నాకు అభిమానం. నటనలో తనకు ఎవరూ పోటీ లేనట్లుగా "పున్నమినాగు" చిత్రంలో నటించి నిరూపించారు. ఇప్పటివరకూ విడుదల అయిన చిత్రాలలో అన్ని రకాల పాత్రలలో నటించి తన ప్రతిభ నిలుపుకొన్నారు. సినీ చరిత్రలో ఒక ప్రత్యేక స్థానాన్ని ఆక్రమించిన చిరంజీవి ఇంకా ఉన్నత



స్థానాన్ని చేరాలంటే శుభలేఖ, ఖైదీ, విజేత వంటి మంచి చిత్రంలలో నటించాలి.

ఒక అభిమానిగా నా సలహా: చిరంజీవి ఇమేజ్‌ని మరింత పెంచే సబ్జక్ట్ కల పాత్రలను ఎన్నిక చేసుకోమని. అలా చేస్తే నాలుగు కాలాల పాటు తెలుగు చలన చిత్ర పరిశ్రమలో చిరంజీవిగానే ఉంటారని నా ఉద్దేశ్యం.

— జి. జయశ్రీ, నాజరుపేట, తెనాలి □



సీరియల్

# జీవితం చేజారిందా?

కాకాని కమల

Rao—

(గత సంచిక తరువాయి)

కాలగర్భంలో మరో రెండు నెల్లు గిర్రుమని తిరిగాయి.

సీతకి పండులాంటి కొడుకు పుట్టాడు.

ముమ్మూర్తులా ప్రభాకర్ పోలికల్ని పుణికి పుచ్చుకుని పచ్చగా దబ్బ పండులా వుంగరాల జుత్తుతో వున్న కొడుకుని చూస్తుంటే - తొలకరి జల్లు కురిసిన భూమాతలా – మాతృ మమకారంతో సీత హృదయం పులకరించి పోయింది.

సీత వ్రాసిన ఉత్తరం అందుకున్న వెంటనే సుభద్రమ్మ పెట్టె - బేడ సర్దుకుని కూతురు దగ్గరకి వచ్చింది.

తల్లి వచ్చాక సీతకి చాలా విశ్రాంతి చిక్కింది.

దగ్గర్లో వున్న మెటర్నటి హాస్పటల్‌లో పురుడు పోసుకుందుకు ఏర్పాటు చేశాడు ప్రభాకర్.

సీత భయపడినట్లు ఏది జరగలేదు.

అంతా సవ్యంగా ప్రశాంతంగా గడిచి పోయింది.

విశ్వేశ్వరయ్య వచ్చి మనవడ్ని చూసి రెండు రోజులుండి వెళ్ళిపోయాడు.

మనవడికి నెల రాగానే సుభద్రమ్మ తిరుగు ప్రయాణం అయ్యింది.

ఇంటి దగ్గర పెళ్ళి కెదిగిన ఆడ పిల్లల్ని, గంపెడు సంసారాన్ని వదిలి అంతకంటె ఎక్కువ రోజులు వుండటం అంటే ఆవిడకి జరగని పని.

ఆ విషయాలన్నీ సీతకి తెలియనివి కాదు

అందుకే గట్టిగా తల్లిని వుండమనలేక పోయింది సీత.

సుభద్రమ్మ ఊరికి వెళ్ళే ముందు అల్లుడ్ని పలకరించింది.

..............

"ఒకసారి మా సీతని, మనవడ్ని పంపండి అల్లుడుగారూ! మీరు మళ్ళీ మా గుమ్మంలోకి రాలేదు. ఏదో పేదవాళ్ళం అనుకోండి ... " అంది కాస్త బాధగా.

"అబ్బె! అలాంటివేం మనసులో పెట్టుకోకండి..... నాకు కుదర్దు" అన్నాడు.

"పోనీ ఒకసారి మా అమ్మాయినైనా పంపించండి. ఏదో మీ దయవల్ల దాని పురుడు అది ఇక్కడ గనక అంతా సౌకర్యంగా జరిగిపోయింది. మా ఇంట్లో అయితే మంచి వైద్యం జరగకపోను....."

ఆవిడ భోళాతనానికి ప్రభాకర్ చిన్నగా నవ్వాడు.

"వీలు చూసుకుని సీతని అలాగే పంపుతానులెండి. పిల్లలు ఇప్పుడిప్పుడే బెంగ వదిలి కాస్త ఆరోగ్యంగా వున్నారు. ఈలోగా మీరు ఎప్పుడు రావాలని పించినా వచ్చి వెళ్ళండి. ఇది కూడా మీ ఇల్లే అనుకోండి....." అన్నాడు.

ఆ మాటకే పొంగిపోయింది సుభద్రమ్మ.

చంటి పిల్లాడ్ని జాగ్రత్తగా చూసుకోమని కూతురికి జాగ్రత్తలు చెప్పి ఆ మర్నాడు ఊరికి వెళ్ళిపోయింది సుభద్రమ్మ.

మూడు నెల్ల నుంచి ఇంట్లో పెద్ద దిక్కుగా వున్న తల్లి వెళ్ళిపొయ్యాక సీతకి ఇల్లంత చిన్నబోయినట్లు అనిపించింది.

అనుభవం లేకపోవటంతో అంత పసిపిల్లవాడ్ని సాకటం కూడా కష్టమే అనిపించింది.

పాప మంజు ఫరవాలేదు. కాస్త చెప్పినట్లు వింటుంది. అన్నం అది కలిపి ఇస్తే తినేస్తుంది.

కాని బాబు హరి అలాకాదు.

వాడికి ఏణ్ణార్థం వయస్సు. సీత భుజం అస్సలు దిగడు. ఎవరు ఎత్తుకున్నా పనికిరాదు. తలదువ్వటం దగ్గర్నుంచి పడుకోబెట్టటం వరకు అన్ని సీత చెయ్యాలి.

దాంతో సీతకి కొడుకుని చూసుకోవటం కాస్త ఇబ్బంది అనిపించేది.

ముందు హరిబాబుని సముదాయించి ఆ తరువాత పసివాడి ఆలనాపాలనా చూసుకొనేది.

సుబ్బులు సహాయంతో స్నానం చేయించేది.

ఏమైనా అవసరం అయినా దాన్నే సలహా అడిగేది.

సుబ్బులుకి నలుగురు పిల్లలు.

సీత కొడుకుని "నానీ" అని పిలిచేది.

"నానీ" చూట్టానికి ఆరోగ్యంగా వుండేవాడు. సీతని ఎక్కువగా విసిగించేవాడుకాదు. కడుపునిండా పాలుతాగి వెలుగు చూసి ఆడుకునేవాడు.

కాని తరచూ జలుబో, కక్కటమో.... బేదులో... ఏదో ఒకటి నలత వుండేది.

సీత కొడుక్కి ఒళ్ళు బాగాలేదని ఖంగారుపడితే సుబ్బులు.... "భయంలేదు అమ్మగారు.. చంటి పిల్లగాళ్ళకి ఇంతే..... మా బొట్టుడితో నేను ఏగుతున్నాను కదా..." పసివాడికి చిట్కావైద్యంచేసి క్షణంలో వాడి అనారోగ్యం రూపుమాపేది.

"అసలు చంటిబిడ్డలు ఇలాగే వుండాలి అమ్మగారూ. ఏ నలత లేకుండా

జరిగినకథ –18 : సీత గర్భవతి అయ్యింది ఆ విషయం కూతురు మంజు ద్వారా తెలుసుకున్న ప్రభాకర్‌కి పట్టరాని ఆగ్రహం వచ్చింది సీత తనని తల్లిని కావద్దని శాసించే అధికారం ప్రభాకర్‌కి లేదని తనకంటూ ఒక బిడ్డ ఉండాలని అంటుంది ప్రభాకర్ డా. ఆనంద్‌ను కలుసుకోవడానికి కారులో బయలుదేరాడు. అతనికి తను సంధ్యతో గడిపిన జీవితం అంతా జ్ఞప్తికి వస్తుంది. ప్రభాకర్ [illegible] వేయించుకున్నాడు సీత పురిటికి పుట్టింటి [illegible] వెంటనే బయలుదేరి రమ్మని ఉత్తరం రాసింది

బంతుల్లా వుండకూడదు. దిష్టి...." అనేది పైగా. ఆ సంగతేమోగాని సీతకి మాత్రం నానికి ఏ చిన్న సుస్తీ చేసి ఒళ్ళు వెచ్చబడినా మనసు గిజగిజ లాడేది. ఆ రోజు తిండి సయించేదికాదు.

మంజుకి, హరిబాబుకి 'నాని' అంటే విపరీతమైన ప్రేమ.

అస్తమానం వాడి ప్రక్కనే కూర్చునేవారు.

వాడికి సీత చేసే ప్రతి పని శ్రద్ధగా గమనించేవారు.

సీతకి కొడుకు పెద్ద కాలక్షేపం. వాడు పుట్టాక చేతినిండా పని. తన జీవితం గురించి ఆలోచించటానికిగాని, విచారించటానికిగాని తీరికలేదు.

"నాకు ముగ్గురు పిల్లలు" అనుకుంది మనస్ఫూర్తిగా!

కాని–

ప్రభాకర్ మనస్తత్వంలో మాత్రం ఎక్కువగా మార్పులేదు.

ముఖ్యంగా "నాని" విషయంలో చాలా ముభావంగా అంటీ ముట్టనట్టు వుండేవాడు.

సీత తనమాట నిర్లక్ష్యం చేసింది. తనని అగౌరవ పరిచింది అన్న భావమే ఆ నిరసనకి కారణం. ఆ విధంగా సీతపై కక్ష తీరినట్టు తృప్తి పడేవాడు.

ఎప్పుడైనా అరుదుగా ఆ పసివాడి మీద పితృవాత్సల్యం పొంగినా అణచుకొనేవాడు. అలాంటి బలహీనతలతో సీతకి లోకువకావటం అతనికి ఇష్టంలేదు.

ముందు ముందు ఆమె వాడికి తనని 'ఎర' వేస్తుందని, మమతల పంజరంలో బంధిస్తుందని అతని భయం.

అందుకే సాధ్యమైనంత వరకు చాలా దూరంగా అంటీ ముట్టనట్టు వుండేవాడు.



## జీవితం చేజారిందా

పైగా అతనికి చిన్న పిల్లలంటే సరదాలేదు. ఎత్తుకోవటం చేతకాదు. అదికూడా ఒక కారణం.

భర్త అభిప్రాయం ఏదైనా సీతకి బాధలేదు

తన గురించి, తన కొడుకు గురించి భర్త శ్రద్ధగా పట్టించుకోవటం లేదని ఆమెకి చింతలేదు. అసలు అతను ఏ విషయంలో పట్టించుకున్నాడు గనక?

అతడు మొదట్నుంచి తనని కాస్త పరాయిగలో కువగానే చూశాడు.

'నాని' పుట్టాకగాని, పుట్టక ముందుగాని ఏ చిన్న వేడుకలు జరగలేదు.

సీతకి అటువంటి ఆడంబరాల గురించి పెద్దగా అటువంటి కోరిక కూడాలేదు కాని నానికి మాత్రం ఒక మంచిరోజు చూసి ఏదైనా రెండే రెండు అక్షరాలుండే ఒక మంచి పేరు పెట్టాలని ఆమె కోరిక!

వాడికి ఏడాది నిండి పుట్టినరోజు వచ్చేలోగా ఏదైనా ఒక చక్కటి పేరు సెలక్టుచేసి పెట్టాలని ఆమె కోరిక!

భర్త వాడికోసం ఘనంగా కానుకలు తేవాలని, వేడుకలు జరపాలని ఆమె ఎన్నడూ అనుకోలేదు.

"వాడికినేను– నాకువాడు" అనుకుంది తృప్తిగా

నల్లేరుమీద బండి నడకలా రోజులు దొర్లిపోతున్నాయ్

* * * * * *

నానికి మూడు నెల్లు నిండి నాల్గవ నెల వచ్చింది పదహారు కళలతో పెరిగే పూర్ణచంద్రుడిలా రోజురోజుకి కళకళలాడుతున్నాడు.

సీతలో ఇప్పుడు మునుపటి చికట్లులేవు నిరాశ నిస్పృహలు లేవు.

ఒడిలో బాబుని చూసుకుంటుంటే మనసు ఆనందంతో పులకరిస్తుంది వాడికోసం జీవితంలో ఎన్నికష్టాలు ఎదురైనా భరించవచ్చు అనిపిస్తుంది "వీడు నా బిడ్డ. నేను ఏడిస్తే వాడు ఏడుస్తాడు నేను నవ్వితే వాడు నవ్వుతాడు. నాకోసంవాడు– వాడికోసం నేను! అలా అనుకుంటే సీతకి ఎంతో సంతృప్తి అనిపిస్తుంది

నాని ఇప్పుడిప్పుడే తల్లిని గుర్తుపట్టటం, దీపాలుచూసి ఆడటం, కిలకిలా నవ్వటం చేస్తున్నాడు

పక్కమీద ఒత్తిగిలి బోర్లా పడాలని తాపత్రయ పడుతున్నాడు.

ఏ వేళా మనిషి అలికిడి వుండాలి లేకపోతే ఇంటికప్పు ఎగిరిపోయేలా ఏడుస్తాడు

సీతకి భర్త ప్రభాకర్ ఇంట్లోవున్న సమయంలో గట్టిగా నాని ఏడిచినా భయమే.

అత్తమీద కోపం దుత్తమీద చూపినట్లు భర్త ఏమైనా మాట విసురుతాడేమోనని బెదురు అతడు అన్నంత మాత్రాన నష్టంలేదు. కాని అనవసరంగా మాట పడటం ఎందుకు? అని సీత అభిప్రాయం.

అందుకే ఎంతో జాగ్రత్తగా మెసులుకునేది.

ఇంటి బాధ్యతలు, పిల్లల సంరక్షణల్లో మునుపటికి ఇప్పటికి వీసం ఎత్తు తేడా రాకుండా నేర్పుగా సమర్థించుకునేది.

ముందు వాళ్ళ ముగ్గురి అవసరాలు చూసిన తరువాత నాని సంగతి చూసుకొనేది

ఒకోసారి హరికి అన్నం తినిపిస్తున్నప్పుడో... మంజుకి జడలు వేస్తున్నప్పుడో... నాని ఏడిస్తే సీతకి ప్రాణం గిజగిజ మనేది.

అయినా చేతిలో పని ఒదిలి వెళ్ళటానికి సాహసించేదికాదు.

ఆ కాస్సేపు మనసుని రాయి చేసుకొనేది.

ప్రభాకర్‌కి వేయికళ్ళు!

అతని పిల్లల్ని నిర్లక్ష్యం చేస్తే లేనిపోని సమస్యలు సృష్టిస్తాడు.

అతని దృష్టిలో మంజు, హరిబాబు అతని పిల్లలు. అతని ప్రేమపాత్రులు.

కాని సీత, నాని ఇప్పటికి పరాయివాళ్ళే

ఆ విషయం అతని ప్రవర్తనవల్ల, మాటల ద్వారా ఏనాడో స్పష్టం చేశాడు

"నా" అంటాడేగాని 'మన' అని పొరపాటున కూడా అనడు

బహుశా... అతను చెప్పినట్లు సంధ్యని తప్పించి ఇంకెవ్వర్ని ప్రేమించ లేడేమో!

అందుకే ఇంటి విషయాల్లో సీత చాలా మెళకువగా వుండేది. ఈ మధ్య మంజు స్కూలుకి వెళుతుంది. అది కొంత నయంగా వుంది. కాని నాని పెరుగుతున్న కొద్ది క్షణం తీరికలేకుండా అయ్యింది.

అయినా సీతకి శ్రమలేదు, విసుగులేదు. ఆ అలసటలో ఆ బాధ్యతలో ఆనందమే చూడగలిగింది.

బంతి దొర్లినట్లు రోజులు వుత్సాహంగా గడిచిపోతున్నాయ్.

ప్రభాకర్‌కి అప్పుడప్పుడూ నానిపట్ల అనురాగం కలిగి పితృ ప్రేమతో హృదయం పులకరిస్తుంది.

పచ్చగా బొద్దుగా ముమ్మూర్తులా తన పోలికల్తో వున్నవాణ్ని చూడగానే చేతుల్లోకి ఎత్తుకొని ముద్దు పెట్టుకోవాలి అనిపిస్తుంది.

"వీడు పుట్టడమేకాదు తనకు ఇష్టంలేదు అని చెప్పాడు. పాపం... ఈ పసివాడు తనని ఏం అన్యాయం చేశాడని?"

అతని హృదయంలో పశ్చాత్తాపం లాంటి భావం ఏదో కదిలేది.

హరిబాబు చిన్నతనం జ్ఞాపకం వచ్చేది.

నెల్లపిల్లాడిగ వున్నప్పుడు అచ్చం వాడుకూడా నానిలాగే వుండేవాడు. మరి వాడికి ఆ వయస్సులో ఎన్ని వేడుకలు జరిగాయ్? కాని.... నానికి.

ఆ క్షణంలో ప్రభాకర్ గుండెలనిండా సీతపట్ల జాలి..... సానుభూతి కలిగేవి.

ఆమెని ప్రేమగా దగ్గరకి తీసుకుని లాలించాలి అనిపించేది.

కాని అంతలో నే "అహం" అడ్డుపడేది.

మరుగున పడుతున్న భయాలు తల ఎత్తేవి.

"ఊహూ... ఆమెకి తను లోకువ ఇవ్వకూడదు." అనుకుని... గాంభీర్యంగా వుండిపొయ్యేవాడు. ఎప్పుడైనా సీత బాత్‌రూమ్‌లో స్నానం చేస్తున్నప్పుడు నాని ఉయ్యాల్లో ఆదమరచి నిద్ర పోతుంటే పిల్లిలా వెళ్ళి చేతుల్తో వాడి ఒళ్ళంతా నిమిరి, ఒంగి ఆప్యాయంగా వాడి లేత బుగ్గలమీద ముద్దు పెట్టుకొనేవాడు.

"ఒరే నాని...." అని పిలిచేవాడు తియ్యగా.

ఆ తరువాత ఏమి ఎరగనట్లు తన గదిలోకి వచ్చేసేవాడు.

ఒర్పుగా, అభిమానంగా ఇంటిని– పిల్లల్ని చక్కదిద్దుకొనే సీతంటే కూడా అతనికి అనురాగం లేకపోలేదు. కాని అదంతా అతని మనసుకేపరిమితం.

కాని ఇవేమి సీతకి తెలియదు.

భర్త అభిమానం తనపైనా, కొడుకుపైనా లేదన్న విషయం మాత్రమే తెలుసు.

అయినా ఇప్పుడు అటువంటి విషయాలు తల్చుకొని బాధ పడే స్థితిలో లేదు.

ఈర్ష్య, ద్వేషం, అసూయలాంటి భావాలు ఏమి లేవు.

ఆమె బ్రతుకూ, ఆనందాలకి ఏకైక లక్ష్యం నాని!

"వాడికి తల్లి, తండ్రి, గురువు, బంధువు, మిత్రుడు అన్ని నేనే! వాడు నా జీవన జ్యోతి" అనుకొంది.

అలా అనుకుంటే ఆమె మనసు ప్రశాంతంగా అయ్యేది.

ఇప్పుడిప్పుడే సీతలో "రేపటి" గురించి ఆశలు, కలలు చిగురు మొగ్గలు తొడుగుతున్నాయ్.

రేపు గురించి ఈ ఆశే లేకపోతే మనిషి జీవితం దుర్భరం అవుతుంది!

* * * * * *

ఆ రోజు.......

ఉదయం ఎనిమిది గంటలు కావస్తుంది. టిఫిన్ తయారుచేస్తూ సీత వంట గదిలో బిజీగా వుంది.

ప్రభాకర్ తన గదిలో కూర్చుని ఏవో ఫైల్సు చూసుకుంటున్నాడు.

నానికి స్నానం చేయించాలని సుబ్బులు వాడి ఒంటికి నూనె రాసి నలుగు పెడుతూంది.

మంజు, హరిబాబు ప్రక్కనే కూర్చుని చూస్తున్నారు.

ఆ రోజు మంజుకి స్కూలు లేదు.

అందుకే హుషారుగా వుంది.

సరిగ్గా ఆ సమయంలో ఇంటి ముందు "కీచు(....."మని కారు ఆగిన శబ్దం అయ్యింది.

ఆ తరువాత హడావుడిగా ఎవరివో మాటలు వినిపించాయి. ఆడవాళ్ళ కంఠాలు కూడా వినపడటంతో సీత గబ గబా వంట గదిలోంచి ఇవతలకి వచ్చింది.

అత్తగారు, మావగారూ గాని వచ్చారేమో అనుకుంది సీత.

కాని ఆ వచ్చింది సంధ్య పుట్టింటివారు.

పోర్టికోలో ఆగిన లేత ఆకుపచ్చ అంబాసిడర్‌లోంచి ప్రభాకర్ అత్తగారు ఖరీదైన పట్టు చీరలో, ఒంటినిండా నగలతో చాలా ఆడంబరంగా దిగింది.

ఆ వెనకాలే మావగారు.... అతని మరదలు.... కారు దిగారు.

అంతా ఐశ్వర్యానికి ప్రతినిధుల్లా వున్నారు.

కూతురు సంధ్య చనిపొయ్యాక అప్పుడప్పుడూ వచ్చి వెళ్ళేవారుట!

కాని సీత కాపురానికి వచ్చాక మాత్రం అదే రావటం!

రంగా వచ్చి చెప్పగానే ప్రభాకర్ చేతిలో ఫైల్సు పక్కకి పెట్టి హడావిడిగా వాళ్ళకి ఎదురు వెళ్ళాడు.

"ఓహో(..... బావున్నారా మామయ్యా! అత్తయ్యా బావున్నారా?" అంటూ పలకరించి మావగార్ని రెండు చేతుల్తో చుట్టి ఆప్యాయంగా కౌగలించుకొని చెయ్యి పట్టుకొని అభిమానంగా లోపలికి తీసుకు వచ్చాడు.

"హాయ్ రేఖా! హవ్ ఆర్‌యు(" అంటు వెనకాలే కారు దిగిన మరదల్ని పలకరించాడు.

"ఫైన్....." అంటు చిన్నగా నవ్వింది ఆ అమ్మాయి.

అల్లుడు మళ్ళీ పెళ్ళి చేసుకున్న విషయం చాలా ఆలస్యంగా తెల్సింది వాళ్ళకి.

ప్రభాకర్ అత్తగారు రత్నమణి సీతని, నానిని చూస్తూనే ముఖం ముడుచుకుని తుమ తుమ లాడింది. మంజుని, హరిని ప్రేమగా దగ్గరకి తీసుకుని ఒళ్ళో కుర్చోపెట్టుకొంది.

ఇంక అంతే!

చచ్చిపోయిన కూతుర్ని తల్చుకుని కళ్ళ నీళ్ళ పెట్టుకోవటం మొదలు పెట్టింది.

తల్లి లేని పిల్లలు అయిపోయారని మనవల్ని చూసి వాపొయ్యింది.

"ఇంత ఐశ్వర్యం వుంది. ఏం లాభం? నా కన్నతల్లికి యోగ్యత లేకపోయింది. అపరంజి బొమ్మలా వుండేది. ప్రేమించి కోరి పెళ్ళి చేసుకున్నారు. చిలకా - గోరింకల్లా వుండేవారు. ఏం ప్రయోజనం? ఆ దేముడు చూడలేకపొయ్యాడు....." అంటూ సన్నగా ఏడుస్తూ కళ్ళనీళ్ళు పెట్టుకొంది రత్నమణి.

సీతకి మనసంతా ఎలాగో అనిపించింది. వాళ్ళ ఎదురుగా కూర్చోవాలనిపించలేదు. కాని బాగుండదని ఎలాగో ఓర్చుకొంది.

"నిజమే. చిన్న వయసులోనే కూతురు చనిపోయిన బాధ సామాన్యమైనది కాదు.

కాని ... తన ఎదురుగా వచ్చుటి ఇంట్లో అస్తమానం అలా మాట్లాడటం సమంజసమేనా?"

సీత తనలో తనే మథన పడింది. సంధ్య ఆఖరి తమ్ముడికి పెళ్ళి నిశ్చయం అయ్యిందిట. అందుకని పెద్ద అల్లుడు ప్రభాకర్ని స్వయంగా ఆహ్వానించటానికి వచ్చారు.

"నాయనా ప్రభాకర్, పెళ్ళికి వారం రోజుల ముందే నువ్వు పిల్లలిద్దర్ని తీసుకొని తప్పకుండా రావాలి" అన్నాడు మావగారు శుభలేక అందిస్తూ.

"కంపెనీ పన్లు బాగా బిజీగా వున్నాయి మామయ్య, రావటానికి వీలు కుదురుతుందో లేదో, అయినా చూస్తాను...." అన్నాడు కాస్త నిర్లిప్తంగా.

ఆ మాటతో రత్నమణి వలవలా కన్నీళ్ళు పెట్టుకుంది.

"అయ్యో! అదేమిటి నాయనా! అది ఎలాగూ లేదు. దాంతో పాటు మేము చచ్చిపోయామనుకొన్నావా? పూర్తిగా బంధుత్వాలు రాకపోకలు తుంచేసుకున్నావ్. అది పోయినంత మాత్రాన దాని పిల్లలు నాకు మనవలు కాకపోతారా?" అంది చెంగుతో కన్నీరు తుడుచుకుంటు.

ప్రభాకర్ విచారంగా తల దించుకున్నాడు.

భారమైన హృదయంతో -

"అప్పట్లో రావాలని చాలా సార్లు అనుకున్నాను. మిమ్మల్నందర్ని చూస్తేనయినా పిల్లలు బెంగ మర్చి పోతారేమో అనిపించేది. కాని.... ఏమిటో ... అక్కడికి వస్తే నాకు సంధ్య అస్తమానం జ్ఞాపకం వస్తుంది. అందుకే...."

## కనకశ్రీ ! — బొమ్మన్












రామాయణానికి సంబంధించిన కథలు ఎన్నో ఉన్నవి. ఆ కథలు రక రకాలుగా కానవస్తాయి. వాటిలో ఇదొకటి.

శ్రీరాముడు సీతాదేవిని అడవిలో వదిలిపెట్టిన తర్వాత ఆమెకు కుశలవులనే కవలబిడ్డలు కలిగారనీ, వాల్మీకి మహర్షి ఆ బాలురకు సమస్త విద్యలూ నేర్పాడనీ అందరికీ తెలుసును. ఆమెను విడిచిపెట్టిన కొన్నేళ్లకు శ్రీరాముడు అశ్వమేధయాగం ప్రారంభించి గుర్రాన్ని దేశ సంచారం కోసం విడిచాడు. అది వాల్మీకి ఆశ్రమ ప్రాంతానికి రాగా లవుడు దాన్ని బంధించాడు. దాని వెంటవస్తున్న సైన్యాన్ని కుశలవులు నేలమట్టంచేసి, వరుసగా శత్రుఘ్న, లక్ష్మణ, భరతులు మూర్ఛపోయేటట్లు చేశారు. తర్వాత తానే యుద్ధానికి పోనుండగా కౌసల్య, యుద్ధానికి పోవద్దని, కుశలవులను గెలవడం అసాధ్యమనీ ఇలా చెప్పింది.

"అమ్మా! అడవిలో అన్నాళ్లు ఎలా కష్టపడ్డారు? అని అడగగా, సీత, తన్ను రావణుడు లంకకు తీసుకుని పోయేవరకూ జరిగినది చెప్పి, తర్వాత ఏమి జరిగినదీ లక్ష్మణునే అడగండి అని అన్నది. లక్ష్మణుణ్ణి అడగగా, తనకప్పుడు తీరికలేదని, తీరికగా చిత్రం వ్రాసి సీతాదేవికిచ్చి పంపుతాననీ చెప్పి ఆ విధంగానే చిత్రం వ్రాసి జానకికిచ్చాడు. ఆమె దానిని చూచి ఏడ్వసాగింది. ఆ ఏడ్పువిని వచ్చి లక్ష్మణుడు కారణం అడిగాడు.

రామునికి చెరియొక ప్రక్కా ఇద్దరు అందకత్తెలు అందు కానవస్తున్నారని, తనకు సవతులున్నట్లు ఇప్పుడు తెలుస్తున్నదనీ ఆమె చెప్పినది. లక్ష్మణుడు నవ్వి "వారు స్త్రీలుకారు. విశ్వామిత్రుడు అన్నగారికిచ్చిన జృంభకాస్త్రాలు" అని మంత్రించి, ఆ ప్రతిమలను అస్త్రాలుగా మార్చాడు.కాని, సీతకు నమ్మకం కుదరలేదు. అసూయతో ఆమె ఆ అస్త్రాలను నూరుకొని తాగింది. తర్వాత గర్భవతి అయింది. కుశలవులు పుట్టారు. అస్త్రాల ప్రాభవం ఆ శిశువులకు సంక్రమించినది. ఆ అస్త్రాలు అమోఘాలుకదా! నీకు సమానులైన ఆ శిశువులను నీవు జయించలేవు. కావున పోవద్దు" అని.

అయినా, రాముడు ఉపేక్షిస్తే తనకు అపకీర్తి కలుగుతుందని యుద్ధానికి వెళ్లి కుమారుల చేతులలో అపజయం పొందుతాడు. విశ్వామిత్రుడు అతనికి జృంభకాస్త్రాలు ఇచ్చినప్పుడు "ఇవి నీ సంతానానికి సంక్రమిస్తాయి" అని చెప్పినాడట! అందువల్ల వారికి సంక్రమించిన ఆ అస్త్రాల ప్రభావం వల్లనే వారు, లోకైక వీరుడగు తమ జనకుణ్ణి కూడా జయింప గలిగారు. (రామనార్యుని కుశలవో పాఖ్యానాన్నను సరించి)

–బులుసు వేంకట రమణయ్య

## జీవితం చేజారిందా

"అయ్యో! అలా అని బంధుత్వాలు తెంచుకొంటామా? ఏ కంటి ఎక్కువగా పుట్టిడు కడుపు శోకాన్ని దాచాము. నేను బ్రతకటం లేదు. ఇంటికి పెద్ద కూతురు. పాతకేళ్ళు నిండకుండానే ఋణం తీరిపోయింది. ఈ పిచ్చి సన్నాసులు తల్లిలేని పిల్లలు అయిపొయ్యారు. అస్తమానం వీళ్ళు నా కళ్ళల్లో మెదులుత్తారు. వీళ్ళని చూసుకొనైనా కడుపు శోకం మర్చిపోదామనుకున్నాను. మా ఇంట్లో వుంచేమంటే వుంచావు కాదు. ఎంతైనా అమ్మమ్మని, ఆ మాత్రం చూడతగనా?"

ప్రభాకర్ ఖంగారుగా తల ఎత్తాడు.

"అబ్బే! అలా అని కాదత్త! కాని ... ఎందుకో నేను వాళ్ళని ఒదిలి ఒక్క రోజు కూడా వుండలేను. అందుకే....."

"నిజమే. అనుకో. పోనీ అప్పుడప్పుడూ పిల్లల్ని చూపించి తీసుకెళ్ళవచ్చు కదా? చేతిలో కారుంది. ఒక కన్ను కన్ను అవుతుందా? సవితితల్లి తల్లి అవుతుందా?" ఆవిడ కంఠంలో నిష్ఠురం!

"అవును ప్రభాకర్! అప్పుడప్పుడూ నువ్వు, పిల్లలు వచ్చి వెడుతుంటేనే కదా బంధుత్వాలు నిలిచేది. మాకు వయసు పైబడుతుంది. ప్రయాణాలు చెయ్యలేక పోతున్నాం...." అన్నాడు మామగారు పెద్ద తరహాగా.

"బావ మనందర్ని మర్చిపొయ్యాడు. లేకపోతే ఒక్కసారన్నా రాకుండా వుండగలడా?" అంది రేఖ వాలుగా చూస్తూ. ప్రభాకర్ చిన్నగా నవ్వాడు.

"అలాంటిదేమి లేదు. తప్పకుండా వస్తాను." అన్నాడు, మరదలు కేసి చూస్తు.

రేఖ తల అడ్డంగా తిప్పింది.

"బావా! నువ్వు నిజంగా మర్చిపోలేదా?"

"నిజంగా మర్చిపోలేదు."

"అయితే వారం రోజులు ముందుగ పెళ్ళికి రావాలి."

వారిస్తున్నట్లు అన్నాడు ఖంగారుగా.

"లేదు. అంత ముందుగా రావటం కుదరదు. కంపెనీ వ్యవహారాలు చాలా గొడవగా వున్నాయి. పెళ్ళికి తప్పకుండా రెండు రోజులు ముందు వస్తాను ప్లీజ్...." అన్నాడు బ్రతిమాలుతున్నట్లు.

వంటగదిలో పని చూసుకుంటున్న సిత అన్ని వింటూ నిశ్శబ్దంగా వుండిపోయింది. వాళ్ళు రెండు రోజులు వున్నారు. ప్రభాకర్ మామగారు సిటీలో ఏవో పన్లు వుంటే చూసుకున్నాడు.

ఆ రెండు రోజులు ప్రభాకర్ కంపెనీకి ఆలస్యంగా వెళ్ళి తొందరగా వచ్చేవాడు.

ఆ రెండు రోజులు ఇల్లంత సందడిగా కలకల్లాడింది. వాళ్ళందరి మధ్య వుంటే ప్రభాకర్ కూడా చాలా వుత్సాహంగా వున్నాడు. చచ్చిపోయిన తన సంధ్య తిరిగి వచ్చినంత ఆనందం అతని వదనంలో కనిపిస్తుంది.

(ఇంకా ఉంది)




ఉన్నత ప్రమాణాలను పాటించే అగ్రశ్రేణి విద్యాసంస్థలుగా కేంబ్రిడ్జ్‌కి, ఆక్స్‌ఫర్డ్‌కి ఉన్న విశిష్టత అందరికీ తెలిసినదే. ఎంతో మంది మేధావులకూ తాత్వికులకూ శాస్త్రవేత్తలకూ కళాశ్రేష్టులకూ మూలమై నిలిచినఈ విద్యాసంస్థలు నేడు మాదకద్రవ్య సేవనం వల్ల మయిలపడినట్లు భిన్న రంగాలకు చెందిన నిపుణులు అభిప్రాయపడుతున్నారు. హెరాయిన్ ఎక్కించిన నిషాతో, గంజాయి అందిస్తున్న మత్తుతో ఈ విద్యాసంస్థలు నేడు తూలుతున్నాయి. తరతరాలుగా పదిలపరచుకొంటూ వచ్చిన ప్రతిష్ఠను భంగపరచుకొంటున్నాయి. హెరాయిన్ మోతాదు అధికం కావడం వల్ల ఇటీవలే మరణించిన ఒలీవియా ఛానన్ (22) ఉదంతం క్రైస్ట్ చర్చ్ విద్యాసంస్థ గౌరవాన్ని బాగా దెబ్బకొట్టింది. ఈ అమ్మాయి ట్రేడ్ అండ్ ఇండస్ట్రీ స్టేట్ సెక్రటరి పాల్‌ఛానన్ కుమార్తె కావడంతో ఈ వార్తకు




మరింత ప్రాచుర్యం వచ్చింది. పైగా ఈ సంఘటనతో ప్రమేయమున్నట్లు చెప్పబడుతున్న సెబాస్టియన్ గిన్నెస్ (22) అనే అబ్బాయి బాగా పేరున్న మద్యపాన సంస్థ డయిరక్టర్ జోనాథన్ గిన్నెస్ కుమారుడు! ఒట్టో వాన్ బిస్మార్క్ మనుమడు కవుంట్ గాట్‌ఫ్రెయిడ్ పేరు కూడాఈ సందర్భంలో గట్టిగానే వినిపిస్తోంది. ఈ అబ్బాయిని అరెస్ట్ చేసి బెయిల్ మీద విడిచిపెట్టారు కూడా! ఇకపోతే వేల్స్ రాకుమార్తె డయానా తమ్ముడు విస్కవుంట్ అల్‌త్రోప్, కూడా ఈ వ్యవహారంలో చిక్కుకొన్నట్లు వార్తలు అందుతున్నాయి కాని స్పష్టంగా తెలియడంలేదు.

ఒలీవియా దుర్మరణంతో ఆక్స్‌ఫర్డ్ ప్రతిష్ఠ బాగా దిగజారిపోయినట్లుఅందరూ బహిరంగంగానే చెప్పుకొంటున్నారు. కొంతకాలం క్రితంఈవ్ అనే వాగ్ క్రైస్ట్ చర్చ్ విద్యా సంస్థలోని విదార్థుల జీవితం ఎలా వుంటుందో తన "బ్రైడ్ షెడ్ రివిస్టెడ్" నవలలో బాగా తెలియజేసారు. ఈ నవల వాస్తవానికి ఒక సంచలనాన్ని సృష్టించింది.గ్రాడ్యుయేట్ కోర్సులు చదువుతున్న టీనేజ్ పిల్లలు- అమ్మాయిలూ, అబ్బాయిలూ- తమ జీవితాలను ఎంత తేలికగా తీసుకొంటున్నదీ ఈ నవలలో వాగ్ రాసారు. మాదకద్రవ్యాలకు బానిసలైపోయి జీవితేచ్ఛ ఉడిగిన విద్యార్థినీ విద్యార్థుల వల్ల జాతి ప్రగతి ఎలా సాధ్యమవుతుంది? నిషా తలకెక్కడంతోనే ఊహాప్రపంచంలోకి తరలివెళ్లి అతి చిన్న వయసులోనే సెక్స్ నేరాలకు సైతం పాల్పడుతున్న వీరి వల్ల భవిష్యత్తుకి ఎనలేని ముప్పు ఏర్పడుతోంది. విద్యా ప్రమాణాలు గాలికి కొట్టుకొనిపోయి, జీవితపు విలువలు నేలమట్టమయిపోయి అర్థం పర్థంలేని వికృత వాతావరణం రూపుదాల్చితే జాతి మొత్తం దెబ్బ తింటుందని ఈ నవలలో హెచ్చరించడం కూడా జరిగింది. క్రైస్ట్ చర్చ్ అధిపతి రెవరెండ్ ఎడ్వర్డ్ హెటన్ ఈ నవలలో రాసిందంతా అబద్ధమనీ, అభూత కల్పననీ ఖండించినా - ఇప్పుడు వాస్తవమేనని అంగీకరించక తప్పడంలేదు.

చెర్‌వెల్ అనే స్టూడెంట్ న్యూస్ పేపర్‌లో ఆన్ మెకెల్‌రాయ్ (20) అనే విద్యార్థిని ఆక్స్‌ఫర్డ్ దురవస్థకు వ్యవస్థే కారణమని నిందిస్తూ ధూమపానం, మద్యపానం, మాదకద్రవ్య సేవనం నిత్యజీవితావసరాలుగా మారిపోవడం భరించ రానిదని సంపాదకీయంలో పేర్కొన్నారు. వోడ్కా, చాంపాగ్నె మొదలైనవి సాఫ్ట్ డ్రింకులులాగా తీసుకోవడం ఆక్స్‌ఫర్డ్ సంస్థలలో అతి సామాన్యమైన విషయమని జోనాథన్ ఛార్టెస్ (21) అనే ఫిలాసఫీ స్టూడెంట్ అనడం ఎంతో ఆందోళనని కలిగిస్తుంది. ఆక్స్‌ఫర్డ్ ఒక తాగుబోతు యూనివర్శిటీగా మారిందని ఈ అబ్బాయి అనడం గమనార్హమని ది సండే టయిమ్స్ పేర్కొంది.

మార్ఫిన్ మత్తు ప్రభావం పాప్ సంస్కృతివల్ల మరింతగా విజృంభించుతోందని లండన్‌కి చెందిన పత్రికా రచయిత విల్లియమ్ ఫ్రాంకెల్ వ్యాఖ్యానించడం ఆలోచించదగ్గది. పాప్ స్టార్‌లుగా వెలుగొందిన బీటిల్స్, రోలింగ్ స్టోన్స్‌లు కోలుకోలేనంతగా జబ్బుపడడానికి హెరాయినేకారణము. ప్రముఖ ఇంగ్లాండ్ క్రికెట్ ఆటగాడు ఇయాన్ బోథమ్‌ను ఆట నుంచి




బహిష్కరించడానికి అతడు మత్తు పదార్థాలకు బానిసలాగా మసలుకోవడమే కారణము. అభివృద్ధి చెందిన దేశాలన్నింటిలోనూ మాదకద్రవ్య సేవనం అత్యధికంగా కొనసాగుతోందని ప్రపంచ ఆరోగ్య సంస్థ వెల్లడిస్తూ కన్నాబిస్ కరాళ మృత్యు నృత్య హేలకు ఎంతో మంది బలవుతున్నారని సంఖ్యలలో సహా విశదం చెసంది.

క్రమశిక్షణను గట్టిగా అమలుపరిస్తే తప్ప ఈ సామాజిక జాఢ్యంసమసిపోదు. అన్నిటికంటే ముఖ్యం ఆత్మ సంయమనం! - అని క్రైస్ట్ చర్చ్ అధినేత హెటన్ చెబుతున్న మాటలను మరచిపోరాదు.సమస్య తీవ్రతను గుర్తించి తగిన విధంగా ప్రతి స్పందించకపోతే ఈనాడు విశ్వవిద్యాలయాలు మాత్రమే తప్పత్రాగి తూలవచ్చు, రేపు దేశాలకు దేశాలే ఆ నిషాలో కొట్టుకొని పోవచ్చు!

- డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

ఒలీవియా ఛానన్



# "నేనున్నానని..."

సింగరాజు రామచంద్రమూర్తి

"సైకిలు నేను పెడతానులే గురూ, నువ్వు లోపలికి వద" అన్న మాటలు వినబడి బయటకు చూసింది కుమారి. బయట భర్త, అతని పక్కన అతని ఆఫీసులో నే పని చేసే సుబ్బారావు కనపడ్డారు.

వెంటనే కాలెండరు వైపు చూసింది."కరెక్టు, పదవ తారీకు" ఒళ్ళు మండిపోయింది కుమారికి. "అంత టంచన్‌గా పదవ తారీకు కల్లా వచ్చేసి అప్పు అడిగేపాటి తెలివి ఉన్నవాళ్ళు ఆ అప్పు తీసుకోకుండా ఇల్లు గడుపుకోవడం నేర్చుకోలేరా?" అనుకుంది.

"ఇదుగో కుమారి, సుబ్బులుక్కూడా కాఫీ పంపు" అన్నాడు గోపాలావు బయట నుంచే.

అదీ ఆమెకు చిరాకే! "వచ్చేదేమో మీ దగ్గర అప్పుకోసం. అదే దండగ అనుకుంటూంటే ఈ పైఅముదం కూడా దేనికో" అంది ఒక రోజున.

"అలా కొట్టిపారేయకు. వాడు నా బాల్య స్నేహితుడు" అన్నాడు.

"బాల్య స్నేహితులలో ఒకడు అనండి. ఇంకా ఉన్నారుగా రామదండు! మీరు మీతో చదువుకున్న వాళ్ళని వేరే చూపించనక్కరలేదు. అంతా మీ చుట్టూనే, ఈ ఊరిలో నేఉన్నారు. పదవ తారీకు నుంచి ముప్పయవ తారీకు దాకా మన ఇల్లు పావనం చేస్తూనే ఉంటారు. అయినా భలే జాచ్ మిది. ఒక్కరూ పై చదువులకూ, పై ఊళ్లకూ వెళ్ళలేదు!"

"చదువన్నది ఎందుకో చెప్పు ముందు. కేవలం ఉద్యోగం కోసమే కదా! అదృష్టంకొద్దీ మేము డిగ్రీ పూర్తి చేసేసరికి మా ఆఫీసు వెలిసిందిక్కడ. అందరం గబగబ జేరిపోయా మందులో. పైగా నా విషయం అంటావు. పొలం, ఇల్లు పొలాలి చూసుకుంటూ ఇక్కడే ఉండవలసిన అవసరమూ ఉంది ... అసలు పై చదువులకి వెళ్లే శక్తి ఎందరికుందంటావు - అందువల్ల పాపం వాళ్ళెవరూ వెళ్లలేదు!"

"శక్తి ఎందుకు, మీరున్నారుగా కల్పవృక్షం!అప్పుడే మీరందరికీ చదివించకపోయారూ, ఇప్పుడిలా జీవితాంతం కొద్దో గొప్పో సాయం చేసే అవసరం తప్పేది!".

"వాళ్ళని కేవలం మనమే పోషిస్తున్నట్టు మాట్లాడతావేమిటి?"

"పోషించనూ పోషించ గలరు అంతటి ప్రేమ వాళ్ళంటే మీకు."

గోపాలరావు లోపలికి రావడంతో కుమారి వర్తమానంలోకి వచ్చింది. "నిన్న చేసిన చేగోడీలు కాసిని...." అన్నాడతను.

మీకా ఆయనకా?"

"వాడికీ, నాకూను. పాపం వాడికిష్టం. చిన్నప్పుడు నాకు కొని పెడుతుండేవాడు."

"అందుకే చదవబ్బి ఉండదు."

"వాడిలా అగపడుతున్నాడు గాని కుమారి, ఎంత తెలివిగల వాడో తెలుసా? ఒకసారి ... అవునుగాని నాకెప్పుడూ తోచలేదు. నీకు పాపం పెళ్లయిపోయింది కద ఇంకా 'కుమారి' అని పిలవటం ఏమిటో య్?"

"ఎప్పటికప్పుడు పెళ్ళికాని అమ్మాయితో మాట్లాడుతున్న థ్రిల్ మీకు కలిగించేందు! లేకపోతే అమ్మో రోడ్డమ్మట ఈల వేసుకుంటూ తిరగరూ?"

"అయితే నేను అలా తిరిగే రకం అంటావు".

"విషయం మార్చకండి.ఇలా డబ్బులిచ్చి మీరు వాళ్ళని సోమరిపోతులని చేస్తున్నారు. మీరు వాళ్ళకి స్నేహితులు అని అనుకుంటున్నారు. కాని నిజానికి శత్రువే! వాళ్ళలోని కష్టపడే శక్తిని చంపుతున్నారు. మిరిచ్చే అప్పుల కోసం, దానధర్మాల కోసం మీ చుట్టూ తిరిగి కాలం వృథా చేసుకుంటున్నారు. వాళ్ళ పొగడ్తలు వినటానికి అలవాటుపడి మీరు! ... అయినా కంఠశోష. మీరు మారరు. నా కాలం వృథా. బయటికెళ్ళి కూర్చోండి - కాఫీలు టిఫిన్లు పంపుతాను. వాళ్ళు మిమ్మల్ని కీర్తిస్తుంటగా విని ఆనందపడండి."

గోపాలరావు బయటకొస్తూనే సుబ్బారావు మొదలెట్టాడు. "పిల్ల పెద్దమనిషయింది గురూ, నీ చేతితో ఎంతిచ్చినా నాకు కలిసొస్తుంది...."

లోపల నుంచి కుమారి "వాళ్ళమ్మాయికి తొమ్మిదో ఏడు" అంది పెద్దగా.

"ఏరా విన్నావా? మీ అమ్మాయికి తొమ్మిదో ఏడట గద!"

నవ్వేశాడు సుబ్బారావు, "సారీ. 'అమ్మాయి' అంటే వదినగారి కూతురు. మొన్నను చూసిపోదామని వచ్చారులే. ఈ రోజు వెళ్లిపోయేవాళ్లే! అంతలో ... ఒక్క రెండు వందలు. ఎంత జాగ్రత్తగా చేసినా అంతా కావాలి!"

"అవునురా, వదినగారమ్మాయయితే నీకెందుకు ఖర్చు?"

"తప్పు గురూ. మనింట్లో అయితే అది మన బాధ్యతే. కావాలంటే చెల్లమ్మగారిని అడుగు. ఇరుగు పొరుగు నవ్వుతారు. అనకొచ్చి మావిడా మా మరదలూ చెల్లెమ్మ గారిని పిలుస్తారు."

"వదినగారన్నావు గదరా?"

"అదే గురూ, నాకీ తేడాలు గుర్తుండవు".

"పోనీ మీ ఆవిడా, మీ మరదలు మధ్య తేడా గుర్తుంటుందా?" అన్నాడు గోపాలరావు మెల్లగా.

"తప్పు గురో, కళ్ళు పోతాయి ... ఇప్పించవూ మరి"

"రేపు ఆట ఎవరింట్లోనేమిటి?" రహస్యంగా అడిగాడు గోపాలరావు.

"మన మూర్తిగాడింట్లో ... అదుగో మాటలో వాడే వస్తున్నాడు."

మూర్తి వస్తూనే "ఏరా గోపాలం, కిళ్లీలు తెచ్చుకోకుండా వచ్చేశావుటగా!" అన్నాడు.

"అవును. నీకెవరు చెప్పారు?"

"మన వాడింటికి వెడుతున్నాను వాడి కిళ్లీ మాంచిదొకటి కట్టు" అన్నాను మన పంతుల్ని."అది సరే, అసలు రోజూ తీసుకెళ్ళవలసివే తీసుకువెళ్ల లేదాయన. మళ్లా పాపం ఇంత దూరం రావాలి! అందుకని కుర్రాడి చేతికిచ్చి పంపుదా మనుకుంటున్నాను. దేముడిలా మీరొచ్చారు. ఇవి తీసుకెళ్ళండి. చాలు" అని ఇచ్చాడు. ఇవుగో" అంటూనే చేతిలో కిళ్లీలు పెట్టి "హమ్మయ్య' అన్నాడు మూర్తి.

"ఒరేయ్ నాన్నా, మూర్తి మావయ్య కూడా వచ్చాడు గాని అమ్మకి చెప్పు" అన్నాడు సుబ్బారావు బయటికొచ్చిన గోపాలావు కొడుకు మురళితో.

వాడు నవ్వి "చెప్పక్కర్లేదు. మా అమ్మకన్నీ తెలుస్తూనే ఉంటాయి. అలా వంటింటి కిటికీ కెదురుగా రోడ్డంతా కనపడుతుంటుందిగా!" అన్నాడు.

"వాళ్ళమ్మ నేర పరిశోధన శాఖలో ఉండాలిసిన మనిషి." అన్నాడు గోపాలావు.

మూర్తి కుర్రాడిని చేయి పట్టుకుని "అవునొరేయ్ నాన్నా, ఏమిటి ఎలా చదువుతున్నావు ఏమిటి కథ? బాగా చదవాలి. మా అమ్మాయినిచ్చి చేయాలి మరి. నువ్వు బాగా చదువుకుంటేనేగాని చేసుకోదది" అన్నాడు.

వాడు లోపలికి పారిపోయాడు.

"ఎంతమందిని చేసుకుంటాడ్రా వాడు. నీ కూతుర్ని, ఇదుగో వీడి కూతుర్ని, కిళ్లీల కోసం పంపుతే పంతులూ అదే మాట!" నవ్వాడు గోపాలావు.

"సిరిగల వానికి చెల్లును - నీకూ, నీ కొడుక్కీ ఏం రా?"

"నోరు ముయ్. మా ఆవిడ వింటే అందర్నీ తరుముతుంది. ఇంతకీ నీ విషయం చెప్పు."

"ఏముంది గురూ, మా అత్తగారు వచ్చింది. ఆవిడ రాక రాక వస్తుంది. చీర పెడితేగాని వెళ్ళకాదంటుంది మా శ్రీమతి. ఆ మాట నిజం కూడా. కనుక అర్జంటుగా రెండు వందల యాభయి కావాలి. దానిని గుండ్రం చేస్తే మూడు ఇప్పించు. అనక మా

శ్రీమతి మీ ఇంటికి వస్తుంది - మీ వాళ్ళు సెలెక్షన్ బావుంటుందిట."

"అయితేనికనేం, ఇటు వచ్చినప్పుడు ఎకాకి తీసుకువెడతారు బజారుకు. ఇప్పుడు నీ చేతికెందుకు?"

"అమ్మమ్మ, అలా చేయకు. ఆడవాళ్ళకి ఆ విషయం అప్పజెబుతే బడ్జెట్ దాటిపోతుంది. నా చేతికొస్తే నేను ..."

నవ్వాడు గోపాల్రావు.

రాత్రి ఎనిమిది వేసేసరికి మరో ఇద్దరు రావడం ఇబ్బందులు చెప్పడం డబ్బులు పట్టుకు పోవడం జరిగింది.

"అదోయ్ సంగతి" అన్నాడు గోపాల్రావు ఎనిమిది దాటాక.

"మీరు కొలువు ముగించే లోపల ఒకాయన భార్య,, మరదలు పేరంటం పిలిచారు. మరో ఆయన భార్యతో చీరల సెలెక్షన్‌కి వెళ్లాను. "మరో ..." మధ్యలోనే ఆపేసి నవ్వింది కుమారి. గోపాల్రావు కూడా నవ్వాడు. మిత్రుల తెలివికి.

మళ్ళీ కుమారే అంది. "నెలలో ఒక్క పది రోజులు మీ డబ్బుమీ దగ్గర ఉంటుంది. మిగిలిన ఇరవయి రోజులూ వాళ్ళ దగ్గరే! అదయినా నేను "పదవ తారీకు లోపల అప్పు ఇవ్వద్దు" అని రూలు పెట్టాను కనుక. దగ్గర దగ్గర పన్నెండు వందలు ఇప్పించారు ఈ పన్నెండు వందలు మీ ఆఫీసు బాంకులో వేస్తే నెలకి ఆరు రూపాలొస్తుంది డిపాజిట్‌గా వేస్తే పన్నెండు వస్తుంది. వీళ్ళకి కాకుండా బయటవాళ్ళకి వడ్డీకి తిప్పితే నెలకు ముప్పయి ఆరు నుంచి నూట ఇరవయి దాకా!"

"మీ నాన్న బాంకు బుద్ధి నీకు బాగా వంటబట్టింది అన్నీ రూపాయి పైసల్తో లెక్కలేయకూడదు పిల్లా! సుమతీశతకం ప్రకారం మనం అప్పులీయకపోతే అంతా ఊరు విడిచిపోతారు. అనక నీ ఇష్టం!"

గొంతు తగ్గించి రహస్యంగా అంది కుమారి "నేను కొన్ని కుటుంబాలు గమనించాను. పరిశీలనగా. అప్పుడు నేను గ్రహించినదేమిటంటే పిల్లల్ని చదివించే రోజులలో తల్లి, తండ్రి డబ్బుకి ఇబ్బంది పడుతున్నట్లుంటే ఆ పిల్లలకి పెద్దయినాక తండ్రిమీద గౌరవం ఉంటుంది. "మా నాన్న మా కోసం కష్టపడ్డారు" అని. ఇలా విరజిమ్ముతుంటే వాళ్ళకి అదే బుద్ధి వస్తుంది. మీ చిన్న కొడుకు మొన్ననెవరికో రెండు రూపాయిలు అప్పిచ్చాడట!"

గోపాల్రావు ఆనందపడిపోయాడు.

"బాగానే ఉంది సంతోషం. అవసరానికి ఆదుకోవడం పిల్లలకి నేర్పడం మంచిదే. అయితే అది పరస్పరం అన్న విషయమూ తెలియాలి. ఒకవేళ స్నేహం చేసినప్పుడు తెలియకపోయినా తరువాత పరీక్షించుకోవాలి' అని క్షణం ఆగి "మీ మిత్రులకు పరీక్షపెట్టబోతున్నాను" అంది కుమారి.

ఖంగారుపడి పోయాడు. "అదికాదు. వాళ్ళ దగ్గరె డబ్బుంటే మనల్నెందుకు అడుగుతారు కుమారి?"

"ఆగండి. ఆ మాత్రానికి వాళ్ళనేం ఉరి తీయం కదా! పిల్లలకు కూడా తెలియాలి - ఇంటికొచ్చే నాయనగారి స్నేహితులు ఎటువంటి వారో! కాఫీలు, టిఫిన్లూ, అందించలేక చస్తున్నారు వాళ్ళు"

ఒక రోజు శెలవు పెట్టించింది గోపాలరావు చేత. చిన్న కొడుకుని పిలిచి "నాన్నగారి ఆఫీసుకెళ్ళి మూర్తి మామయ్యగారు లేరూ, ఆయన్ని అడుగు "మా నాన్నగారు అర్జంటుగా ఊరికి వెడుతున్నారుట. రెండు వందలు కావాలి. మీ దగ్గర్లేకపోతే ఇంకో మావయ్యగారి దగ్గర




ఇప్పించమన్నారు అని అంటూ వాడిని పంపేసి "మీ ముఖ్య స్నేహితుల పేర్లు రాసిచ్చాను వరండాలోనే కూర్చుని ఉండండి వాడు తీసుకు రాబోయే డబ్బుకి' అంది గోపాల్రావుతో

గోపాల్రావు మాట్లాడలేదు.

వెళ్ళిన అరగంటకల్లా తిరిగి వచ్చాడు వాడు "మీ నాన్న చేత చీటీ రాయించుకుని రా రా నాన్నా అన్నారు మావయ్యగారు" అన్నాడు

"అదేమిటి?" తెల్లబోయింది కుమారి.

"అదేనమ్మా, వాళ్ళందరూ కూడా రూపాయి చూసి చాలా కాలమయిందట. నాన్నగారి దగ్గరకే వద్దామనుకుంటున్నారుట. మరి మనకి అవసరం కదా అని ఇంకెవరినయినా అడిగి ఇప్పించుదామంటే వాళ్ళ మాట ఎవరూ నమ్మరుట. "నువ్వే చూద్దువుగాని రారా నాన్నా" అంటూ నన్ను ఎవరి దగ్గరకో తీసుకువెళ్లారు. సుబ్బారావు మావయ్యగారు ఆయనెవరికో నన్ను చూపించి "వీడు మన గోపాల్రావు కొడుకు మూడు వందలు అర్జంటుగా కావాలిట గురువుగారు అన్నాడు.

ఆయన నవ్వేశాడు కొత్త ఎత్తు వేస్తున్నా వేమిటోయ్ సుబ్బారావు? మీ వాడేనా ఏదు ఎన్నో వాడేమిటి?' అన్నాడు

నాక్కోపం వచ్చింది ఛ గోపాలరావుగారి అబ్బాయినండి' అన్నాను

"గొప్ప ట్రయినింగిచ్చార్రోయ్. మీ నాన్న నీకు" అన్నాడాయన.

నా కసహ్యం వేసి ఇవతలికొచ్చేసాను. "ఒరే నాన్నా, మీ నాన్న చేత చిన్న చీటీ రాయించుకురా. ఎంత కావలసి వస్తే అంతా పుడుతుంది." అన్నారు మావయ్యగారు. మరి రాసిస్తారా?" అన్నాడు వాడు.

"విన్నారుగా మిత్రుల ప్రజ్ఞ !"

మాట్లాడలేదు. గోపాల్రావు. వాళ్ల ప్రజ్ఞ అతనికి తెలియనిది లేదు.

"పైగా చూడండి, మనం రెండు వందలకి కబురు చేస్తే మీ సుబ్బులు ఆయనెవరినో మూడు వందలడిగాడు ... నాకు తెలియకుండా మీరిచ్చేస్తూంటే కాదనేది లేదు. మీ డబ్బు, మీ యిష్టం. కాని అలాకాక నాకు తెలిసేలా ఇస్తున్నారు కనుక ఇప్పుడు నాకో మాట మీరు".

"కైక వరాలలాగానా?"

"ఏమయినా అనుకోండి. డబ్బు విలువ పిల్లలకి తెలియాలి. అది నా తపన. ఇక మీదట ఎవ్వరికీ, ఏమి ఇచ్చే వీలులేదు. డబ్బు పట్ల లక్ష్యం లేకపోతే లక్ష్మి నిలవదండి."

మాట్లాడలేదు గోపాల్రావు ...

"పంపులు కట్టేసినట్లయి పోయింది మా పని" అంటూ లబలబలాడి పోయాడు మూర్తి గోపాల్రావుతో.

అయితే గోపాల్రావు ఏమీ మాట్లాడలేదు ...

ఎక్కడికీ పోకుండా ఇంట్లోనే కూర్చున్నాడు. ఒక రోజు "ఈవాళ నుంచి తోట పని ప్రారంభిస్తున్నాను కుమారి" అన్నాడు.

"మంచిదే వంటికి, ఇంటికీ కూడా. కాని అతిగా చేయకండి."

రెండు పూల మొక్కలకి బోదులు చేశాడు. కొబ్బరి మొక్కకి కాలువ సరి చేశారు. గభాలున కూర్చుంటూ "అలవాటు లేకపోవడం వల్ల గుండె దడ దడలాడుతోంది కుమారి" అన్నాడు.

కుమారికి గుండాగినంత పనయింది. "అయినా మీకెందుకీ చాకిరి. ఏం చెద్దామిప్పుడు." అంది ఖంగారుగా.

గుండెమీద చేత్తో రాసుకుంటూ "చూద్దాం కాసేపు" అన్నాడతను.

"వీపులోకి నెప్పి వస్తోందా?"

"వస్తున్నట్టే ఉంది. చమటలు పోస్తున్నట్లున్నాయి ముఖం మీద. కొంచెం విసరవూ? .. ఊపిరి కూడా కొంచెం భారంగా వస్తున్నట్లుంది కుమారి. హాల్లోకి పోదాం పద"

"పత్రికలలో "గుండె జబ్బులు" చదివి చదివి అన్నీ మీకున్నట్లే భావించుకుంటున్నారు. ముందు మనసులోంచి ఆ ఆలోచన తీసేయండి. ధైర్యంగా ఉండండి" అని క్షణం ఆగి "నెప్పి బాగా ఉందా? ఎడమచేతిలోకి వస్తున్నట్లుగా ఉందా?" అంది.

పేలవంగా నవ్వాడు గోపాల్రావు. నన్నంటున్నావు గాని నువ్వు పత్రికల భాషే మాట్లాడుతున్నావు భయపడకు మనది పెద్ద బస్తీ. గదిలోకి పోదాం పద"

గభాలున అతన్ని పట్టుకుంది. "మీరు కదిలితే నా మీద ఒట్టే! అడుగు వేయకూడదు. చమట బాగా పోస్తున్నట్లుందా?"

"ఆ" అన్నాడు గోపాల్రావు.

"మీకు ఈ వెధవ సిగిరెట్లొకటి. ఆపండి దేముడా అంటే నా మాటవింటారా?" కళ్ల నీళ్లు తిరిగాయి కుమారికి. "ఇప్పుడేది దారి? ... మీ సుబ్బారావుగారికి కబురు చేస్తే?"

"ఎందుక్కుమారి. అందర్ని ఖంగారు పెట్టడం?" అని అంటూనే గుండె మీద రాసుకోవడం చూసింది కుమారి. ఇకనామె మనసు ఆగలేదు.

"కబురు చేస్తే వస్తాడా మీ సుబ్బులు?"

"అంటే - ఎందుకు రాడు?"

వెంటనే కొడుకుని సుబ్బారావు కోసం పంపి "వేడి వేడి కాఫీ పెడతా నాగండి" అంటూనే లోపలికి పరుగెత్తింది. గోడ కానుకుని ఏలాగే కూర్చున్నాడు గోపాల్రావు.

పది నిముషాలలో ముందుగా సుబ్బారావు, తరవాత మూర్తి వగయిరా మిత్ర బృందం అంతా వచ్చేశారు 'ఏమిటి గురూ?" అంటూ

వాళ్లనందరిని చూడగానే కుమారికి కొండంత ధైర్యం వచ్చేసింది "చూడండి గుండె నెప్పంటారు, ఖంగారు పడకంటారు. ఖంగారు కాక ఏమిటి చెప్పండి?"

"మీకింక భయంలేదమ్మా. ఒరేయ్ సుబ్బులూ, రిక్షా కేకెయి. కాదు కాదు. ఆగు. శ్రమ ఉండకూడదు కద మన డాక్టర్ శంకరం లేడూ అక్కడికే కద మనం వెళ్లేది. వాళ్ల కారు తీసుకురా గురువుకని చెప్పి' పురమాయించాడు మూర్తి క్షణాల మీద కారు రావడం, అందరూ కలిసి శంకరం క్లినిక్కి చేరుకోవడం జరిగిపోయింది వివరాలు వింటూనే గోపాల్రావుని గదిలోకి తీసుకు వెళ్లిపోయాడు డాక్టర్ శంకరం.

క్షణం ఒక యుగంగా ఉంది కుమారికి కాసేపటికి డాక్టర్ బయటికి వచ్చి "ఈ చీటీ మీద మందు రాశాను. తెప్పించాలి. అసలు మామూలుగానే దొరకదు. అందులో ఈవాళ ఆదివారం" అన్నాడు మూర్తితో వింటున్న కుమారి ఖంగారుగా మూర్తి వంక చూసింది అతను మాత్రం నిబ్బరంగా మా రాధాకృష్ణని పంపిస్తాను పాతాళలోకంలో ఉన్నా తేగలడు వాడు. షుమారుగా ఎంతవుతుంది?' అన్నాడు

"ఎంతయితేనేమండి అన్నయ్యగారు, ఇదుగో ఈ రెండు వందలూ ఉంచండి" అంటూనే రెండు నోట్లు ఇచ్చింది కుమారి.

ఇబ్బందిగా నవ్వాడు మూర్తి. 'మా గోపాలం కోసం నేనే ఖర్చుపెట్టవలసిన వాడినమ్మా, అయితే నా దగ్గర డబ్బులుండవు వాడు మాకెంత సాయం చేస్తాడు!"

కుమారికి కళ్ల నీళ్లు తిరిగాయి 'కొండంత అండగా వచ్చారు అందరూ, అదే చాలు' అంది.






V.V.D

ఊహలలో విహరించే
నవయౌవన సుందరాంగి
ఆమె హృదయాన్ని దోచుకున్నది ఎన్నెన్నో...
అల్లనల్లన సాగే అందాల సెలయేరు
హాయి హాయిగ వీచే చల్లని మలయ మారుతం
హృదయాన్ని చూరగొన్న సొగసైన చెలికాడు
రంగు రంగుల కోమల కుసుమాలు
నిగ నిగలాడే సుదీర్ఘ శిరోజాలు
ఆ శిరోజాలకు
వి. వి. డి. కొబ్బరి నూనె






VVD-2/86 R

# వి.వి.డి. కొబ్బరి నూనె

V.V.D

# ఇ॰వేమన॰పద్యాలు






నిరుపేదల రక్షించెడు
సరసుడు నెరదాతగాక సంపన్నులదా
భరియించు వాడు దాతయె
మెరమెచ్చుల దాతయతడు మేదిని వేమా

## "నేనున్నానని ..."

మళ్ళీ కాసేపటికి డాక్టర్ బయటికి వచ్చి ఒక చీటి ఇస్తూ "డాక్టర్ పరమేశ్వరరావుగారు లేరూ, కార్డియోలజీ స్పెషలిస్టు, ఆయనకు ఈ చీటి చూపించి "ట్రీట్‌మెంటు సరిగానే ఉందా" అని అడగాలి. కేసు సీరియస్‌ది కాదు. లేకపోతే ఆయన్నే పిలిపించేవాడిని." అని నవ్వుతూ "ఆదివారం కదూ, ఇంటిలో దొరకరు.పొద్దున్నుంచి 'ముగ్గులో' ఉంటారు. పట్టుకోవడం కష్టం." అని మళ్ళీ లోపలికి వెళ్ళిపోయాడు.

కుమారి ఖంగారుగా మూర్తి వంక చూసింది.

మూర్తి నవ్వేశాడు. "మన సుబ్బులు కిలాంటి స్థలాలు తెలుసునమ్మా భయపడకు." అంటూనే అతన్ని కేకేశాడు.

అరగంటలో నలుగుర్ని నాలుగు రకాల పనుల మీద తోలేశాడు మూర్తి. అంతలో నే డాక్టర్ శంకరం ఇంట్లోంచి కబురొచ్చింది "కుమారి గారిని లోపలికి రమ్మంటున్నారు అమ్మగారు" అంటూ.

"ఎందుకులెండి" అంది కుమారి మూర్తితో

"అది కాదమ్మా, మన స్నేహితులే. లోపలికి వెళ్ళు నేను లేనూ ఇక్కడ!"

డాక్టరుగారింట్లోకి వెడితే ఎదురుగా ఆయనా, భార్యా, కబుర్లు చెప్పుకుంటూ ఉండటం కనపడింది కుమారికి. ఆమెను చూస్తూనే "రండి, రండి. ఇప్పుడే కాఫీ పెట్టించాను, గోపాల్రావుకి నాకూ తీసుకువెడదామని! ఈవిడ మా ఆవిడ. పేరు సావిత్రి. మా గోపాల్రావు భార్య కుమారి ... చదువుకునే రోజుల్లో నాకు సినిమాలకి డబ్బిచ్చేవాడు మా గోపాల్రావు" అని నవ్వాడు శంకరం.

అంతలో నే సావిత్రి అందుకుని "ఇక్కడికి వచ్చిన ఈ నెల రోజుల్లో ఎన్ని సార్లు చెప్పి ఉంటారు మీ వారి గురించి! మీ ఇంటికి తీసుకు వెళ్ళడం మాత్రం పడటం లేదాయనకి! నేనే వద్దామంటే నాకి ఊరే కొత్త!" అంది.

"ఎలాగుందండి మా వారికి?"

"ఎవరికి? ... ఓహ్ అదా ... మన వాడికా, బ్రహ్మాండం! సీరియస్ కాకపోవడం అదృష్టం. చాలా లైట్ ... సాయంత్రం మనింట్లో భోజనాలు చేసి కలిసి ఇంటికి పోదరు గాని. నో, ఇంకో మాట వినను. మీ ఆయన నా పేషెంట్. అదిగుర్తుంచుకోండి. మాటకి ఎదురు చెప్పకూడదు" అని నవ్వాడు ...

మరుసటి ఆదివారం డాక్టర్ శంకరం ఇంటి పైగది సిగరెట్టు పొగలతో నిండి ఉంది. పేక ముక్కలు పడి లేస్తున్నాయి -

"ఏరా డాక్టరూ, 'కాంపోజు' మందు చీటీ మీద రాసి "ఇది మామూలుగానే దొరక దు. అందులో ఆదివారం" అంటావా? అన్నాడు గోపాల్రావు.

"పాపం హడలిపోయిందిరా మా చెల్లెమ్మగారు - పసుపు కుంకుమ నిలబడుతుందో నిలబడదోనని!"

"మన వాడి నాటకం మాత్రం అద్భుతం గురో, చీటి మీద "ఆదివారం సిటింగ్ మనింట్లోనే" అని రాసి డాక్టర్‌గారి కోసం మరొక మనిషి. పైగా "ట్రీట్‌మెంట్‌సరిగా ఉందా" అని అడగాలిట. ఒర్రి, శంకరంగాడు పెద్ద ఏక్టర్‌రా".

"నేనూ, మా ఆవిడా కబుర్లు చెప్పుకుంటుంటే వచ్చిందిరా పాపం, ఆవిడ్ని చూస్తే జాలేసింది. తల్లడిల్లిపోతోంది. నీ మీద భలే కోపం వచ్చిందిరా గోపాలం.'

"మన కోసం ఇంత నాటకం ఆడిన మన గురువు, మహా దాత, దాన కర్ణ గోపాల్రావు ఆరోగ్యం కోసం చీర్సు".

"చీర్సా, బీర్సా?"

"ఈ నాటకం అడ్డం పెట్టుకుని మా ఆవిడ దగ్గర ఖర్చుల కింద మెత్తం మూడు వందలు పట్టేశారురా వీళ్ళు!" అన్నాడు గోపాలరావు శంకరంతో.

"అప్పుడే ఏమయింది. సంజీవిని హనుమంతుడు తెచ్చినట్లు నాలుగు పక్కలకి వెళ్ళి పనులు చేసుకు వచ్చారందరూ. మీ మేలుమరవలేను" అని ఈ రోజు అందర్నీ భోజనాలకి రమ్మనమంది మా చెల్లెమ్మగారు నీతోనే వస్తున్నాం మేము".

"ఆదొక ఆముదమా! సరే. ఒరేయ్ శంకరం నువ్వు కూడా సరదాగా రావాలి - నా ప్రాణం నిలిపిన వాడివి కద, నువ్వు భోజనం చేయకపోతే తృప్తి ఉండదు మా కుమారికి. బట్టలు కూడా పెడుతుందేమో చూసుకో నీ అదృష్టం" అన్నాడు గోపాల్రావు. □



**కాల్క్యులేటర్ ఆగకుండా పనిచేస్తుందని ఖచ్చితంగా చెప్పగలం.**

**అయితే అక్కడ పనిచేసే వ్యక్తి మాట మేము మాత్రం ఎలా చెప్పగలం!**

మా బ్యాటరీలను ఎంతో శ్రమ తీసుకుని తయారుచేస్తాం.
అవి మీకెంతో శ్రమపడి సేవ చేయాలన్నదే మా ధ్యేయం.

నొవీనో విషయంలో నాణ్యత అన్నది ఉత్త వచనం కాదు.
మరింత మన్నికైనదీ, మరింత శక్తి గలదీ.
మేలైన లీక్ రెసిస్టెన్స్ గలదీ అంటూ అదే పనిగా
జపం చేసే వట్టిమాటల వరస కాదు.

నొవీనో నాణ్యత ఈ బ్యాటరీని వాడినప్పుడల్లా మీకై మీరే చూడగలది.

నొవీనో.

అవునులెండి. అన్నీ (అందరూ కూడా) అలాగే ఉంది ఉంటే ఎంత బాగుండేది అనుకుంటున్నారు కదూ. అందులో మీ తప్పేముంది లెండి!




National

**నొవీనో**

లఖన్‌పాల్ నేషనల్ లిమిటెడ్
బరోడా, గుజరాత్.

నేషనల్ & పానాసోనిక్
ఉత్పాదనల నిర్మాతలైన,
జపాన్ దేశపు మత్సుషిట ఎలెక్ట్రిక్
వారితోటి సమిష్టి ప్రయత్నం.

# ఓహ్! నొవీనో

Sistas'-LNL-242/86 TELA

సీరియల్

# సర్ప యాగం

(గత సంచిక తరువాయి)

ఇక్కడ నాగరాజు బలవంతుడు. నర్సయ్య బలహీనుడు.

అయితే ... నర్సయ్య లాంటి వ్యక్తులలోని బలహీనత ఐశ్వర్యం లేకపోవడం కాదు. తమను హింసించే వాడి మీదికి తామూ తిరగబడితే . వాడి కన్నా తామే బలవంతులనే నిజాన్ని తెలుసుకోలేక పోవడం. ఇదే వీళ్ళలోని అసలైన బలహీనత.

ఇలాంటి వాళ్ళు ఐక్యతతో తమ మీదికి ఏ నాటికీ తిరగబడ లేరని. భావించడమే.. నాగరాజు లాంటి వాళ్ళకున్న గట్టి బలం. అయితే నాగరాజు లాంటి వాళ్ళు... ఏదైతే తమ 'బలం' అని భావిస్తున్నారో అది బలం కాదు భ్రమేనని, అది బలుపు కాదు 'వాపు' అని... చరిత్ర ఏనాడో ఋజువు చేసింది.

అయితే ఆ చరిత్ర నాగరాజు వంటి వాళ్ళకు అగుపించదు తిరగబడ్డ శ్రామికశక్తి మహారాక్షసత్వాన్నయినా మట్టి కరిపించగలదని... వాళ్ళ 'ఐక్యత' ఎంతటి ఐశ్వర్యాన్నయినా విధ్వంసం చెయ్యగలదని... నాగరాజు లాంటి మానవ మృగాల కింకా తెలియదు.

"రేపు తూరుపులో పటం యెగిరే యాళకు (పొద్దు పొడిచే వేళకు) నీ కుటుంబం మొత్తం నా మామిడి తోట లోంచి యెల్లిపోవాల. లేకపోతే ... నా కొడుకల్లారా' మిమ్మల్నందర్ని తీసుకపోయి యిరపచ్చమ్మ గుడి ముందు నరగావు యిచ్చేస్తా' – అంటూ నర్సయ్యతో చెప్పి... అక్కడి నుండి కదిలాడు నాగరాజు.

ఆ రాత్రి .. ఎనిమిది గంటల ప్రాంతంలో .. పాకాల సంత నుండి వెంకట్రాముడు, గౌరి తిరిగి వస్తున్నారు. ఊరి పొలిమేరలో నున్న ఎరూపాక్షమ్మ గుడి పక్కన గల కాలిబాటపై నడుస్తున్నారు వాళ్ళిద్దరూ. అక్కడే చీకట్లో చింత చెట్టు కింద కూర్చుని గొంతు దాకా తాగిన వీర్రాజు ఎవరితోనో మాట్లాడుతున్నాడు.

"అసలు ... నాగరాజు గారే తన మెడలోని గొలుసును తీసి... ముందే ఆ గుడిసె మీద .... పారేసినారు. యీ సంగతి ... యెవురికి తెలవదు. యేదేఁవైనా యీ పొద్దు యానాది నా కొడుకులకు సదుగులిరిగిపోయినాయి. ఆ యంకట్రాఁవుడు సంత కెళ్ళి తప్పించుకున్నాడు. లేకుంటే... వాని గ్గూడా యీ గతే పట్టుండేది."

దారిలో నడుస్తూ... చటుక్కున ఆగి, వీర్రాజు మాటల్ని విన్న వెంకట్రాముడికి, గౌరికి ... అసలు సంగతి అర్థం కాలేదు. మొత్తానికి తమ పాకల వద్ద యివాళ ఏదో జరిగిందని అనుకుంటూ... వాళ్ళు గబగబా మామిడి తోట వేపు నడిచారు. పాకల వద్దకు చేరుకున్న తర్వాత ... అక్కడ జరిగిన దారుణం గూర్చి కన్నమ్మ ఏడుస్తూ, వెంకట్రాముడితో వివరంగా చెప్పింది.

అంతా ఆలకించిన వెంకట్రాముడి గుండె అగ్నిగుండంలా మండిపోయింది. గాయాలతో పడుకుని మూలుగుతున్న గోవిందుడిని, నర్సయ్యలను చూడగానే... వెంకట్రాముడికి కళ్ళనీళ్ళు తిరిగాయి. గౌరి మాత్రం ... "యీడి నోట్లో పుండు పుట్ట. యీడి సేతుల్లో పురుగులు పడా" – అంటూ నాగరాజుకు శాపనార్థాలు పెట్టసాగింది. తర్వాత వాళ్ళ గాయాలపై పసుపు కొమ్ములు నూరి ... పూసింది గౌరి.

ఆ రాత్రి ... ఎంత ప్రయత్నించినప్పటికీ వెంకట్రాముడికి నిద్ర పట్టలేదు. అతడి కళ్ళకు నాగరాజు యొక్క క్రూరస్వరూపమే కనబడుతోంది. గతంలో నాగరాజు ఆ వూళ్ళో చేసిన దారుణాలన్నీ అతడి బుర్రలో కదల సాగాయి.

తిరగబడిన పాలేరును ట్రాక్టర్‌తో తొక్కి చంపించడం... నిరసనగా మాట్లాడినందుకు ఒక రైతు కొడుకును చెట్టుకు కట్టేసి అతనికి ఉచ్చ త్రాగించడం ... మరో యువకుడిని తుపాకితో కాల్చి చంపడం ... తన తండ్రిని వేటకు తీసుకుపోయి పులిచే చంపించడం.. చందాలు వసూలు చేసి దిగమింగడం.. ఆడవాళ్ళను చెరి పెయ్యడం.. ఆయన చెప్పినట్లు నటించడానికి ఒప్పుకోలేదనీ తనను చావకొట్టడం...

నర్సయ్య పొట్టేల్ని చంపి తినెయ్యడం... వాళ్ళపై గొలుసు దొంగతనం పెట్టి చావ బాదడం.. యింకా... యింకా ఎన్నో. ఇన్ని దారుణాలు చేసినా... దేవరకొండలోని ప్రజలంతా ఏకమై నాగరాజు పైకి ఎందుకు తిరగబడడం లేదో వెంకట్రాముడికి అర్థం కావడం లేదు. 'పోనీ... తను తిరగబడవచ్చుగా'... అతనిలో ఆ రకమైన ఆలోచన... ఆలోచనల తోటే... ఆ రాత్రి తెల్లవారి పోయింది.

ఆ ఉదయం ... ఆ మామిడి తోటను వదిలేసి, నర్సయ్య కుటుంబం వెళ్ళిపోతుంటే .. వెంకట్రాముడి మనసు గిజగిజ లాడింది.

## 15

రోజులు గడుస్తున్నాయి.

చీకటి వెలుగుల మధ్య అడ్డుగోడలా వున్న తూరుపు కొండలపై.. అంధకార గర్భాన ఏచ్చి, పైకి వచ్చిన అగ్నిపుష్పంలా ఎర్రగా నిగనిగలాడుతోంది ప్రాతఃకాలపు సూర్యగోళం. అంతవరకు భూమ్యాకాశాల నడుమ .. దట్టంగా అలుముకున్న అంధకారపు పొరలు పూర్తిగా పటాపంచలైపోయాయి.

సృష్టి .. రాత్రి తాలూకూ బద్ధకాన్ని విదిలించుకుంటోంది. పర్వతాలను మేలి ముసుగులా కప్పేసిన మంచు తెరలు తొలగిపోతున్నాయి. తాత్కాలికంగా దూరమై పోయిన జీవన సమస్యలు మనముల్ని మళ్ళీ చుట్టుముట్టడానికి చేరువైపోతున్నాయి. భూతలంపై ఎర్రని కాంతులు అలుముకుంటున్నాయి.

సృష్టి యావత్తూ జాగృదావస్థలోకి వచ్చి గంట దాటిపోతున్నా...

జరిగినకథ –12 : ఇరవై ఏళ్ళ క్రితం వెంకట్రాముడి తండ్రైన సీతారాముడిని నాగరాజు ఎలా చంపించింది వెంకట్రాముడితో వివరంగా చెప్తాడు నర్సయ్య. తన తండ్రి నాగరాజు చేత చంపబడ్డాడని తెలుసుకున్న వెంకట్రాముడు అగ్నిపర్వతమే అయ్యాడు. నాగి గోవిందుడిని వదిలేసి పుట్టింటికి వెళ్ళిపోయింది. నాగి, గోవిందులు విడిపొయ్యారు. నర్సయ్య నాగరాజు దగ్గర చేసిన అప్పుకు బదులుగా నర్సయ్య దగ్గర ఉన్న పొట్టేల్ని పట్టుకుపోతాడు వీర్రాజు. నర్సయ్య, గోవిందుడు తనను గురించి తిడుతూ మాట్లాడుకుంటున్న మాటలు చాటుగా విన్న నాగరాజు వాళ్ళపై దొంగతనం మోపి చింత బెత్తాలతో చావబాదుతాడు.



వెంకట్రాముడు మాత్రం యింకా నిద్రావస్థలో నే వున్నాడు. అతని కెప్పుడూ ఏడు గంటల లోపు నిద్రలేచే అలవాటు బొత్తిగా లేదు. అంత ఉదయాన్నే నిద్ర లేచి వెంకట్రాముడు వెలగబెట్టవలసిన రాచకార్యాలు కూడా ఏవీ లేవు.

"సద్దేళ (సద్ది అన్నం తినే వేళ) అవుతుంటే... యింగా యేం నిద్దరది? యెవురన్నా సూస్తే నొవ్వతారు. తెల్లవాదులూ (ఉదయం వరకు) పోయిన నిద్దర సాలదా? లెగులెగు" – అంటూ వెంకట్రాముడు కప్పుకున్న దుప్పటిని బలవంతంగా యివతలకి లాగేసి... అతడి వీపు మీద చేత్తో గట్టిగా తట్టింది గౌరి.

"అబ్బ! నీతో పెద్ద రావిడై పోయింది గదే. నన్ను రొంతసేపు నిద్దరబోనియ్. రాత్రంతా వొగిటే జాగారం. కంటి మింద రెప్పెయ్యలా. రాత్రంతా యీ ముండనాయాలి సిటిగలు (దోమలు) కర్సి సంపినాయి" – అంటూ గౌరిని విసుక్కుని ... దుప్పటిని మళ్ళీ లాగి కప్పుకుని పడుకున్నాడు వెంకట్రాముడు.

"నీ జల్మలో నా మాట సెవుకెక్కదు గదా. నాకేంవిలే.. పడుకుని మాయిటేళ దాకా నిద్దర పో. యీ పొద్దు జంగాలపల్లి జాతర. ఆ మాట మర్సినట్టుండావు. జాతరకు పోవాలని రాత్రి మనం అనుకొంటింవి. నువ్విట్నే నిద్దరబోతా వుంటే ... యింగ యీ పొద్దు మనం జాతరకు పోయినట్టే" – జాతర విషయం గుర్తు చేసింది గౌరి.

వెంటనే వెంకట్రాముడికి నిద్ర మత్తంతా వదిలిపోయింది. గౌరి చెప్పిన ఆ మాట... నిద్రను అతడి నుండి దూరం చేసింది. వెంకట్రాముడికి ఆ జంగాలపల్లి జాతరకూ అవినాభావ సంబంధముంది. కారణం... యిప్పుడతనికి పంచ ప్రాణాలయిన గౌరిని సరిగ్గా ఒక సంవత్సరం క్రితం... ఆ జంగాలపల్లి జాతరలో నే వెంకట్రాముడు దక్కించుకోగలిగాడు.

"పోయిన సారి జాతర్లో... మనిద్దరం వొగిటైతిమి. అప్పుడు నువ్వు నాకు నల్లపూసల దండను కొనిస్తివి. యీసారి జాతర్లో నువ్వు నాకు సీర కొనియ్యాల.

నా కుండే సీరలన్నీ తుక్రాగా (పూర్తిగా) సినిగిపాయినాయి. సనిగిన కొకను కట్టుకొని పదిమందిలోకి పోవాలంటే నాకు బగిశాట్టుగా వుంది."

నిన్న సాయంత్రం గౌరి తనతో చెప్పిన ఈ మాటలు వెంకట్రాముడికి చప్పున గుర్తుకొచ్చాయి. ఏనాడూ తనకు పలానా వస్తువును కొనియ్యమని గౌరి నోరు తెరచి వెంకట్రాముడిని యింతవరకు అడగలేదు

అటువంటి గౌరి యివాళ స్వయంగా జాతరలో తనకు చీరను కొనియ్యమని వెంకట్రాముడిని అడిగింది. అందుకే... ఏది ఏమైనా యివాళ మాత్రం తను గౌరికి తప్పకుండా చీరను కొనివ్వాలని గట్టిగా నిర్ణయించుకున్నాడు వెంకట్రాముడు. అయితే అతడి దగ్గర అంత డబ్బు లేదు.

అతని దగ్గర ప్రస్తుతానికి వున్నదల్లా నాలుగు పాము చర్మాలు మాత్రమే. ఆ చర్మాలను అమ్మితే .. వచ్చే డబ్బుతో గౌరికి ఒక చవకరకం చీరను కొనివ్వవచ్చు. కానీ చవక రకం చీరను కొనివ్వడానికి వెంకట్రాముడికి యిష్టం లేదు. కొంత మంచి చీరే కొనివ్వాలని వుంది అతనికి.

మంచి చీరను కొనివ్వాలంటే ... తనకు మరికొంత డబ్బు కావాలి. అయితే తనకు ఆ డబ్బు ఎలా వస్తుంది? దుప్పటి కప్పుకుని ఆలోచిస్తున్న వెంకట్రాముడి బుర్రలో హఠాత్తుగా పాము మెదిలింది.

అవును... మధ్యాహ్నం లోగా ఎక్కడైనా తిరిగి, తనో పామును పట్టుకోగలిగి... దాని తోలును గానీ తీసుకుంటే . యిప్పుడున్న నాలుగు చర్మాలతో దాని చర్మాన్ని కూడా కలిపి జాతరలో అమ్మితే .. ఆ వచ్చే డబ్బుతో తను గౌరికి ఓ రకమైన మంచి చీరనే కొనిచ్చి... గౌరి కోరికను తీర్చవచ్చు.

ఆ ఆలోచన రాగానే... వెంకట్రాముడు కప్పుకున్న ఆ దుప్పటిని లాగి అవతల పారేసి, ఎంతో ఉత్సాహంతో పైకి లేచాడు. వెంటనే రాత్రి పడుకోబోయే ముందు సగం కాల్చి, ఆర్పి పెట్టుకున్న బీడి ముక్కను వెలిగించి ... తృప్తిగా ఓ దమ్ములాగి పాకలోంచి వెలుపలికొచ్చాడు.

గౌరి ... పాకలోని రోటి దగ్గర కూర్చుని చింతకాయ పచ్చడి నూరుతోంది. సాయంత్రం జాతరకు వెళ్ళేందుకు అవసరమైన ఏర్పాట్లు ఏం చేసుకోవాలా? అని గౌరి ఆలోచిస్తోంది. వెంకట్రాముడు పాక బయట నున్న వేప చెట్టు వద్దకు గబగబా వెళ్ళి.... ఓ వేపపుల్ల విరుచుకుని పళ్ళు తోముకోసాగాడు.

పది నిముషాల్లో పళ్ళు తోమడం పూర్తి చేసి... గుడిసె పక్కనున్న బావి దగ్గరకు వెళ్ళి, గబగబా ముఖం శుభ్రంగా కడుక్కుని, పాకలోకి వచ్చాడు, వెంకట్రాముడు.

"గవురి! నాకు సద్ది నీళ్ళు పొయ్యి" – అన్నాడు వెంకట్రాముడు పొయ్యి దగ్గర కూర్చుని.

"యేందా తొందర? కొంచెపు వుండు" – అంది గౌరి రోకలిని రోట్లోంచి వెలుపలికి తీస్తూ.

"రోటి కాడ యేం జేస్తుండావు?"

"కనిపించడంలా? సింతకాయ వూరిబిండి (పచ్చడి) నూర్తా వుండా" – చెప్పింది గౌరి.

"తొందరగా నూరు మరి."

"యేఁవి? యాడికన్నా పోవాల్నా?"

"ఆఁ .... పోవాల."

"యాడికో?"

"పామును పట్టకొచ్చేదానికి "

"యిప్పుడా?"

"ఆఁ... యిప్పుడే. యింకో పామును పట్టి, తోలు తీస్కుంటే... మొత్తం అయిదు తోళ్ళవతాయి యీ అయిదు తోళ్ళనూ అమ్మి ... జాతర్లో నీకో మంచి సీర కొనుక్కోవచ్చు '

"బాగనే వుంది సంబడం! నువ్విప్పుడుబోతే తిరిగొచ్చే దెప్పుడు?"

"మద్దేనం కల్లా వొచ్చేస్తాను యీలోగా నువ్వు మన గుడ్డలుతికేసి... యెండ్లో ఆరబెట్టు. జాతరకు సద్దికూడు కట్టుకొని పోవాల గదా... అది కూడా సేసేయ్."

"అవన్నీ సేస్తాన్లే. నువ్వు మాత్రం... పాము దొరికినా దొరక్కున్నా మద్దేనం కల్లా వొచ్చెయ్యి. పొద్దు బోక ముందే జంగాలపల్లికి సేరుకుందాం."

"పాము దొరక్కుండా పొయ్యే కొచ్చినే లేదు. అంతగా దొరక్కపోతే... యెదురుగా యాపసెట్టు కిందుండే పుట్టను తొవ్వేసి అందులో వుండే నాగుపామును పట్టుకుంటే సరి."

"ఆఁ... ఆఁ. . పట్టుకుంటివే. యీ సంగతి ఆ నాగరాజు గ్గానీ తెల్సిందంటే ... నిన్నూ నన్నూ యిద్దర్నీ సంపేసి సున్నపురాళ్ళలో యిడగ బోసేస్తాడు" – అంది గౌరి నవ్వుతూ.

"మనం యింకో పద్దినాల్లో యీ తోటను యిడ్సిపెట్టి కొత్తపల్లి మిట్టకు యెళ్ళిపోతాం గదా. నర్స పెద్దయ్య మనల్ని తొందరగా వొచ్చెయ్యమంటా వుండాడు" – చెప్పాడు వెంకట్రాముడు.

"కొత్తపల్లి మిట్ట కాడ నర్సయ్యమాఁవ వోళ్ళకు అంతా సవుక్రింగానే (సౌకర్యంగానే) వుండాదా?" – రోటిలోంచి పచ్చడిని చేత్తో తీస్తూ అడిగింది గౌరి.

"వోళ్ళకు అంతా సవుక్రింగానే వుండాది. ఆ వూరి రైతులంతా శానా మంచోళ్ళంట. నాగరాజు లాంటి యెదవలు ఆ పక్క యెవురూ లేరంట."

"యిట్టాంటి దొంగ సచ్చినోడు యింగేడా వుండడులే. మనం గూడా ఆ పొద్దే నర్సయ్యమాఁవ వోళ్ళతో యీ తోటను యిడ్చి పెట్టి యెళ్ళిపోయుంటే బాగుండేది" – అంది గౌరి.

వెంకట్రాముడు చద్ది అన్నం తినడం పూర్తి చేసి.. నాగముస్టి చెక్కను 'కొంత మొలగుడ్డలో కట్టుకుని, కత్తిని తీసుకుని సర్పాల వేటకు బయలుదేరాడు.

ఆ మామిడి తోటలో ఎంత వెతికినా అతనికి ఒక్కపాము కూడా కన్పించలేదు. తోటలోంచి వెలుపలికి వచ్చి... 'రాళ్ళమిట్ట' వేపు నడిచి... అక్కడ పొదల్లో, బొరియల్లో, రాళ్ళ సందుల్లో ప్రతిచోటా సర్పాల కోసం వెదక సాగాడు వెంకట్రాముడు.

మధ్యాహ్నం కావస్తోంది. అయినా అతడు పట్టు వదలని విక్రమార్కుడిలా ప్రయత్నిస్తూనే వున్నాడు. రాళ్ళ మిట్ట నుండి 'కుమ్మర గుండ' వేపు నడిచాడు. అక్కడ కూడా అతడి ఆశ ఫలించక పోవడంతో 'బొమ్మడ గుట్ట' వేపు నడిచాడు.

వెంకట్రాముడి ఆశ నిరాశే అవుతోంది. ఎక్కడా ఒక్క సర్పం కూడా కంట పడటం లేదు. సూర్యుడు నడినెత్తికి వస్తున్నాడు. వెంకట్రాముడు తిరుగుముఖం పట్టాడు. సరిగ్గా... అదే సమయంలో పాలకొండ నాగరాజు తన మామిడి తోట్లోకి ప్రవేశించాడు.

అంతులేని నిరాశను ఆ సర్పాల వేటలో మిగిలించుకుని. . తిరిగి వస్తున్న వెంకట్రాముడు మామిడి తోట కంచెను దాటుకుని, తోటలోకి అడుగు పెట్టాడు. మర్రి చెట్టుకు కొంచెం ప్రక్కనున్న దారిలో నడుస్తున్న అతడి కళ్ళకు ...ఆ ఎండలో జిగేల్ మంటూ ఏదో మెరుస్తూ కన్పించింది.

వెంటనే వెంకట్రాముడు చటుక్కున నిలబడి ... తల కొంచెం ఎడం వేపుకు త్రిప్పి చూశాడు. అంతే... అతడి కళ్ళల్లో అంతవరకు అలుముకుని వున్న నైరాశ్యం పటాపంచలైపోయింది ఆనందంతో అతడి గుండె ఉప్పెనలా పొంగింది. అక్కడొక పొదలోకి. సగం వరకు దూరి వున్న పాము వెంకట్రాముడి కళ్ళబడింది.

సగం పాము వెలుపలే వుంది. అది వెంకట్రాముడి ఉనికిని ఏ మాత్రం గుర్తించలేక పోయింది. దాని తోక భాగం మొండిగా వుంది. ఆ మొండి తోకను చూడగానే.. గతంలో అదే ప్రదేశంలో తన గౌరిని కాటు వేసి.. తన చేత ఒక్క దెబ్బ తిని, తప్పించుకు పోయిన నాగుపాము వెంకట్రాముడికి గుర్తొచ్చింది.

అనుమానం లేదు... ఇది ఆ రోజు తన గౌరిని కాటు వేసి తప్పించుకు పోయిన నాగుపామే. తోక చివరిభాగం కూడా తెగిపోయి మొండిగా వుంది. పైగా యిదే ప్రదేశంలో మళ్ళీ అగుపించింది. అవును... యిది ఆ నాగుపామే – అని వెంకట్రాముడు తన మనసులో గట్టిగా నిర్ణయించుకున్నాడు.

అంతేకాదు.. యివాళ ఏది ఏమైనా దాన్ని వదలకుండా ప్రాణాలతో పట్టుకోవాలని కూడా అతడు నిశ్చయించుకున్నాడు. తన భార్యను కాటు వేసి పోయిందన్న కోపము, తనకు యివాళ దాని చర్మంతో వున్న అవసరమూ... యివి

రెండూ వెంకట్రాముడి మనసులో ఉవ్వేత్తున లేచాయి.

ఒక్క క్షణంలో... ఆ పాము తోకను పట్టి వెనక్కు లాగి... పొదలూ చెట్లూ లేని ప్రదేశం వేపు విసరి పారేశాడు వెంకట్రాముడు. దూరంగా వెళ్ళి పడిన ఆ పాము... బుస్ మంటూ పడగ విప్పి పైకి లేచి... వెంకట్రాముడిని చూసి, ప్రాణభయంతో అక్కడి నుండి ముళ్ళ పొదల వేపు పరుగు'దీసింది.

అది పొదల్లోకి దూరిపోక ముందే... అతడు ఒక్క ఉదుటున వచ్చి .. తన చేతిలోని తమర కట్టితో, ఆ నాగుపాము తలపై గట్టిగా నొక్కేశాడు. ఆ కట్టి తమర భాగంలో తల యిరుక్కు పోవడం చేత... యిక ఆ నాగుపాము వెంకట్రాముడి చేతి లోంచి తప్పించుకోలేకపోయింది.

పాము తల క్రింది భాగాన్ని ఎడం చేత్తో గట్టిగా పట్టుకుని... దాన్ని పైకెత్తాడతడు. అది వెంకట్రాముడి చేతికి పెన వేసుకుపోయింది. అవాళ్టి అతడి సర్పయాగానికి ఆ నాగుపాము సమిధ కాబోతోంది. శతృవు చేతిలోంచి తప్పించుకు పోయేందుకు అది తన శాయశక్తులా ప్రయత్నిస్తోంది.

"యేఁవిటికే అట్ల అల్లాడతావు? నువ్వు యెంత అల్లాడితే మాత్రం... నేను యిడ్సి పెడ్తానా? యీ పొద్దు నీకు నా సేతిలో మూడిపోయింది. యెంత కొవ్వుబట్టిన దానివే నువ్వు! నా పెండ్లాన్నే కాటేస్తావా? నీ యమ్మ... యింతకు ముందు నువ్వు యీ మాదిరిగా యెందర్ని కాటేస్తివో. నిన్ను పానంతో యిడ్సిపెడ్తే. యింగెంత మందిని కాటేస్తావో! యెన్ని కప్పల్ని, యెన్ని పురుగుల్ని నీ కడుపున బెట్టుకుంటావో! యింగ కాసేపట్లో... నీ బతుకంతా నా సేత్తో పూడ్సుకొని బోతాది' - అంటూ వెంకట్రాముడు ఆ పాముతో మాట్లాడుకుంటూ తన పాక వేపు నడవ సాగాడు

అప్పటికి సూర్యుడు నడినెత్తికొచ్చాడు. ఎండ మండిపోతూ వుంది. గాలి ఉధృతంగా వీస్తూనే వుంది. ఎండు తాటి పట్టలు చెట్లలోంచి గలగల మంటూ భయంకరంగా శబ్దం చేస్తూ రాలి పడుతున్నాయి. మామిడి కొమ్మలు ఫెళఫెళ విరిగి నేల కూలి పోతున్నాయి

గాల్లోకి ఎగిరిన ఎండు మామిడాకులు శూన్యంలో వలయాకారంగా తిరుగుతున్నాయి నేల మీది నుండి పైకి లేచిన ధూళి భ్యూమాకాశాల మధ్య అల్లుకు పోతోంది ఎడం చేత్తో పామును, కుడి చేత్తో కత్తిని పట్టుకుని పాక దగ్గరకు వస్తున్నాడు వెంకట్రాముడు

తన యింటి ప్రాంగణంలోకి. అడుగు పెట్టాడతడు. అది వెంకట్రాముడు నిర్వహించే సర్పయాగానికి సంబంధించిన యజ్ఞవాటిక. ఆ వాటికలో ఎన్నో సర్పాలు సమిధలై పోయాయి అందుకే వెంకట్రాముడిని నిస్సందేహంగా 'సోమయాజి' అని పిలవవచ్చు.

"గవురీ" - అంటూ ఎంతో ఉత్సాహంగా తన పాకలోకి ప్రవేశించిన వెంకట్రాముడు. అక్కడి ఆ దృశ్యాన్ని చూసి నిర్ఘాంతపోయి ... అలాగే నిలబడిపోయాడు.

అక్కడ లోపల....

గౌరి మోకాళ్ళ మధ్య ముఖం పెట్టుకుని ఏడుస్తూ కూర్చుని వుంది. ఆమెకు కొంచెం ఎడం వేపు నిలబడిన పాలకొండ నాగరాజు గారు.. చెరిగిపోయిన క్రాపును సర్దుకుంటున్నారు

గౌరి తల పూర్తిగా చెరిగి పోయి వుంది ఒంటి మీది బట్టలు తుంపం తుంపర్లుగా చిరిగిపోయి వున్నాయి కొన్ని మట్టి పాత్రలు అక్కడక్కడా పగలగొట్టబడి వున్నాయి.

నాగరాజు దుస్తులు బాగా నలిగిపోయి వున్నాయి. అతడు తొడుక్కున్న చొక్కా చెమటకు బాగా తడిసి పోయి అతడి శరీరానికి అతుక్కు పోయి వుంది

గౌరి కుమిలి కుమిలి ఏడుస్తూనే వుంది లేడి గొంతు కొరికి దాని నెత్తుటిని కడుపారా తాగిన పెద్దపులిలా.. నాగరాజు పెదవుల్ని నాలుకతో తడుపుకుంటున్నాడు.

"మాఁవా! యీ వుంపడం యదవను పానాల్తో యిడ్సి పెట్ట మాక ఆ కత్తితో వొకే యేటుకు నరికేయ్. యీడి తల వొక పక్క.... మొండెఁవు వొక పక్క పడిపోవాల' - అంది గౌరి ఏడుస్తూ.

క్షణకాలం నిశ్శబ్దం.

'యీడు .. యీడు... నా మింద పడి . నా మానం సెరిపినాడు... వొచ్చు సాఁవీ! అని కాళ్ళ మింద పడినా... యిడ్సి పెట్లేదు. యీ... . యీన్ని యిడ్సి పెట్టొద్దు పెపంచంలో... పాపాన్ని బతకనియ్య కూడదు" - ఏడుపుతో ఎగదిసుకుంటూ చెప్పింది గౌరి.

నాగరాజు చేసిన అఘాయిత్యం గురించి గౌరి చెప్పక ముందే... అక్కడి పరిస్థితి చూడగానే సులభంగా అర్థం చేసుకోగలిగాడు వెంకట్రాముడు.

నాగరాజు ముఖంలోకి తీక్షణంగా చూశాడు వెంకట్రాముడు ఆ క్షణంలో... అతడి చూపులు చూపుల్లా లేవు, గురి తప్పక గుండెల్లోకి దిగబడబోయే చురకత్తుల్లా వున్నాయి.

తన నివాస స్థలంలోకి వచ్చి తననే దెబ్బ కొట్టిన మేక గొంతును కొరికేసి. దాని రక్తం తాగబోయే తోడేలు చూపుల్లా చాలా వాడిగా, ... వున్నాయి.

వెంకట్రాముడి కళ్ళకు నాగరాజు మనిషిలా కన్పించడం లేదు. పది శిరస్సుల నాగుపాములా అగుపిస్తున్నాడు. ఒక్కో శిరస్సులో రెండు... విషకోరలు దర్శన మిస్తున్నాయి.

వెంకట్రాముడి గుండెల్లో గుప్తంగా అంత ప... నిద్రాణమై వున్న తెగింపు... ఆ క్షణంలో విశ్వరూపాన్ని సంతరించు...ం స్పష్టంగా గమనిస్తున్నాడు నాగరాజు.

అతడి గుండెలు దడదడ లాడాయి.

కాళ్ళలో సన్నగా వణుకు పుట్టింది.

వెంకట్రాముడి ఎడం చేతిలో వున్న నాగుపాము ... ఎక్కువగా బుస కొడుతున్నాడు వెంకట్రాముడు. అతడి ఎద ఎగిసి ...

దుర్భరమైన భూస్వామ్య అరాచకపు వ్యవస్థను ...కటి వేళ్ళతో సహ

# సర్పయాగం

కూల్చెయ్య గల మూర్తీభవించిన తిరుగుబాటు స్వరూపంలా వున్నాడు వెంకట్రాముడు.

సమస్త క్షత్రియ వంశాన్ని సర్వనాశనం చేయడానికి ప్రతిజ్ఞ చేసి. గండ్రగొడ్డలిని చేతబూనిన అపర పరశురాముడిలా వున్నాడు వెంకట్రాముడు.

అతడి కళ్ళు . వేసవి కాల మధ్యాహ్న సమయపు సూర్య గోళాల్లా జ్వలించి పోతున్నాయి.

అతడి ముఖం ... అరుణిమను పులుముకున్న సూర్యోదయపు తూర్పు ఆకాశంలా... ఎర్రగా మారుతోంది.

అతడి చూపులు తక్షక విషాగ్ని జ్వాలల్లా నాగరాజును తాకుతున్నాయి

వెంకట్రాముడు ఒక్కసారి తన కుడి చేతిలోని పదునైన కత్తిని చూసుకున్నాడు.

అతడి ఉద్దేశాన్ని గ్రహించిన పాలకొండ నాగరాజు గడగడ వణికి పోయాడు.

"ఆడ కూతుళ్ళను సెరిపే నా కొడుకు యెప్పుడూ బాగు పడడు. యెప్పుడో వొకప్పుడు ఆడపిచ్చితోనే వాని బతుకు పూడ్చుకొని బోతాది"– అంటూ నర్సయ్య గతంలో తన గురించి చాటుగా అన్న మాటలు నాగరాజుకు హఠాత్తుగా గుర్తొచ్చాయి.

అంతే.... ఆ క్షణంలో ....

ఉన్నట్టుండి ఆ పాకలోంచి బయటపడి పరుగుతీశాడు పాలకొండ నాగరాజు.

కానీ.... వెంకట్రాముడు వదిలిపెట్ట దలుచుకోలేదు. అందుకే వెంబడించాడు.

· ముందు.. . పాలకొండ నాగరాజు....

వెనుక.... వెంకట్రాముడు..

గాలి యింకా ఉధృతంగా వీస్తూనే వుంది.

చెట్లన్నీ అటూ ఇటూ ఊగి పోతున్నాయి.

తిరగబడితే.. తనూ బలవంతుడేనని అర్థమైపోయింది వెంకట్రాముడికి.

ఎదుటి బానిస తిరగబడితే .. తను చాలా బలహీనుడని అర్థమైపోయింది నాగరాజుకు.

ఇన్నాళ్ళూ తిరగబడక పోవడమే తన యొక్క బలహీనతని తెలిసిపోయింది వెంకట్రాముడికి

ఇన్నాళ్ళూ.... బానిసలు తిరగబడలేరని తను భావించడమే తన బలహీనతని తెలిసిపోయింది నాగరాజుకు.

ముందు... పాలకొండ నాగరాజు..

వెనుక.... వెంకట్రాముడు. ..

ఇద్దరూ పరుగిడుతున్నారు.

వేయి శిరస్సుల నాగుపాము తన వెంట తరుము తున్నట్టుగా వుంది నాగరాజుకు. ఎవరో జోస్యం చెప్పినట్టు... . "నాగుపాము గండం" యిదేనేమోనని అన్పిస్తోందాయనకు. కుడి చేత్తో కత్తిని . ఎడం చేత్తో పామును గట్టిగా పట్టుకుని నాగరాజు వెంట పరిగెడు తున్నాడు వెంకట్రాముడు.

గాండ్రించిన అధికారం పారిపోతోంది.

తిండ్రించిన తిరుగుబాటు వెంటపడుతోంది

మనుషుల్ని తినే మృగం పారిపోతోంది

రెచ్చిపోయిన "ప్రతిఘటన' వెంటపడుతోంది.

సాంఘిక అన్యాయం పారిపోతోంది

సాంఘిక చైతన్యం వెంటపడుతోంది

ముందు.... పాలకొండ నాగరాజు...

వెనుక.... వెంకట్రాముడు. .

ఆ మామిడితోటలోని దిగుడు బావి గట్టుపై పరుగెడుతున్న నాగరాజు కాలు హఠాత్తుగా జారిపోయింది. అంతే.. భయంకరంగా.. గుండె పగిలి పోయేలా.... కనుగుడ్లు పిగిలి పోయేలా . ఊపిరితిత్తులు తూట్లు పడేలా...' పేగులన్నీ తెగిపోయేలా. . నాగరాజు చావుకేక వేశాడు

ఆ కేకతో భూమి దద్దరిల్లింది. జడుసుకున్న గాలి హఠాత్తుగా స్తంభించి పోయింది. ఆ చుట్టు పక్కల పొలాల్లో పని చేసుకుంటున్న మనుషులు ఈ చావుకేక విని ... పరుగులతో దిగుడు బావి వద్దకు చేరుకున్నారు. ఆ బావిలోని దృశ్యాన్ని చూసి అందరూ భయకంపితులైపోయారు.

నీళ్ళు లేకుండా ... లోతుగా వున్న ఆ బావిలోని బండపై తల పగిలి. చచ్చి పడి వున్నాడు నాగరాజు. వెంకట్రాముడి సర్పయాగానికి బలియైన అసలైన విషసర్పం నాగరాజు అతడి యాగశాలలో అసువులు బాసిన అసలైన సమిధ.

"అయ్యగోర్ని యీ నాగుపాము తరుము కొసింది. పామును సూసి భయంతో ఆయన పరిగెత్తినాడు. కాలు జారి బాయిలో పడిపోయినాడు. అయ్యగోర్ని సంపిన యీ పామును నేను యిడ్సిపెట్టకుండా పానాలతో పట్టుకుంటి"– అంటూ తన ఎడం చేతిలోని పామును అందరికి చూపెట్టాడు వెంకట్రాముడు

అందమైన ఆ అబద్ధాన్ని.. . అందరూ నమ్మేశారు. పాలకొండ నాగరాజు సీతారాముడిని చంపించి. . అబద్ధంతో ఆ హత్యను ఎలా కప్పి






# బూస్ట్

## రుచికరమైన శక్తి నిచ్చే పానీయం. రోజంతా అతను చురుగ్గా ఉండేందుకు.



ఈనాడు గెంతుతు ఎగురుతు హుషారుగా పెరుగుతున్న పిల్లల తరంలో మీ బిడ్డ కూడా ఒకరు అతను ఎప్పుడు కూడా రేకెట్‌తో ఆడదామా, లేక బంతిని తన్నుదామా, కొత్త కొత్త ఆటలు ఆడదామా అన్న ఆత్రుతతో ఉంటాడు

స్కూలులో ఎంతగానో కష్టపడతాడు అన్నింటి గురించి తెలుసుకోవాలన్న తన చురుకైన బుద్ధికి సంతృప్తి కలిగించేందుకు ఎక్కువగా చదువుతాడు లెఖ్ఖలు చేయడం కష్టమే అయినా, అందువల్ల అతనికి మానసిక ఆనందం ఉంటుంది. అప్పను, ఈ రోజుల్లో మీ అబ్బాయిది ఉరకలు పరుగులు వేయవలసిన జీవితమే అతను సూపర్ ఫాస్ట్ రైలులా చకచకా అన్ని చేసుకుంటూ ముందుకు సాగిపోతాడు

**బూస్ట్—చాకొలెట్ రుచికరమైన శక్తి.**

మీ బిడ్డకు, రోజంతా పనులు జరిగిపోవడానికి శక్తి అవసరం బూస్ట్, పాలు, బంగారం రంగు గోధుమ, మాల్టెడ్ బార్లీ, కోకో వంటి శక్తి నిచ్చే పదార్థాలతో తయారైన రుచికరమైన పానీయం.

పాలల్లో కలుపుకొని త్రాగితే చాలా రుచిగా ఉండే బూస్ట్ మీ బిడ్డ రోజంతా చకచకా సాగిపోవడానికి కావలసిన శక్తి నిచ్చేందుకు, ప్రతి ఉదయం ఫలహారంతోబాటు త్రాగించేందుకు ఆదర్శప్రాయమైన పానీయం




## బూస్ట్

చురుకైన జీవనానికి శక్తి నిచ్చే ఇంధనం.



HMM-9077 TEL

పుచ్చుకున్నాడో.... వెంకట్రాముడు కూడా అదే పద్ధతిని అవలంభించి అందరినీ నమ్మించ గలిగాడు.

"నాగరాజు గారి నాగుపాము గండం నిజమైంది."

"గండమంటే యింగేమనుకుంటివి? దాన్నుంచి తప్పించుకోవాలంటే నరుడి తరం కాదు."

"గండం గానీ కొడితే.... యింగ మనిసి కద అంతే. దానికి తిరుగు లేదు అంతా తలరాత."

'తలరాత కాకుంటే.... రావుకాలంలో యీ తోట్లోకి రాజు గారు రానేల? పాము తరుంకోనేల? కాల్జారి బాయిలో పడనేల?"

"అది పాము కాదురా. పానాలు తీస్కపొయ్యేందుకు యముడే యీ రూపంలో వొచ్చినాడు."

ఆ దిగుడు బావి చుట్టూ గుంపు చేరిన వాళ్ళంతా.... యిలా వ్యాఖ్యానాలు చెయ్యసాగారు. కొంత మంది బావిలోని శవాన్ని గట్టుకు తీసుకు రావడానికి ప్రయత్నాలు చెయ్యసాగారు.

బావిలో... బండపై.... నెత్తురు మడుగులో... నిర్జీవంగా పడి వున్నాడు పాలకొండ నాగరాజు. తరతరాల సాంఘిక దురన్యాయ మృతకళేబరం అది చరిత్రలో అతడు చేయని పాపం లేదు

శవంపై చీమలు ప్రాకుతున్నాయి నెత్తుటిపై ఈగలు వాలుతున్నాయి వెంకట్రాముడి సర్పయాగానికి ఆహుతై పోయిన ఆ విషసర్పం.... ఆ రాత్రి వల్లకాట్లో తగలబడి పోయింది.

ఆ రోజు వెంకట్రాముడు, గౌరి జంగాలపల్లి జాతరకు వెళ్ళలేదు కానీ అవాళ దేవరకొండ గ్రామంలోని చాలా మంది ఆడవాళ్ళు మాత్రం... జాతరకు వెళ్ళి.... నాగరాజు పీడ విరగడ చేసినందుకు కృతజ్ఞతలు తెలుపుకుంటూ గంగమ్మకు" కొబ్బరికాయలు కొట్టారు. అయితే.... దానికి అర్హుడు వెంకట్రాముడు తప్ప.... లోకంలో లేని గంగమ్మ కాదు.

(అయిపోయింది)

## ఒక్క మాట

తెలుగులో నవల పుట్టి నూటపదేళ్ళకు పైగా గడిచి పోయింది ఇన్నేళ్ళ తెలుగు నవలా సాహిత్యంలో యానాదుల సామాజిక సాంస్కృతిక జీవితాన్ని చిత్రించిన నవల వచ్చిందో లేదో నాకు తెలియదు. నా పసితనం నుంచి యానాదుల ఆచార వ్యవహారాలతోనూ వాళ్ళ సామాజిక జీవితంతో కొంత సన్నిహిత సంబంధం వుండటంతో నూ నేను ఈ "సర్పయాగం" నవల రాయడానికి సాహసించాను. అయితే యిది యానాదుల సామాజిక సాంస్కృతిక జీవితాన్ని కేవలం పాక్షికంగా స్పృశించిన నవలే తప్ప, సమగ్రంగా యానాదుల సంఘర్షణాయుత జీవితాన్ని స్పృశించిన నవల కాదు ఈ నవలలో చెప్పినట్లు ఆంధ్రదేశంలోని అన్ని ప్రాంతాలలోని యానాదుల ఆచార వ్యవహారాలు ఒకేవిధంగా లేవు ఒక ప్రాంతానికి మరొక ప్రాంతానికి ఆచార వ్యవహారాలలో వైవిధ్యం వుంది. నేను ఈ నవలను రాస్తున్న సమయంలో యానాదుల జీవితాలకు సంబంధించిన విషయ సేకరణలో నాకు సహాయం చేసి సహకరించిన మా జవహర్ భారతి (కావలి) కళాశాల విశ్వోదయ హాస్టల్ "ఎ లో వాచ్‌మెన్‌గా పని చేస్తున్న యానాది సుబ్బయ్య గారికి కృతజ్ఞతలు చెప్పుకోవడం నా కనీస ధర్మం–

## "అంకితం"

1968లో అంటే 18 సంవత్సరాల క్రితం ఎర్రచెరువుపల్లి హైస్కూల్లో నేను ఎదవ తరగతిలో వున్నప్పుడు అక్కడ ఏర్పాటు చెయ్యబడిన ఒక సాహితీ సమావేశానికి ముఖ్య అతిథిగా విచ్చేసి కథలు రాయడం ఎలా? అనే అంశం గురించి ఉపన్యసించి తన ఉపన్యాసంతో నన్ను ఉత్తేజపరిచి నాలోని ఈ స్వల్ప సృజనాత్మక శక్తికి అనాడే బీజం వేసిన మహామనిషి కథాతపస్వి నాకు ఆత్మీయులు అయిన శ్రీయుతులు మధురాంతకం రాజారాం గారికి–

—[illegible]

# పరాత్పరుడి పెళ్ళిగోల

రాణీ మాలిని

సాయంత్రం ఐదు గంటలయింది

ఆఫీసు నుంచి బయటపడి పరధ్యాన్నంగా నడుస్తున్నా డతను. కొంపలు తగలబడి పోతున్నట్లు హడావిడిగా పరుగులెత్తే జన సమూహం.... అడ్డు వచ్చిన వారిని క్షమించక శిక్షిస్తూ దూసుకుపోయే వాహనాలు- "బొయ్"మని శబ్దం చేస్తున్న కార్ల హారన్ మోతలు... సైకిల్ బెల్‌లు, ఇవేమి అతని ఏకాగ్రతని భంగం కలిగించలేక విఫలమయ్యాయి.

ఆఫీసరు తలవాచేటట్లు పెట్టిన చివాట్లతో మెదడు వేడెక్కింది. తన మనసెందుకో అశాంతితో నలిగి పోతున్నది. పని మీద ఏకాగ్రత చూపలేక పోతున్నాడు. ఏం చేస్తే తన సమస్య పరిష్కార మవుతుందన్న ఆలోచనలతో భారమైన హృదయం, నాలుగు గంటల పోస్టులో వచ్చిన లెటర్ చదవగానే- కోపంతో మండిపడే ప్రేయసికి- ప్రియుడి చేతిలో ఖరీదైన ప్రెజెంట్ చూడగానే మనస్సులో అనురాగం పొంగినట్లు- అతని మనస్సు స్వాంతన పొందింది.

"అతనికి సంతోషం కలిగించిన ఆ లెటర్‌లో ఏముందబ్బా!"

లవ్ లెటరా! అనుకోవటానికి- అతనిని పరిక్షగా చూసిన ఏ అమ్మాయి అంత ధైర్యం చెయ్యదు.

అతనికి కన్నవారు పెట్టిన పేరు పరాత్పర రావు.

సన్నిహితులు- స్నేహితులు చేసిన నామకరణం- "పరాన్న జీవి".

అతని వయస్సు ముప్పయి ఎనిమిదేళ్ళు!

ముగ్గురు పిల్లల తండ్రి అనుకుంటే- మీ అంచనా తప్పే!

ఇంకా పెళ్ళే కాలేదు!

పెళ్ళి చేసుకోనని భీష్మ ప్రతిజ్ఞ చేశాడా....! అబ్బే అదేం లేదు!

పాపం అతనికి పెళ్ళి చేసుకోవాలనే ఉంది. కాని.... అతను చేసుకోవాలను కుంటే జరిగిపోయేంత తేలిక కాదు.

పరాత్పరరావు తండ్రి నెదిరించి పెళ్ళి చేసుకునేంత ధైర్యశాలి కాదు.

"ఎన్నాళ్ళు హోటల్ కూడు తింటాడు- పోనీలే ఏదో సంబంధం చూసి ముడిపెడదాం" అని ఆ తండ్రి అనుకోడు.

"ఆ మాట పరాత్పరరావు తల్లి" అంటే ఊరుకునేవాడు కాదు. ఆవిడ భర్త మాటలు విని- విని భరించలేక "బుద్ధి తక్కువై మిమ్మలిని కదిలించానంటూ" ఓ నమస్కారం పడేసి "జుట్టు తెల్లబడిపోయిన తరువాత ఎవరు కట్నం పోసినా ఎవరూ చేసుకోరు" అని ఓ బాణం వదిలి మరీ లోనికి వెళుతూ ఉండేది ఆ తల్లి.

అప్పుడప్పుడు పరాత్పరరావుకి తండ్రి నెదిరించాలన్న ఆలోచన రాక పోలేదు! వచ్చింది.... కానీ.... కనిపెంచిన తండ్రి.... ఆడ.... మగ.... అన్నీ తనే కదా! వాళ్ళ ముచ్చట్లు ఎప్పుడు తీరతాయి! కొడుకు పెళ్ళి తమ చేతులమీదుగా చెయ్యాలన్న కోరిక ఉండటంలో తప్పు లేదు. కాలయాపన అయిపోతుందన్న బాధ తప్ప! ఫలానా వారబ్బాయి తండ్రి నెదిరించి పెళ్ళి చేసుకున్నాడంటే! ఎంత సిగ్గుచేటు.... నలుగురిలో తండ్రి కెంత అవమానం!తన గురించి తనవాళ్ళు చిన్నబోయే దుస్థితి కల్పించ కూడదని తనలో తనే నిర్ణయించు కున్నాడు అలానే ఆచరిస్తున్నాడు.

లోకనాధానికి పిల్ల నచ్చితే.... ఆపై కట్నం నచ్చదు.

పోనీ రెండోది నచ్చితే- మొదటి దానిలో లోపాలు ఎంచకుండా ఉంటాడా అంటే! అది లేదు!

నట్టింట తిరిగే ఒక్కగా నొక్క కొడలు అందంగా ఉండాలి అంటాడు.

రెండూ నచ్చితే అదిగో పిల్లకి నలుగు రన్న లున్నారు.. నలుగురూ గుద్దుకుని ఆడపడుచు లాంఛనాలు సరిగా జరపరు. ఒక్క బావమరిది అయితే పెట్టుపోతలు బాగా పెడతాడు" అంటూ ఇంకో లంకె వేస్తాడు అలా వెనక్కి వెళ్ళి పోతుంది పరాత్పరుడి పెళ్ళి.

మొదట్లో వ్యవసాయం చేసేవాడు పరాత్పర రావు. ఛ.... ఛ.... వ్యవసాయం అయితే కట్నం ఎక్కువ రాదు. మొన్నీ మధ్య రామారావు కొడిక్కి ఆస్తి లేకపోయినా ఉద్యోగం చూసి లక్ష రూపాయలు కట్నం ఇచ్చారు. మనకు వెనుక ఆస్తి ఉంది. కట్నం ఇంకా ఎక్కువే రావాలి అని లెక్కలు వేసి.... ఉద్యోగస్తు డయితే లక్ష రూపాయల పైనే కట్నం వస్తుందన్న కొత్త ఆలోచన పుట్టు కొచ్చి రావటం తోనే.. పెద్ద తలల కాళ్ళు పట్టుకుని ఇంటర్‌మీడియట్ గట్టెక్కిన కొడుక్కి ఉద్యోగం వేయించ గలిగాడు. ఎవరూ లేకుండా చూసి కాళ్ళు పట్టుకుంటే అవతలి వారి మనసూ కరుగుతుంది.... మన పనీ జరుగుతుంది.... నలుగురిలో పరువూ 'నిలుస్తుంది అన్న పాలసీ లోకనాధానిది.

ఉద్యోగానికి కాస్త ఖర్చయినా.... రేపు కట్నం సొమ్ములో రాబట్టుకో వచ్చునన్న ఆలోచనతో తేలిగ్గా ఖర్చు పెట్టేశారు. చిన్న ఉద్యోగం అన్న బాధ' ఎకోశానా లేదు! చిన్న దయినా- పెద్ద దయినా- ఎవరన్నా పరాయి ఊరు పోయి చూడొచ్చారా! ఫలానా ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నాడన్న గొప్ప చాలదూ! అని మురిసి పోతుంటాడు.

పరాత్పరరావు ఉద్యోగంలో చేరి ఆరేళ్ళు నిండాయి.

అతను ప్రవేటుగా డిగ్రి పూర్తి చేశాడు. ఉద్యోగంలో ఓ మెట్టు పై కెక్కాడు. ఆ సంగతి తండ్రికి తెలియ నివ్వలేదు. మరో పదివేలు రేటు పెంచుతాడన్న భయంతో.

"మీ పిచ్చి పాడుగాను! ఎందు కంత దురాశ! లక్షణంగా పిల్లవాడి పెళ్ళి చేసి వాళ్ళని చూస్తూ ఆనందంగా గడిపే రోజసలు వస్తుందా!" అంటూ వాపోతుందా ఇల్లాలు.

లోకనాధం భార్య మాట పట్టించుకునే రకం కాదు. పట్టింది ఆడే అయినా!" కాదు నా చేతిలోది పాము!" అని వాదించేంత మొండివాడు.

తండ్రి పద్ధతి చూసి చూసి విసిగెత్తిపోయి తనకు పెళ్ళియ్యే యోగం ఉందో లేదో అని వాపోతూ స్నేహితుడి దగ్గర తన గోడు వెళ్ళ బోసుకున్నాడు పరాత్పరరావు.

అతను పనిమీద వూరికి వెళ్ళాడు పది రోజుల క్రితం.

"రేపు బయలుదేరి వస్తున్నానని- నీ పెళ్ళికి ప్లాను రెడిగా ఉందనీ లెటరు వ్రాశాడతను పరాత్పరరావుకి.

ఆ లెటర్‌లో ఉన్నది నాలుగు లైన్లు. పరాత్పరరావు ఆ లెటర్‌లోని సారాంశాన్ని కంఠస్థం చేసేశాడు.

అందులోని సారాంశం అతనికి ఎంతో ఆనందాన్ని కలిగించింది.

ఇంకా విపులంగా చెప్పాలంటే వెయ్యి ఏనుగుల బలాన్నిచ్చింది.

ఫ్రెండ్‌కు వచ్చిన ప్లాను గురించి ఆలోచించాలని ప్రయత్నించి విఫలమై కసిగా జుట్టు పీక్కున్నాడు

"తన మట్టి బుర్రకి ఆ మాత్రం తెలివి తేటలుంటే ఇంకా బ్రహ్మచారిగా అఘోరిస్తానా!" అని గొణుక్కున్నాడు.

ఆలోచనలు సేవిస్తూ రూముకి చేరుకుని స్నానం చేసి ఇస్త్రీ బట్టలు తగిలించాడు శరీరానికి.

అద్దంలో ముఖం చూసుకుంటూ దువ్వెన తీసుకున్నాడు క్రాప్ దువ్వటానికి.

"రోజు రోజుకి నుదురు మీద జుట్టు వెనక్కు పోతోంది నాపెళ్ళిలాగే" అని వాపోయాడు.

తల దువ్వి ముఖానికి లైట్‌గా పౌడరు అద్దాడు. ఫారిన్ సెంటు స్ప్రే చేసుకుని ఒకసారి తన ఆకారం వైపు చూసుకున్నాడు.

ఖరీదైన బట్టలు.... చేతికి వాచీ.... నీలం రాయి ఉంగరం.... నిగనిగలాడే బూటు.... వయసు పెరిగి కొంచెం ముందుకు సాగిన ఉదర భాగం.... పొట్టి పొడవు కాని ఎత్తు.... నలుపు తెలుపు కాని శరీర చ్ఛాయ.... అందగాడు కాదు మరి అనాకారి కాదు అనిపించే ముఖం.... అన్నీ కలిపితే అతను-

పరాత్పరరావు.

రూమ్‌కి తాళం వేసి మెల్లగా నడవసాగాడు.

రోజూ టీ తాగే హోటల్ కెళ్ళి టిఫెను తిని టీ తాగాడు. ఏదో నా అదృష్టం బాగుండి ఒక్క అమ్మాయైనా నన్ను ప్రేమించక పోతుందా అని సాయంకాలాలు చక్కగా తయారై రోడ్ల వెంట తిరుగు తుంటాడు. సినిమా హాళ్ళ దగ్గర టికెట్ దొరక్క నిరాశపడే అమ్మాయిలకు తన సొంత డబ్బుతో బ్లాక్‌లో టికెట్లు తెచ్చి పెడతాడు. వాళ్ళు నవ్వి థాంక్స్ చెప్పి టికెట్ రేటు చేతిలో పెట్టి వెళ్ళిపోతారు!

అతను అమ్మాయిల ప్రేమ సంపాయించటానికి సినిమాల్లో చూసిన ట్రిక్‌లన్నీ ప్రయోగించాడు. మనీ వేస్ట్ – ప్రోగ్రస్ నిల్.

రెండు నెలల క్రితం ఓ రోజు సాయంత్రం పరాత్పరరావు అతని ఫ్రెండ్‌రావు సినిమాకి వెళ్ళారు.

టికెట్లు తీసుకోవడానికి క్యూలో నిల్చున్నారు కొత్త సినిమా వచ్చి నాలుగు రోజులే అయింది.

ఓ చక్కని అమ్మాయి మగవాళ్ళ క్యూ దగ్గర వచ్చి ఆగింది.

త్వరగా నడవటం వలన నుదట స్వేదబిందువులు మెరుస్తున్నాయి.

కళ్ళలో టికెట్లు దొరకవేమో అన్న ఆదుర్దా తొంగి చూస్తూంది.




క్యూలో ఉన్న మగాళ్ళ కళ్ళన్నీ ఆమె అందాన్ని చూపులతో నే తాగేస్తున్నాయి.

ఆమె ఎవరితో మాట్లాడితే వారి జన్మ ధన్యమైపోయినట్లే అని చూస్తున్నా రందరూ.

"అంకుల్" అన్న పిలుపు విని ఊహల్లో తేలిపోయే పరాత్పరరావు ఉలిక్కి పడ్డాడు.

తన వెనుక ముందు అంతా కాలేజీ కుర్రాళ్ళే. రావు కూడ స్మార్ట్‌గా ఉంటాడు. తనని కాదేమో అని మౌనంగా ఉండిపోయాడు.

"అంకుల్" మళ్ళీ పిలిచిందామ్మాయి.

కోపంగా చూడాలన్ని ప్రయత్నించి విఫలమై ఓ వెర్రి నవ్వు నవ్వేశాడు.

"అంకుల్! మాకు రెండు టికెట్లు తీయరూ? బ్రతిమాలినట్లుగా అడిగిందామ్మాయి.

"తనని ఓ అమ్మాయి అంకుల్ అని పిలుస్తుందా' అన్న బాధలో, మిగిలిన మాట లేవీ పరాత్పరరావు చెవిలో దూరలేదు. బోరున ఏడ్వాలని పించింది. "నా కింకా పెళ్ళే కాలేదు, నీకు అంకుల్‌లా కనబడు తున్నానా?" అని ఆ అమ్మాయి నెత్తిన రెండు మొట్టాలని పించింది.

అవన్నీ చేయటానికి సంస్కారం అడ్డువచ్చి నిగ్రహించుకుని వెనక్కి తిరిగి చూడకుండా ఫ్రెండ్‌ని చేయిపట్టి లాక్కు వెళ్ళి బేరం చెయ్యకుండా రిక్షా ఎక్కేసాడు.

ఆ అమ్మాయితో సహా చుట్టూ వాళ్ళందరూ తెల్లబోయారు

గంట నుంచి నిలబడి చివరి క్షణములో స్నేహితుడి తొందరపాటుకి రావుకి కోపం వచ్చి రెండు రోజులు మాట్లాడటం మానేశాడు.

పరాత్పరరావు ఆ రాత్రంతా తనని పుట్టించిన దేవుడిని.... జుట్టు తెల్లబడుతున్నా పెళ్ళి చేయని తండ్రిని ఓపికున్నంత వరకూ తిట్టి శోషొచ్చి పడుకున్నాడు తెల్లవారు జామున.

అప్పటి నుంచి అమ్మాయిలను చూస్తేనే భయంగా ఉంటుంది. "నాకు ఈ జన్మలో పెళ్ళయ్యే యోగం లేదా!" అని బాధ పడుతూ భారంగా రోజులు గడుపుతున్నాడు.

రాత్రయింది. మళ్ళీ తెల్లవారింది. ఆ రోజు సాయంత్రం రావు ఊరి నుంచి వస్తానని వ్రాసాడు ఆఫీసరు నడిగి తలనొప్పి వంకతో పర్మిషన్ తీసుకుని ఓ గంట ముందుగా ఆఫీసు నుంచి బయటపడి స్టేషన్‌కి చేరాడు.

ఈవినింగ్ ఎడిషన్ న్యూస్ పేపరు, వీక్లీ కొని అవి తిరగేస్తూ ట్రైన్ వచ్చే వరకూ ప్లాట్‌ఫారమ్ మీద కాలక్షేపం చేశాడు.

రైలు వచ్చి ఆగింది. చిరునవ్వుతో ద్వారం దగ్గర నిలబడి చెయ్యి ఊపుతున్న రావు కనిపించే సరికి పరాత్పరరావుకి పట్టరాని సంతోషం కలిగింది. గభాల్న వెళ్ళి స్నేహితుడ్ని కౌగలించు కున్నాడు.

నవ్వుతూ స్నేహితుడిని వదిలి – "ఏమిటిరా సంతోషంతో చిన్న పిల్లాడిలా ప్రవర్తిస్తున్నావ్!" అంటూ విసుక్కున్నాడు రావు.

ఇద్దరూ లగేజి మోసుకుంటూ స్టేషన్ బయట కొచ్చారు.

ముందుగా రావు ఉంటున్న రూమ్‌కి వెళ్ళి లగేజి వదిలించుకుని ముఖాలు కడిగి నీట్‌గా తయారయ్యారు రూమ్ లాక్ చేసి హోటల్‌కి వెళ్ళి కాఫీ టిఫిను ముగించారు. ఆ పైన తీరిగ్గా నడుచుకుంటూ దగ్గరలో ఉన్న పార్కుకి వెళ్ళి ఓ మూలగా కూర్చున్నారు.

సమయం కొరకు ఎదురు చూస్తూ అప్పటివరకూ నిగ్రహించుకున్న పరాత్పరరావు– "రావు, నా ప్రాణం తియక త్వరగా నీ ప్లాను చెప్పరా బాబూ!" అంటూ గడ్డం పట్టి బ్రతిమాలు కున్నాడు.

"ఈ దెబ్బతో మీ నాన్న కట్నం సంగతి మర్చిపోయి

నీకు త్వరగా పెళ్ళి చెయ్యాలని ఆరాట పడతాడు" రావు సిగరెట్ వెలిగిస్తూ అన్నాడు.

"అదే.... అదే.... పెళ్ళి జరిగే మార్గం ఎలా అని! త్వరగా చెప్పరా నీ ప్లాను ఏమిటో!" ఆరాటంగా అడిగాడు పరాత్పరరావు.

రావు స్నేహితుడి చెవిలో కాసేపు గుడిగుడి లాడాడు.

రావు మాటల భావం అర్థ మయ్యే సరికి పరాత్పరుడి పెదాలు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

క్రమ క్రమంగా రెండు పెదాల మధ్య దూరం ఎక్కువై బిగ్గరగా పగలబడి నవ్వాడు

"ఒరే! ఏమిటా నవ్వు! సంతోషం ఎక్కువై నీ గుండె ఆగి పోయిందంటే బ్రహ్మచారిగానే జన్మ ముగిసి పోతుంది జాగ్రత్త" హెచ్చరించాడు రావు.

"అయితే నవ్వను- పెళ్ళి కాకుండా చావను" టక్కున నోరు మూసుకున్నాడు పరాత్పరరావు.

* * * *

లోకనాథం భోజనం చేసి వరండాలో పడక కుర్చీలో తీరిగ్గా కూర్చొని చుట్ట కాలుస్తున్నాడు.

ఇంతలో పోస్ట్‌మెన్ వచ్చి గులాబీరంగు కవరు అందించాడు.

సెంటువాసన ఘుమఘుమలు ముక్కు పుటాలకు సోకాయి.

"కవరు బరువుగా ఉందే? ఎక్కడ నుంచి వచ్చిందబ్బా!" అనుకుంటూ కవరు చించాడు.

ఫోటోలు రెండు కాళ్ళ దగ్గర పడ్డాయి.

అందుకుని పరీక్షగా చూశాడు.

లోకనాథం గుండెలు గుభేల్ మన్నాయి.

అయిపోయింది. తన ఆశలన్నీ బూడిదపాలై పోయాయి.

కొడుకు ఎవరో అమ్మాయితో దిగిన ఫోటో అది. కలర్ ఫోటోలో ఆ అమ్మాయి తన కొడుక్కంటే కూడా బావుంది. రెండో ఫోటో కూడా వాళ్ళదే! పోజులు మార్పు.

"ఓరే నాయనా! ఎంత దెబ్బ

# పరాత్పరుడి పెళ్ళి గోల

కొట్టావురా! అమాయకుడివని నమ్మినందుకు నిలువునా ముంచావు గదరా నీ తండ్రిని. నలుగురిలో నవ్వులపాలు చేశావు!"

లోకనాథం గుండె బాధతో కణకణా మండుతూంది.

కొడుకు పెళ్ళి దగ్గరుండి చూడలేక పోయినందుకు కాదు ఆ బాధ.

అలా కళ్యాణపు వెండి పళ్ళెంలో పట్టు వస్త్రంలో చుట్టిన నోట్ల కట్టలు కనిపించి అతన్ని ఊరిస్తున్నాయి

లోకనాథం భార్య లోపలి నుంచి ఎప్పుడు వచ్చిందో, ఫోటోలు తీసుకుని చూసి కోడలి అందానికి మురిసి పోయింది.

ఇప్పటికైనా కొడుకు మేలు కొన్నందుకు పొంగి పోయింది.

కవరులో ఓ చిన్న ఉత్తరం ఉంది.

విప్పి చూశాడు లోకనాథం.

మీ అబ్బాయి ఈ ఫోటోలో అమ్మాయితో సినిమాలు- షికార్లు తిరుగు తున్నాడు. ఎక్కడ చూసినా వాళ్ళిద్దరే త్వరలో రిజిష్టర్ మ్యారేజ్ చేసుకో బోతున్నారు. మీరు వెంటనే వెళ్ళి అతని కాళ్ళూ చేతులు కట్టి లాక్కొచ్చి ఏదో సంబంధం చూసి ముడిపెట్టండి. ఆలస్యం జరిగితే మీ అబ్బాయి మీకు కాకుండా పోతాడు. త్వరపడండి.

ఇట్లు,
మీ శ్రేయోభిలాషి

"అమ్మయ్య! ఇంకా పెళ్ళి చేసుకో లేదన్న మాట. లోకనాథం గుండెలు కుదట పడ్డాయి.

వెంటనే ప్రయాణ మయ్యాడు కొడుకుని తీసుకు రావటానికి.

రూమ్‌లోకి కాలు పెట్టగానే అతనికి కనిపించిన దృశ్యం అతన్ని మరేం ఆలోచించ నివ్వలేదు.

తనకు పంపిన ఫోటో లాంటిదే కొడుకు ఎదురుగా




పెట్టుకు కూర్చుని మురిసి పోవటం చూసి వళ్ళంతా కారం పూసుకున్నట్టు భగ్గుమంది

తండ్రిని చూసి తెల్లబోయిన కొడుకు నోరు నొక్కేసి బట్టలు వేయించి రూమ్‌కి తాళం పెట్టి ఇంటికి తీసుకు వచ్చేశాడు.

కొడుకుని ఓ గదిలో పెట్టి తాళం పెట్టాడు.

అతనికి కావలసిన వన్నీ తల్లి- "ఇదేం ఖర్మరా బాబూ నీకు!" అని ఏడుస్తూ అందిస్తూంది

నాలుగు రోజుల్లో సంబంధం చూసి నిశ్చయించాడు. అమ్మాయి అందమైనది. కట్నం ఇవ్వకపోయినా ఆ అమ్మాయి అందం వినయం చూసి ముచ్చటపడి, ఆ సంబంధం నిశ్చయించేశాడు లోకనాథం.

కట్నం కోసం ఆశతో ఎన్నో మంచి సంబంధాలు పోగొట్టు కున్నాడు ఇప్పుడు కట్నం కావాలంటూ కూర్చుంటే కొడుకు మనసు మారిపోయి ఆ పట్నంలోని వగలాడిని పెళ్ళాడేస్తా డేమో అన్న భయంతో కట్నం సంగతి ఎత్త లేదు. అతని మనసు గిజగిజలాడుతున్నా నలుగురిలో పరువు నిలబెట్టు కోవటం కోసం, "నేను కట్నం తీసుకోనోయ్ మా అబ్బాయికి" అని ఆదర్శాలు వల్లించాడు.

పెళ్ళి పనులు జోరుగా జరిగి పోతున్నాయి. పరాత్పరరావు మనసు సంతోషంతో కుప్పి గంతులు వేస్తూంది.

తండ్రి కనపడినప్పుడు మాత్రం 'నేని పెళ్ళి చేసుకోను. నా లైలానే చేసుకుంటా!" అంటూ ప్రేమ డైలాగులు చెప్పి, ధాం.... ధూం అంటున్నాడు.

"నువ్వు నీ పోర్షన్ సరిగ్గా చెయ్యకపోతే నీకు పెళ్ళి జరగదు' అని రావు భయ పెట్టటంతో కాస్త ధైర్యం తెచ్చుకుని యాక్షన్ చేశాడు పరాత్పరరావు.

పరాత్పరరావు పెళ్ళి జరిగి పోయింది. పెళ్ళి కూతురు సుందరిని చూసి అతని మనసు తెగ సంబరపడి పోయింది.

పెళ్ళికి వచ్చిన రావుని దూరంగా లాక్కు వెళ్ళి రెండు చేతులూ పుచ్చుకుని- "ఒరే ఈ జన్మలో నీ ఋణం తీర్చుకోలేనురా!" అంటూ కృతజ్ఞతగా చెప్పాడు.

"నీ పిల్లలకి కట్నం తీసుకోకుండా పెళ్ళి చేస్తే నా ఋణం తీరినట్టే!" రావు నవ్వుతూ భుజం తట్టాడు.

"తప్పకుండా' నీ కిచ్చిన మాట నిలబెట్టు కుంటాను" పరాత్పరరావు హామీ ఇచ్చాడు.

రావు కాలేజీలో చదివే రోజుల్లో మీసాలు రానప్పుడు నాటకాల్లో స్త్రీ పాత్రలు వేసేవాడు. చక్కగా అందంగా ఉన్నా వంటూ ఫ్రెండ్స్ సరదాగా ఫోటోలు తీశారు

ఇప్పుడు ఆ ఫోటో పక్కన పరాత్పరరావు ఫోటో ఉంచి ఇద్దరూ కలిపి తీయించుకున్న ఫోటో లా తీయించాడు రావు. కేవలం అది ఫోటో గ్రాఫ్ ట్రిక్.

ఆ ఫోటో రావుదని పరాత్పరరావు ఏ అమ్మాయితో 'కలిసి తిరగలేదని అంతా రావు ప్లానులో భాగమని ఆ శ్రేయోభిలాషి రావు అని ఆ నాటకమంతా పరాత్పరరావు కోరికపై జరిగిందని లోకనాథానికి ఎప్పటికీ తెలియదు. తెలిసే అవకాశమూ లేదు! □




**కె. కె. తురుమెళ్ళ**

నేను బి, యస్. సి. మొదటి సంవత్సరం చదువుతున్నాను. 3 సం. ల క్రితం నాకు ఫైలేరియాసిస్ వచ్చినది. కోర్సు ప్రకారము నాలుగు ఫ్లోరాసిడ్ ఇంజక్షన్‌లు చేయించుకున్నాను. హెట్రజాన్ బిళ్ళలు వాడాను. వాపు పూర్తిగా తగ్గిపోయినది. కాని ఇప్పుడు చలి, జ్వరముతో పాటు వాపు వచ్చినది. ఇంజక్షన్‌లు, మందులు వాడాను. కాని వాపు కాలు వెనుక భాగమున మిగిలినది. పాదము పై భాగమున పూర్తిగా తగ్గిపోయినది. ఈ వాపు పూర్తిగా తగ్గిపోయి మామూలు అవుతుందా? ఇతర భాగములకు గూడా వ్యాపిస్తుందా?

**డై ఈథైల్ కార్బమజీన్ సిట్రేట్ (హెట్రజాన్) మాత్రలను నిర్ణీత మోతాదు ప్రకారం దాదాపు 21 రోజులు వాడవలసి ఉంటుంది. దానితో బాటుగా సల్ఫా, పెన్సిలిన్‌వంటి యాంటీ బయాటిక్‌లను వైద్యుల సలహాపై వాడటం మంచిది. పూర్తిగా నయమయిన తర్వాత వాపు పెరిగే అవకాశంగాని, ఇతర భాగాలకి వ్యాప్తి చెందే అవకాశం గాని లేదు.**

**ఎస్. ఎస్ – ఖైరతాబాద్**

నా వయస్సు 18 సం.లు. నేను పెద్దగా లావు ఉండను. కాని నాకు లావుగా ఉండాలనిపిస్తుంది. లావు అవటానికి మందులు లేవని తెలుసు.

చాలా మంది 'బీరు' త్రాగితే లావు ఎక్కుతారంటారు. యిది నిజమేనా? ఎన్ని రోజుల కొకసారి త్రాగాలి? మీరు ఖచ్చితంగా చెప్తే నేను త్రాగటానికి సిద్ధమే!

బీరు తాగినంత మాత్రాన లావు అవుతారని ఎక్కడా నిరూపింపబడలేదు.

మీరు వాటిని తాగాలని మనసు పడితే నేను చెప్పలేను గాని, దీని వల్ల పెద్దగా లాభం ఉంటుందని నేననుకోను. అలా చెయ్యటం మధుపానం అలవాటుగా మారటానికి దారి తీస్తుంది.

**ఏ. ఏ. ఆర్ – కంచికచెర్ల**

నా వయస్సు 40 సం.లు. గత 3 సం.లుగా బ్లడ్ ప్రెషర్ ఉన్నది. మందులు వాడుతున్నాను. అప్పుడప్పుడూ కాళ్ళు, మెడ నరాలు పోట్లు పుడతాయి.

**బ్లడ్ ప్రెషర్ ఉన్నదనే మానసిక ఆందోళన వల్ల శరీరంలో నెప్పులు ఉన్నట్లు అనిపించటం జరుగవచ్చును. ఆహారంలో ఉప్పు తగ్గించటం, క్రమబద్ధంగా వ్యాయామం చెయ్యటం చాలా అవసరం. తాత్కాలిక ఉపశమనానికి, పేరసిట మాల్, అస్పిరిన్ వంటి మందులు వాడవచ్చును.**

**కె. ఎస్. ఆర్ – మద్రాసు**

యూస్టేచియన్ కెటార్ అంటే ఏమిటి? దీనికి ఏ చికిత్స చెయ్యాలి?

**గొంతు నుంచి చెవి మధ్య భాగానికి వెళ్ళే గొట్టాన్ని ఫెరింగోటింపానిక్ ట్యూబ్ (యూస్టేచియన్ ట్యూబ్) అని అంటారు. ఆ గొట్టంలో వాపు ఏర్పడి కఫం ఉత్పత్తి అధికం అయి, తద్వారా అవరోధం ఏర్పడితే చెవులలో దిబ్బెడ వేసినట్లు ఉంటుంది. దీనినే యూస్టేచియన్ కెటార్ అంటారు.**

**ఇ. ఎన్. టి. వైద్యుల సలహాపై వాపు తగ్గటానికి, టింకర్ బెంజాయిన్ వేసిన నీటితో ఆవిరి పట్టటం, ఫీనైల్ బ్యుటిజోన్ వంటి మందులు వాడటం, ఎఫిడ్రిన్ వంటివి వాడటం వల్ల తాత్కాలిక ఉపశమనం ఉంటుంది.** □

# అవీ ఇవీ అన్నీ

## వేముగంటి వారి సాహితీ పురస్కారం

సిద్ధిపేటలోని సాహితి వికాస మండలి అధ్వర్యంలో యువకవులను ప్రోత్సహించడానికి ఆ సంస్థ సంస్థాపక అధ్యక్షులు శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు తమ వంశం పేర ఒక సాహితి పురస్కారం నెలకొల్పినట్లు ప్రతి సంవత్సరం సాహితి వికాస మండలి జయంతి సందర్భముగా (అక్టోబరు -2) ఈ పురస్కారమున రూ. 216/-లు నగదు, ఒక జ్ఞాపిక బహుకరింప బడతాయని సంస్థ ప్రధాన కార్యదర్శి శ్రీ ముదిగొండ ఈశ్వర చరణ్ ఒక ప్రకటనలో తెలియ చేస్తున్నారు.

ఇంతకు పూర్వం ఎట్టి బహుమతులు పొందిఉండని, 1983, అక్టోబరు నెలకు ముందు ప్రచురణకాని పద్య, గేయ, వచన పద్య మిని కవితా సంపుటాలేవైనా పంపవచ్చు. పరిశీలనార్థం నాలుగు ప్రతులు పంపాలి. వివిధ కవుల సంకలనాలు పంపరాదు. వితికాదులు కాక కావ్యము 40 పేజీలకు తక్కువ ఉండరాదు. స్వంత చిరునామా గల పోస్టలు కవరు జతపరచి రచనలు 1986 జూలై, 30వ తేదిలోగా సాహితి వికాసమండలి, 7-4-75, పాతగంజ, సిద్ధిపేట– 502103 అన్న చిరునామాకి పంపాలి.

## ఉమ్మెత్తల అవార్డు

ప్రతి సంవత్సరం వలెనే 1986 సంవత్సరానికి సాహిత్య వేదిక (వనపర్తి) ఆధ్వర్యంలో కవితా సంపుటాల పోటి నిర్వహించబడుతుంది.

రచయి(తు)తలు తమ స్వీయ కవితా సంపుటి ముద్రిత గ్రంథాల్ని ఒక్కొక్కటి మూడు ప్రతులు పంపాలి. న్యాయనిర్ణేతల నిర్ణయం మేరకు ఉత్తమంగా ఎన్నిక చేయబడ్డ గ్రంథ రచయి(త్రి)తకు రూపాయలు 116-00 నగదు, ఉమ్మెత్తల అవార్డు బహుకరణతో సన్మానం జరుపబడుతుంది. 1981 నుండి 1986 వరకు ముద్రణ పొందిన గ్రంథాల్ని 30-9-1986 లోగా ఉమ్మెత్తల (వ్యవస్థాపకుడు) సాహిత్యవేదిక, బ్రాహ్మణ వీధి,(పోస్టు) వనపర్తి 509103, (జిల్లా) మహబూబ్‌నగర్, చిరునామాకుపంపాలి.

## వెంకట్ అవార్డు కార్టూన్ల పోటీ

యువ వ్యంగ్య చిత్రకారుడు "వెంకట్" పేరిట అవార్డుల బహూకరణకై వ్యంగ్య చిత్రలేఖనంలో 8 వ పోటీని సాధన సమితి (హైదరాబాదు) ప్రకటిస్తున్నది. రూ. 516/ల నగదుని కనీసం ముగ్గురు విజేతలకు పంచుతారు.

ప్రవేశరుసుం లేదు. ప్రతి పోటీదారు రెండు కార్టూన్లు పంపవచ్చు. అవి ఎగ్జిబిషన్‌లో ప్రదర్శించటానికి అనువుగా 9x12 అంగుళాల సైజులో వుండాలి. ఎగ్జిబిషన్‌కి ప్యాస్ పోర్టు సైజు ఫోటో కూడా పంపవచ్చు.

ఎంట్రీలతో పాటు అవి సొంత కల్పనలనీ, వాటిని ఏ పోటీకి, పత్రికకూ పంపలేదనీ, నిర్వాహకుల నిర్ణయాలకు బద్ధులమై వుండగలమనీ ప్రకటిస్తూ, పోటీదారులు హామి పత్రాలు పంపాలి.

ఎంట్రీలను:

"కార్యదర్శి, సాధన సమితి, 1-1-336/20 వివేక్‌నగర్, చిక్కడ్‌పల్లి, హైదరాబాదు – 500020" చిరునామాకు పంపాలి. □

# హైదరాబాద్ నోట్‌బుక్

## మరొక మంచి పని: –

వెనుకబడిన వర్గాలకు విద్యా సంస్థల ప్రవేశంలోను, ప్రభుత్వోద్యోగాలలోను వున్న రిజర్వేషను 44 శాతానికి హెచ్చించి రాష్ట్ర ప్రభుత్వం' మరొక మంచి పని చేసింది, రాష్ట్ర ప్రభుత్వాన్ని, ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావును అభినందిస్తున్నాను. దీనితో రిజర్వేషన్ల సంఖ్య 67 శాతానికి పెరిగిందని (వికలాంగులు, మాజీ సైనికుల సంతానం మొదలయిన వారికి రిజర్వేషనులతో పాటు) పై వర్గాల వారు కొందరు ఆందోళన చెందుతుండడం విన వస్తున్నది. కాని, ఎవరూ ఆందోళన పడనక్కర లేదు. సమాజంలో అన్ని వర్గాల వారు సమానంగా అభివృద్ధి చెందితేనే సర్వతో ముఖాభివృద్ధి వుంటుంది. ఒక వర్గం అభివృద్ధి చెంది, మరొక వర్గం అభివృద్ధి చెందనప్పుడు సమాజం డాడాయిస్ట్ల బొమ్మలలాగ వుంటాయి. మనది విశిష్టమైన వ్యవస్థ గలది, కుల వృత్తులకు ప్రాధాన్య మిచ్చేది అయిన అనాది సమాజం గనుక అక్షరాస్యత అనబడే నేటి చదువు పట్ల అంత శ్రద్ధ చూపలేదు. చదువు మనో వికాసానికి, సంస్కారానికి అనే భావం బలంగా వున్నందున, ఏదో పైతృకంగా వచ్చే వృత్తితో జీవిక వెళ్ళదోస్తూ, జ్ఞానార్జనకు చదువుకొనే వారు. విదేశ పరిపాలన వల్ల మన సంఘంలో కలిగిన మార్పుల వల్ల చదువుకు – డిగ్రీలకు– జీవనానికి బలమైన లంకె ఏర్పడడంతో ప్రతి వర్గం వారూ చదువు, పట్టాలు సంపాదించుకోడం, అలాటి పట్టాలు గల వారికే జీవిక లభించడం పరిపాటి అయినప్పుడు వివిధ వర్గాలలో పోటీ తప్పదు. ఈ పోటీలో అంగబలం, అర్థబలం గలవారు నెగ్గుకు రావడం, తక్కిన వారు మరింత వెనుకబడడం సహజం. అలాంటప్పుడు సమాజాన్ని సువ్యవస్థితం చేసి, శాంతి భద్రతలు నెల కొల్ప వలసిన ప్రభుత్వం వెనుకబడిన వారిని ముందున్న వారిని మించక పోయినా, సమానంగా నడిపించడానికి చర్యలు తీసుకోక తప్పదు. అలాటి చర్యలే రిజర్వేషన్లు. దీనివల్ల ఇతరులు గింజుకోవలసిందేమి లేదు. చదువు, తెలివి తేటలు ఒకరి సొంత ఆస్తి కాదు. అవకాశాలు, దోహదాలు లేక ఎందరో తమ విశేష శక్తులను వ్యర్థ పరుస్తున్నారు. రిజర్వేషనులను యావత్సమాజ దృష్టితో చూడాలిగాని, తమ కేదో ముప్పు వస్తున్నట్లు భావింపరాదు. రిజర్వేషనులు అనాదిగా ప్రపంచ మంతటా వున్నదే. మను చాణక్యాదులు, అరిస్టాటల్ ప్లేటో మొదలయిన వారు ఫలానా వారికి ఫలానా ఉద్యోగాలే ఇవ్వాలి అని, కొందరిని కొన్ని పనులకే నియోగించాలని నిర్ధారణగా చెప్పారు. మనఃప్రవృత్తిని బట్టి, అభిరుచిని బట్టి పనులు ఇమ్మన్నారు వారు. భారత దేశం వంటి దేశంలో ప్రవృత్తికి వృత్తికి పొత్తు కష్టం. ఎందుకంటే, జీవిక– బదకడం– ముఖ్యం. బదకడమే బరువయినప్పుడు ప్రవృత్తి నివృత్తుల ప్రసక్తే లేదు. ఇలాటిది పోయి అలాటిది కలుగడానికి సమాజం సమగ్రంగా వృద్ధి చెందాలి. దానికి రిజర్వేషన్లు తప్పనిసరి కొంత కాలం వరకు. తర్వాత ఎవరికి వారు అభివృద్ధి పథంలో నడవ గలరు. రాష్ట్రం జనాభా ఆరుకోట్లు. రాష్ట్ర ప్రభుత్వోద్యోగాల సంఖ్య మూడు నాలుగు లక్షలకు మించదు. జనాభా అంతా ప్రభుత్వోద్యోగాలమీదే బదుకు తున్నదా? కనుక ఇతరు లేమీ గాభరా పడనక్కర లేదు. ఇప్పుడు ప్రతి వర్గం వారూ హోటళ్ళు నడుపు తున్నారు. తోళ్ల వ్యాపారం చేస్తున్నారు. పై వర్గాల వారూ చేస్తున్నారు. అవినీతికరమైన వృత్తులు కూడ అవలంభిస్తున్నారు. అవి శాస్త్ర సమ్మతాలా? అన్న విక్రయం మహాపాప మన్నారు ధర్మ శాస్త్రకారులు. కాని, శ్రీనాథుని కాలం నుంచి పూటకూళ్ల యిండ్లు ఉండనే వున్నాయి. మహాచారవంతులు కూడ వాటిలో దూకలిచ్చి భోం చేయడం వుండనే వుంది. కనుక రిజర్వేషన్ల వల్ల తమ వృత్తులు పోతాయని ఎవరూ వాపోనక్కర లేదు. ఈ రిజర్వేషన్లు న్యాయంగా అమలు కావడానికి గరిష్ఠాదాయ పరిమితిని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించడం సముచితంగా వుంది. పెద్ద వ్యాపారం, మంత్రిత్వం చేసిన వెనుకబడిన వారికి ఈ రిజర్వేషన్లు ఉచితం కాదు. ప్రభుత్వం మరొక విషయం గుర్తించాలి. రిజర్వేషను సౌకర్యం గలవారు విద్యా సంస్థలకు సరిగా రాకుండా హాజరీ కోసం మాత్రం రావడం, ఉపాధ్యాయులను బెదిరించి హాజరీ వేయించుకోడం మొదలైన అకృత్యాలు చేస్తున్నట్లు వింటున్నాము. వాటిని గట్టిగా అరికట్టాలి. రిజర్వేషన్ల వచ్చే విద్యార్థి వేతనం జీవనభృతి కాకూడదు. మరొక సంగతి: అందరికీ సమానావకాశా లివ్వడం సహేతుకం. కాని, ప్రమోషనులలో రిజర్వేషనులు మేధావి వర్గాన్ని క్షీణింప జేస్తుంది. అర్హత సంపాదించు కోడానికి వంద అవకాశా లివ్వండి. తర్వాతే ప్రమోషనివ్వండి. ఇంతకూ, పాశ్చాత్య దేశాలలో, ముఖ్యంగా పశ్చిమ జర్మనీ మున్నగు దేశాలలో వున్నట్లు చదువును సులభతరం చేస్తే ఏ పోటీ వుండదు. ఒకటవ తరగతి నుంచి పట్టభద్ర దశవరకు ఉచిత విద్య వుంటే, రిజర్వేషన్ల ప్రసక్తే వుండదు. అలాటి సదవకాశం కోసం చూద్దాం.

## ఉపశ్రుతి:–

వామ్మయ్యో! ఇంత కాలానికి నన్నయ వైదీకి అని నిర్ధారణ అయి మనస్సు శాంతించిందోయ్!:– అన్నాడు నాతో నా మిత్రు డొకడు. ఏమిటి? చారిత్రకంగా నన్నయ ఫలానా శాఖవాడు, ఫలానా శాస్త్రి గారి కుమారుడు అని ఆధారాలు దొరికాయా?– అనడిగాను. పాత ఆధారా లెందుకోయ్! సాహిత్య అకాడెమి వాళ్లు నన్నయను గురించి వ్రాయించిన పుస్తకంలో వివిధ శీర్షికల వ్యాసాలు వ్రాసిన వారంతా వైదికులే. అంతకన్నా మరేం ఆధారం కావాలి?– అన్నాడు మిత్రుడు.

– తిరుమల రామచంద్ర




*Printed and Published for Nageswara Rao Estates Private Ltd.,*
*by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3,*
*Editor. S. Radhakrishna; Phones :- Business : 61247, 61248, Editorial : 75667*

ఉషా కిరణ్ మూవీస్






# కారుదిద్దిన కాపురం




సత్యం, నవకాంత్
గౌతంరాజు, భాస్కరరాజు
శివ-సుబ్రహ్మణ్యం
అట్లూరి రామారావు

రామోజీరావు • డి.వి.నరసరాజు